# వివేకచూడామణి



నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# వివేకచూడామణి

వ్యాఖ్యాత

## నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

*by:*

**Sri Ramakrishna Tapovanam**

20, Race Course Road
Guindy, Chennai - 600 032
Mobile : 09884708559
Email : chvenkateswarlu30@gmail.com
website : www.sriramakrishnatapovanam.org

# ముందుమాట

ఆదిశంకరులు రచించిన ప్రకరణ గ్రంథాలలో అత్యంత ప్రసిద్ధము, ప్రశస్తము, ముముక్షువులకు అత్యంతోపయుక్తము అయిన గ్రంథం వివేక చూడామణి. కొన్ని ప్రకరణ గ్రంథాల కర్తృత్వం విషయంలో అభిప్రాయ భేదాలు ఉన్నా, వివేకచూడామణి విషయంలో అభిప్రాయభేదానికి తావులేదు. విషయ ప్రతిపాదనం, శైలి, రచనాసంవిధానం మొదలైన విషయాలను పరిశీలిస్తే అసంఖ్యాకంగా పేర్కొనబడే ప్రకరణ గ్రంథాలలో కొన్ని మాత్రమే ఆదిశంకరులవి; వాటిలో తలమానికంలాంటిది వివేకచూడామణి.

అద్వైత వేదాంతానికి సంబంధించిన విషయాలన్నీ ఒక క్రమపద్ధతిలో, సులభగ్రాహ్యంగా, ఇందులో వివరింపబడ్డాయి. ప్రస్థానత్రయ సారాంశం అంతా ఈ గ్రంథంలో ఉన్నందున, ప్రస్థానత్రయ చదవలేనివారికీ, చదివినవారు మననం చేసుకోవటానికీ ఈ గ్రంథం మిక్కిలి ఉపకరిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఇది లఘు అద్వైత వేదాంత సర్వస్వం.

తెలుగులోను, ఇతర దేశభాషల్లోను, ఆంగ్లం లాంటి విదేశ భాషల్లోను దీనికి వ్యాఖ్యలు చాలా వెలువడ్డాయి. ఈ గ్రంథ ప్రాశస్త్యాన్నిబట్టి, కొన్ని వ్యాఖ్యలు వెలువడినా ముముక్షువులు ఆదరిస్తూనే ఉంటారు. ఇందులోని ప్రతి శ్లోకానికీ శ్రుతి ప్రమాణం ఉంది. వాటి నన్నింటినీ ఉటంకిస్తూ పోతే గ్రంథం పెరిగిపోతుంది. అందుచేత శ్లోక వ్యాఖ్య చాలా క్లుప్తంగా ఇవ్వటం జరిగింది.

నా రచనా వ్యాసంగం చాలా తొందరగా, వేగంగా ఉండటంవల్ల పొరపాట్లు, తప్పులు ఉంటే ఉండటానికి అవకాశం ఉంది. "రేపు చేయాల్సిన ఒక మంచిపని ఏదైనా ఉంటే దానిని ఇవ్వాళే చేసివెయ్యి. ఇవ్వాళ చేయాల్సిన మంచిపనిని ఇప్పుడే చేసెయ్యి! నిన్ను కబళించటానికి మృత్యువు నోరు తెరచి సిద్ధంగా ఉంది" అనే సూక్తిని జీర్ణించుకున్నవాడను కాబట్టి మీనమేషాలు లెక్కించకుండా పని చేసుకుపోతాను. పండితుల అనుమానాలు తీర్చటం కోసంగాని, నా పాండిత్య ప్రకర్షకోసంగాని ఈ పనికి పూనుకోవటం లేదు. నిర్దుష్టత కోసం ప్రమాణాలకోసం వెతుక్కుంటూ కూర్చుంటే ఈ అబ్బియుర్దాయం చెల్లిపోతుంది. పైగా మన అనుమానాలను తీర్చే పండితులన్ని వెదకి పట్టుకోవటం, వారిని ప్రసన్నుల్ని చేసుకోవటం కూడా కష్టమే! అందుచేత నాకు తెలిసినంత వరకు తొందరగా వ్రాయటం జరుగుతోంది. వెనుకటి విధంగానే ఈ పుస్తకాన్ని కూడా సమాదరిస్తారని ఆశిస్తున్నాను.

శంకరజయంతి | విధేయుడు
7-5-1992 | వ్యాఖ్యాత

# విషయసూచిక

# వివేక చూడామణి

## మంగళాచరణం

**సర్వ వేదాంత సిద్ధాన్తగోచరం తమగోచరమ్**
**గోవిందం పరమానన్దం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్.** 1

ఆజ్ఞేయుడైనప్పటికీ సమస్త వేదాంత సిద్ధాంత వాక్యాల ద్వారా తెలియబడుతూ ఉన్నట్టి, పరమానంద స్వరూపుడైనట్టి, సద్గురువైన శ్రీ గోవిందునికి నమస్కరిస్తున్నాను.

గోవింద భగవత్పాదులు శ్రీ ఆదిశంకరుల గురువు, పరబ్రహ్మ స్వరూపుడైన గురుదేవునికి నమస్కరించి గ్రంథారంభం చేస్తున్నారు. ఇందులో గురుస్తుతి దైవస్తుతి కూడా చేసినట్లైంది. గురువుకు పరమాత్మకు అభేదాన్ని చెప్పినట్లూ అయినది.

### బ్రహ్మనిష్ఠ యొక్క మహత్వం

**జంతూనాం నరజన్మ దుర్లభమతః పుం స్త్వం తతో విప్రతా**
**తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్**

**ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి**
**ర్ముక్తిర్నో శతకోటి జన్మసు కృతైః పుణ్యైర్వినా లభ్యతే.** 2

జీవులన్నింటిలోకి మనుష్య జన్మ లభించుటమనేది దుర్లభమైన విషయం. మనుష్యులలో పురుష జన్మ లభించటం ఇంకా దుర్లభం. బ్రాహ్మణ జన్మ లభించటమనేది ఇంకా దుర్లభం. బ్రాహ్మణ జన్మకంటె వైదిక ధర్మాలను ఆచరించుటయందు ఆసక్తి కలిగినవాడవటం ఇంకా దుర్లభం. విద్వాంసుడవటం అనేది అంతకంటె దుర్లభం. ఇవన్నీ ఉన్నప్పటికీ ఆత్మానాత్మ వివేకము, చక్కటి అనుభవము, బ్రహ్మత్వ భావస్థితి, మోక్షము అనేవి లభించటం వంద కోట్ల జన్మలలో చేసిన పుణ్యపరిపాకం వల్ల గాని లభించవు.

సృష్టిలోని ఇతర జీవులు పూర్వజన్మలోని కర్మఫలాన్ని అనుభవించటం తప్ప. ఈ జన్మలో ధర్మాధర్మముల నాచరించుటకు అవకాశం లేని విధంగా పుడుతున్నాయి. ఇక దేవతల విషయం చూస్తే, వారు కేవలం తాము వెనుకటి జన్మల్లో చేసుకొన్న పుణ్యకర్మల ఫలాన్ని మాత్రమే అనుభవించగలరు. మళ్ళీ పుణ్యసంపాదనమనేది వారికి సాధ్యంకాదు. పాపకర్మలు చేస్తే చేసే అవకాశం ఉంది. అందుకు తగిన శరీరాలే వారికి లభిస్తాయి.

మానవులకు తాము చేసుకొన్న పుణ్య పాపఫలాలు రెండూ అనుభవించే అవకాశం ఉంది. ఈ జన్మలో సైతం, పాప పుణ్య కర్మలు చేయగలరు. తమ పాపాల్ని ప్రాయశ్చిత్తాదుల ద్వారా పోగొట్టుకోగలరు. సత్కర్మలు చేసి మళ్ళీ పుణ్యాన్నీ సంపాదించుకోగలరు. కాబట్టి పశుపక్ష్యాదులకంటె, దేవజాతికంటె మానవజన్మ ఉత్తమమైనదని అన్నారు.

**దుర్లభం త్రయమేవైతద్దేవాను గ్రహహేతుకం**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః** 3

మనుష్యత్వము, ముముక్షుత్వం (మోక్షం పొందాలనే కోరిక) గొప్పవారితోడి (సజ్జనులతోడి) సాంగత్యము, అనే ఈ మూడూ భగవత్కృప ఉన్నందువల్ల మాత్రమే లభ్యమౌతాయి.

**లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం**
**తత్రాపి పుంస్త్వం శ్రుతి పారదర్శనం**
**యః స్వాత్మముక్తై న యతేత మూఢధీః**
**సహ్యాత్మహా స్వం వినిహ న్త్య సద్గ్రహాత్.** 4

ఇట్లా దుర్లభమైన మానవ జన్మను ఏ పుణ్యవిశేషం చేతనో, భగవత్కృప వల్లనో ఏదోవిధంగా పొంది, శ్రుతి సిద్ధాంత జ్ఞానం కలిగినట్టి పురుష జన్మను పొంది కూడా తన ఆత్మయొక్క మోక్షంకోసం ప్రయత్నించనట్టి మూఢుడు నిజంగానే ఆత్మ హంతకుడు అవుతాడు. ఎందుచేత? అసత్పదార్థమందు, అనాత్మ పదార్థాలలో, అపేక్ష కలిగివున్నందువల్ల.

**ఇతః కో న్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి**
**దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్.** 5

ఇటువంటి దుర్లభమైన మనుష్య దేహాన్నీ, పురుషత్వాన్నీ పొంది కూడా కేవలం స్వార్థసాధనలో మైమరచి సంచరించేవానికంటె మూఢుడు ఎవరుంటారు?

**వదన్తు శాస్త్రాణి యజన్తుదేవాన్**
**కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః**
**ఆత్మైక్యబోధేన వినా విముక్తి**
**ర్న సిధ్యతి బ్రహ్మశతాంతరేఽపి.** 6

అనేక శాస్త్రాలు చదివి వాటిని వ్యాఖ్యానిస్తే వ్యాఖ్యానించవచ్చుగాక, అనేకమంది దేవతలకు సంబంధించిన యాగాలు చేయవచ్చునుగాక, అనేక శుభకర్మలను చేస్తే చేయవచ్చుగాక, అనేక మంది దేవతలను పూజించవచ్చునుగాక. ఎన్ని చేసినప్పటికీ, జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని గూర్చిన జ్ఞానం (జీవుడే బ్రహ్మ అనే అద్వైత జ్ఞానం) కలిగితేనే తప్ప, ఎన్ని బ్రహ్మ కల్పాలు

గడచినప్పటికి మోక్షం లభించదు. 'జీవో బ్రహ్మైవ నాஉపరః' అనే అద్వైత భావన మిక్కిలి అవసరమన్నమాట.

**అమృతత్వ స్య నాశాస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః**
**బ్రవీతి కర్మణో ముక్తేర హేతుత్వం స్ఫుటం యతః. 7**

'ధనంవల్ల మనకు మోక్షం లభించదు' అనే విషయం 'కర్మ అనేది ముక్తికి కారణం కాదు' అనే నానుడివల్లనే స్పష్టమౌతోంది. ఉపనిషత్తులన్నీ కర్మలవల్ల మోక్షంరాదని ఘోషిస్తూ ఉన్నాయి. కాబట్టి ఆ కర్మలవల్ల మనం సంపాదించే ధనంవల్ల మోక్షం రాదనేది స్పష్టంగా తెలుస్తున్న విషయమే!

## జ్ఞానోపలబ్ధికి ఉపాయం

**అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్**
**సన్యస్తబాహ్యార్థ సుఖ స్పృహః సన్**
**సన్తం మహాన్తం సముపేత్య దేశికం**
**తేనోపదిష్టార్థ సమాహితాత్మ. 8**

అందుచేత, విద్వాంసుడైనవాడు, బాహ్యాభోగాల మీద ఉండే కోరికల్ని వదలివేసి, మహాత్ముడైన సద్గురువు శరణుజొచ్చి, శ్రద్ధగా ఆయన ఉపదేశించే విషయాలను వింటూ, ఆయన చెప్పిన విధంగా నడుచుకొంటూ మోక్షం కోసం ప్రయత్నించాలి. అంటే

**ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ**
**యోగారూఢత్వ మాసాద్య సమ్యగ్దర్శన నిష్ఠయా. 9**

ఎల్లప్పుడూ సద్వస్తువైన ఆత్మను దర్శించటంలో నిమగ్నుడై – యోగారూఢుడై – సంసార సాగరంలో మగ్నమై కొట్టుమిట్టాడుతున్న తన ఆత్మను ఉద్ధరించుకోవాలి.

**సన్న్యస్య సర్వకర్మాణి భవబంధ విముక్తయే**
**యత్యతాం పండితైర్ధీరైరాత్మాభ్యాస ఉపస్థితైః. 10**

ఇట్లా, ఎల్లప్పుడూ, ఆత్మదర్శనాభ్యాసంలో తత్పరుడైనట్టి, ధీరుడైనట్టి, విద్వాంసుడు, సమస్త కర్మలను వదలిపెట్టి ఈ ప్రాపంచిక బంధనాల నుండి విముక్తిని పొందటానికై ప్రయత్నించాలి. కర్మలు బంధహేతువులని గుర్తించాలి అని భావం. అందుకే కర్మసన్యాసాన్ని చెప్పారు. అయితే కర్మలు అనవసరమేనా? అంటే –

**చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే**
**వస్తుసిద్ధిర్విచారేణ న కించిత్ కర్మకోటిభిః. 11**

కర్మలవల్ల చిత్తశుద్ధి జరుగుతుంది. అంతే తప్ప, వస్తూఫలబ్ధికి (తత్త్వదృష్టికి) కర్మలు ఉపకరించవు. ఆత్మోపలబ్ధి అనేది విచారణవల్ల లభించాల్సిందే తప్ప, కోట్లకొలది కర్మల నాచరించినా ప్రయోజనం ఏమీ ఉండదు.

**సమ్యగ్విచారత: సిద్ధా రజ్జుతత్త్వావధారణా**
**భ్రాన్తోదితమహాసర్ప భయదుఃఖ వినాశినీ.** 12

త్రాటిని చూచి పాము అని భ్రమించి భయానికి, దుఃఖానికి లోనైతున్నాము. చక్కగా విచారణ చేసిన పిమ్మట మనం చూచింది త్రాడు అని, పాము కాదని మనకు తెలిసింది. అంతటితో సర్పమనే భ్రాంతివల్ల కలిగిన భయ దుఃఖాదులన్నీ తొలగిపోతున్నాయి. సమ్యగ్విచారణ మనేది మన భయ దుఃఖాలను పోగొడుతోంది. అట్లాగే –

**అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితో క్తితః**
**న స్నా నేన దానేన ప్రాణాయామశతేన వా.** 13

సద్గురువు మన మేలుకోరి చెప్పినట్టి హితవచనాలను చక్కగా విచారణ చేసినందువల్ల ఆత్మ వస్తువుకు సంబంధించిన నిశ్చయజ్ఞానం కలుగుతుంది. అంతే తప్ప వంద స్నానాలు చేసినా, వంద దానాలు చేసినా, వంద ప్రాణాయామాలు చేసినా తత్త్వజ్ఞానం కలగదు.

## అధికారి నిరూపణం

**అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః**
**ఉపాయా దేశకాలాద్యాః సన్త్యస్మి న్సహకారిణః** 14

అధికారియైన వానికి మాత్రమే ఫలసిద్ధి అనేది కలుగుతుంది. అయితే ఉపాయము దేశ కాలాదులు కూడా తోడ్పడితే తోడ్పడవచ్చుగాక! అధికారి కాని వానికి దేశ కాలాదుల తోడ్పాటు ఉన్నా ప్రయోజనం లేదు.

**అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసోరాత్మవస్తునః**
**సమాసాద్య దయాసిన్ధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్.** 15

కాబట్టి బ్రహ్మవేత్త అయినట్టి ఉత్తముడు, దయా సముద్రుడు అయినట్టి గురుదేవుని శరణు పొంది, జిజ్ఞాసువైనవాడు ఆత్మతత్త్వాన్ని గూర్చిన విచారణ చేయాలి.

**మేధావీ పురుషో విద్వానూహాపోహ విచక్షణః**
**అధికార్యాత్మవిద్యాయాము క్తలక్షణ లక్షితః.** 16

బుద్ధిమంతుడు, విద్వాంసుడు, తర్క వితర్క కుశలుడు అయినవాడు మాత్రమే – ఈ చెప్పబడిన లక్షణాలు కలవాడు మాత్రమే – ఆత్మవిద్యకు అధికారి. ఈ లక్షణాలు లేనివానికి ఆత్మ విద్యాధికారం లేదు అనిభావం.

**వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః**
**ముముక్షో రేవ హి బ్రహ్మజిజ్ఞాసా యోగ్యతా మతా.** 17

సదసద్వివేకం కలిగినట్టివాడు, వైరాగ్యం కలిగినవాడు, శమదమాది షట్సంపత్తి కలిగినవాడు, మోక్ష కాంక్ష కలిగినవాడు మాత్రమే బ్రహ్మజిజ్ఞాసకు యోగ్యమైనవాడు. శమం, దమం, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానం అనే ఆరింటిని షట్సంపత్తి అంటారు.

## సాధన చతుష్టయం

**సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః**
**యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి.** 18

విద్వాంసులైనవారు జిజ్ఞాసకు నాలుగు సాధనాలు చెప్పారు. ఆ నాలుగూ ఉన్నప్పుడే సత్యస్వరూపమైన ఆత్మయందు స్థితి (ఆత్మనిష్ఠ) కలుగుతుంది. ఆ నాలుగు సాధనాలూ లేనప్పుడు ఆత్మనిష్ఠ కలగదు. ఆ నాలుగు సాధనాలూ ఏవంటే–

**ఆదౌ నిత్యానిత్య వస్తు వివేకః పరిగణ్యతే**
**ఇహాముత్ర ఫలభోగ విరాగ స్తదన న్తరమ్.** 19

శమాది షట్కసంపత్తి ర్ముముక్షుత్వమితి స్ఫుటమ్

1. **నిత్యానిత్య వస్తు వివేకము:** ఏది నిత్యము! ఏది అనిత్యము! ఏది సత్యము! ఏది అసత్యము! ఏది ఆత్మ! ఏది అనాత్మ! అను జ్ఞానం.
2. **వైరాగ్యం:** ఈ లోకానికి సంబంధించిన సుఖభోగాల యెడల, పరలోకాలకు సంబంధించిన భోగాల యెడల వైరాగ్యం కలిగి ఉండటం.
3. **షట్సంపత్తి:** శమము (అంతరింద్రియ నిగ్రహం) దమము (బ్రహ్యేంద్రియ నిగ్రహము) ఉపరతి (విహిత కర్మల్ని విధిపూర్వకంగా పరిత్యజించటం) తితిక్ష (శీతోష్ణాది కష్టాలను సహించే శక్తి) శ్రద్ధ (గురువునందు, వేదాంత వాక్యాలయందు విశ్వాసం కలిగి ఉండటం) సమాధానము (సమాధి) అనేవి షట్సంపత్తి.
4. **ముముక్షుత్వం:** మోక్షం పొందాలనే తీవ్రమైన ఆకాంక్ష–ఉత్కంఠ కలిగి ఉండటం.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యేత్యేవం రూపో వినిశ్చయః
సోఽయం నిత్యానిత్య వస్తువివేకః సముదాహృతః 20

బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య; అనే నిశ్చయాత్మకమైన జ్ఞానమే నిత్యానిత్య వస్తువివేకం అనిపించుకొంటుంది. అంటే బ్రహ్మ మాత్రమే నిత్యమైనదనీ, ఈ కనిపించే సమస్తమూ అనిత్యమనీ నిశ్చయాత్మకమైన జ్ఞానం కలగటం.

తద్వైరాగ్యం జుగుప్సా యా దర్శనశ్రవణాదిభిః. 21
దేహాదిబ్రహ్మ పర్యన్తే హ్యనిత్యే భోగవస్తుని

దర్శన శ్రవణాదుల ద్వారా ఈ శరీరం మొదలుకొని, బ్రహ్మలోక పర్యంతంగల సమస్తమూ అనిత్యమే అనే భావంతో, భోగపదార్థాలన్నింటి యెడల ఘృణాబుద్ధి కలిగి ఉండటం (అసహ్య భావంతో ఉండటం) వైరాగ్యం అనిపించుకుంటుంది.

విరజ్య విషయవ్రాతాద్దోషదృష్ట్యా ముహుర్ముహుః. 22
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే

విషయ సమూహం నుండి లేదా అంతరింద్రియాల నుండి దోష దృష్టితో మాటిమాటికి విరక్తి చెంది నిగ్రహించాలి. అట్లా జ్ఞానేంద్రియాలతో సహా మనస్సు వశమై తన లక్ష్యంతో స్థిరంగా ఉండటాన్నే శమం అంటారు.

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోలకే. 23
ఉభయేషామింద్రియాణాం సదమః పరికీర్తితః
బాహ్యానాలంబనం వృత్తేరేషోపరతిరుత్తమా. 24

కర్మేంద్రియాలను జ్ఞానేంద్రియాలను వాటివాటి విషయాల నుండి మరలించి వాటి వాటి గోలకాలలో – వాటి వాటి స్థానాల్లో నిలిపివేయటాన్ని దమము అంటారు. బాహ్య విషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా ఉండటమే ఉపరతి. విహిత కర్మలను విధి పూర్వకంగా పరిత్యజించటం ఉపరతి అవుతుంది. ఉపరతి అంటే విరక్తి.

సహసం సర్వదుఃఖానామ ప్రతికార పూర్వకమ్
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే. 25

చింత, దుఃఖము లేకుండా, ఏవిధమైన ప్రతీకారమూ లేకుండా శీతోష్ణాది సమస్త దు:ఖాలను, కష్టాలను సహించటాన్నే తితిక్ష అంటారు. తనకు ఎదుర్కోగలిగిన శక్తి, నిగ్రహించగల సామర్థ్యం ఉండి కూడా ఇతరులు చేసిన అపకారాలను, అపరాధాలను సహించే శక్తిని కూడా తితిక్ష అంటారు.

**శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యవధారణమ్**
**సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే.** 26

శాస్త్రమందు (వేదాలు, ఉపనిషత్తులు మొదలైన వాటియందు) గురువు చెప్పిన ఉపదేశంలో సత్యత్వబుద్ధి కలిగి ఉండటాన్నే 'శ్రద్ధ' అంటారు. అంటే, వేదాది సత్య శాస్త్రాలయందు, గురూపదేశంలోనూ విశ్వాసం ఉండటాన్నే శ్రద్ధ అంటారు. అట్టి శ్రద్ధవల్లనే వస్తుప్రాప్తి–ఆత్మోప లబ్ధి–కలుగుతుంది.

**సర్వదా స్థాపనం బుద్ధే శుద్ధే బ్రహ్మణి సర్వథా**
**తత్సమాధాన మిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్.** 27

బుద్ధిని ఎల్లప్పుడూ, అన్ని విధాలా శుద్ధ బ్రహ్మమందే స్థిరంగా ఉంచుకోవటాన్నే సమాధానం అంటారు. అంతే తప్ప చిత్తం కోరిన కోరికలన్నీ తీరుస్తూ ఉండటం (ఇచ్ఛా పూర్తి అనేది) సమాధానం అనిపించుకోదు. ఈ సమాధానాన్నే 'సమాధి' అని కూడా అంటారు.

**అహం కారాదిదేహాన్తా న్బంధానజ్ఞాన కల్పితాన్**
**స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా.** 28

అహంకారం మొదలుకొని శరీర పర్యంతం గల సమస్తమూ అజ్ఞాన కల్పితమైన బంధనాలే! స్వస్వరూప జ్ఞానం ద్వారా –ఆత్మజ్ఞానం ద్వారా – ఆయా బంధనాలన్నింటినీ వదిలించుకోవాలి అనే కోరికనే ముముక్షుత్వం అంటారు.

**మందమధ్యమరూపాపి వైరాగ్యేణ శమాదినా**
**ప్రసాదేనగురోః సేయం ప్రవృద్ధా సూయతే ఫలమ్.** 29

ఆ 'ముముక్షుత్వం' అనేది మందశ్రేణికి, మధ్యమ శ్రేణికి చెందినదైనప్పటికీ, అంటే. మోక్షకాంక్ష మిక్కిలి బలవత్తరంగా లేకపోయినప్పటికీ (ఏ కొంచెం ఉన్నా) గురువు యొక్క దయవల్ల ఆ అల్ప ముముక్షుత్వమే పెరిగి ఫలవంతమౌతుంది.

**వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్ర యస్య తు విద్యతే**
**తస్మిన్నేవార్థవన్తః స్యుః ఫలవన్తః శమాదయః.** 30

వైరాగ్యము, ముముక్షుత్వము అనే లక్షణాలు ఎవని యందు తీవ్రంగా ఉంటాయో, అటువంటి వాని శమదయాదులే చరితార్థములై ఫలవంతము లౌతాయి. అధికారుల్లో మంద మధ్యమ తీవ్ర భేదాలు ఉంటాయి. మందమధ్యమాధికారుల ముముక్షుత్వం గురు కృపవల్ల ఫలవంతమౌతుందని చెప్పారు. ఇందులో తీవ్ర వైరాగ్యం, ముముక్షుత్వంకల శ్రేష్ఠుడైన అధికారి విషయం చెప్పారు. ఇంకా విశదీకరిస్తున్నారు–

**ఏతయోర్మందతా యత్ర విరక్తత్వ ముముక్షయోః**
**మరౌ సలిలవత్తత్ర శమాధేర్భాసమత్రతా.** 31

ఈ వైరాగ్యము ముముక్షుత్వము అనేవి ఎక్కడ మందంగా ఉంటాయో (అల్పంగా ఉంటాయో) అక్కడ అటువంటి వానియందు – అ శమదయాదులు, మరుస్థలంలోని (ఎండమావుల్లోని) నీటిలాగా, కేవలం ఆభాస మాత్రంగా ఉంటాయి అని గ్రహించాలి.

**మోక్ష కారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ**
**స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే.** 32

**స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరేజగుః**

మోక్షానికి సాధనమైనవాటి అన్నింటిలోకి భక్తి అనేది మిక్కిలి శ్రేష్ఠమైనది, తన వాస్తవికమైన స్వరూపాన్ని ధ్యానించటాన్నే 'భక్తి' అంటారు. కొంతమంది తన ఆత్మయొక్క తత్త్వాన్ని ధ్యానించటమే 'భక్తి' అంటారు.

## గురుసేవ - ప్రశ్నవిధి

**ఉక్తసాధన సంపన్నస్తత్త్వ జిజ్ఞాసురాత్మనః**
**ఉపసీదేద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బంధవిమోక్షణం** 33

పైన చెప్పబడిన సాధన చతుష్టయసంపన్నుడైనట్టి, ఆత్మతత్త్వ జిజ్ఞాసువైనట్టివాడు, స్థితప్రజ్ఞుడైన గురువు వద్దకు పోవాలి, ఆ గురువు వల్లనే ఈ సాంసారిక బంధనాలనుండి విముక్తి జరుగుతుంది – కాబట్టి!

**శ్రోతియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః.** 34

**బ్రహ్మణ్యుపరతః శాన్తో నిరింధన ఇవానలః**
**అహైతుక దయాసింధుర్బంధురానమతాం సతాం.** 35

**తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః**
**ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేజ్జ్ఞాతవ్యమాత్మనః.** 36

శ్రోత్రియుడైనట్టి, పాపరహితుడైనట్టి, కోరికలు లేనట్టి, బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యుడైనట్టి, బ్రహ్మనిష్ఠుడైనట్టి కట్టెలు లేని నిప్పులాగా శాంతచిత్తుడైనట్టి, దయా సముద్రుడైనట్టి, శరణుజొచ్చిన సజ్జనుల మేలు కోరునట్టి గురువు వద్దకు వినయవిధేయతలతో పోయి భక్తి పూర్వకంగా పూజించి, ఆయనకు ప్రసన్నుని చేసుకొని, ఆయన సమక్షంలో తాను తెలుసుకోదలచిన విషయాన్ని ఈ విధంగా అడగాలి–

స్వామిన్నమస్తే నతలోకబన్ధో
కారుణ్యసిన్ధో పతితం భవాబ్ధౌ
మాముద్ధరాత్మీయ కటాక్షదృష్ట్యా
ఋజ్వ్యాతికారుణ్య సుధాభివృష్ట్యా. 37

శరణాగతవత్సలా! కరుణాసాగరుడా! స్వామీ! నమస్కారము! సంసార సాగరంలో పడిఉన్న నన్ను, మీ సరళమైనట్టి, అపరిమితమైనట్టి, కరుణామృతాన్ని వర్షించే మీ కృపాకటాక్షంతో ఉద్ధరించండి.

దుర్వార సంసాభవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః
భీతం ప్రసన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహం న జానే. 38

స్వామీ! తప్పించుకోవటానికి వీలు లేనట్టి ఈ సంసార దావానలంలో కాలిపోతున్నాను. పైగా దురదృష్టమనే ప్రబలమైన గాలి, ఆ అగ్నికి తోడుకాగా భయకంపితుడనై మీ శరణు జొచ్చాను. నన్నీ మృత్యువు నుండి కాపాడండి, శరణు వేడదగినవారిని ఎవరినీ (మిమ్ము తప్ప) నేను ఎరగను.

శాన్తా మహాన్తో నివసన్తి సన్తో
వసంతవల్లోకహితం చరన్తః
తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనా -
నహేతునాన్యానపి తారయన్తః. 39

భయంకరమైన ఈ సంసార సాగరాన్ని తాము దాటారు. కారుణ్యంతో అకారణంగానే ఇతరులను సైతం దాటిస్తున్నారు. ఇట్లా లోకానికి మేలు చేస్తున్నట్టి, పరమ శాంతచిత్తులైనట్టి, మహాత్ములైనట్టి తాము లోకానికి ఆనందాన్ని ఇచ్చే వసంత ఋతువువంటి వారు.

అయం స్వభావః స్వత ఏవ యత్పర -
శ్రమాపనోదప్రవణం మహాత్మనాం
సుధాంశురేష స్వయమర్క కర్కశ -
ప్రభాభితప్తామవతి క్షితిం కిల. 40

స్వామీ! మహాత్ములైనవారు ఎల్లప్పుడు ఇతరుల శ్రమను పోగొట్టటానికి పూనుకొంటారు. సూర్యుని యొక్క ప్రచండమైన వేడిమితో కాలిపోతున్న భూమిని, చంద్రుడు వచ్చి తాను శాంతింపజేస్తాడు. మహాత్ములైన వారి స్వభావం ఇట్లాగే (చంద్రుని లాగా) ఉంటుంది. గదా!

బ్రహ్మానందరసానుభూతి కలితైః పూతైః సుశీతైః సితై
ర్యుష్మద్వాక్కలశోజ్ఝితైః శ్రుతిసుఖైర్వాక్యామృతైః సేచయ
సంతప్తం భవతాపదావదహనజ్వాలాభిరేనం ప్రభో
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః. 41

స్వామీ! ప్రచండమైన సంసారదావానాల జ్వాలల్లో పడి దగ్ధమైపోతున్న ఈ దీనుణ్ణి. ఈ శరణుజొొచ్చినవానిని, తాము తమ బ్రహ్మానంద రసామృతంతో కూడినట్టి, పరమ పవిత్రమైనట్టి, శీతలమైనట్టి, నిర్మలమైనట్టి, వాగ్రూపమైన స్వర్ణకలశధారలతో – శ్రవణసుఖదమైన వచనా మృతంతో– తడపండి ఈ నా తాపాన్ని శాంతింపజేయండి ఒక్క క్షణంసేపైనా, తమ కరుణామయమైన దృష్టికి పాత్రుడైన వాడు నిజంగా ధన్యుడే!

కథం తరేయం భవిసిన్ధుమేతం
కావా గతిర్మే కతమోస్త్యుపాయః
జానే న కిచింత్కృపయావ మాం భో
సంసార దుఃఖక్షతిమాతనుష్వ. 42

"నేను ఈ సంసార సాగరాన్ని ఎట్లా దాటగలుగుతాను? నాకేది గతి? దీనికి ఉపాయం ఏమిటి?" అనే విషయాలేవి నాకు తెలియవు. ప్రభూ! దయతో నన్ను రక్షించండి ఈ సంసార దుఃఖం క్షయమైపోవటానికి తగిన ఏర్పాటు చేయండి" ఇది శిష్యుడు గురువును ప్రార్థించవలసిన తీరు.

## ఉపదేశ పద్ధతి

తథావదన్తం శరణాగతం స్వం
సంసారదావానల తాపతప్తం
నిరీక్ష్య కారుణ్యరసార్ద్ర దృష్ట్యా
దద్యాదభీతిం సహసా మహాత్మా. 43

ఈ విధంగా ప్రార్థిస్తూ తన శరణు జొచ్చినట్టి, సంసారదావానాలంలో సంతప్తుడౌతున్నట్టి శిష్యుణ్ణి, కరుణా తరంగితమైన దృష్టితో చూచి గురువు అభయప్రదానం చేయాలి.

విద్వాన్స తస్మా ఉపసత్తిమియుషే
ముముక్షవే సాధు యథోక్తకారిణే
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్. 44

అట్లా తన సన్నిధికి వచ్చి వేడినట్టి, ముముక్షువూ, చెప్పినట్లు నడచుకొనేవాడూ, శాంతచిత్తుడూ, శెమదమా ఈ విధంగా ఉపదేశం చేయాలి –

గురువుగారు అంటున్నారు–

**మా భైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః**
**సంసార సింధోస్తరణేఽ స్త్యుపాయః**
**యేనైవ యాతా యతయోఽ స్యపారం**
**తమేవ మార్గం తవ నిర్దిశామి.** 45

ఓ విద్వాసుడా! భయపడకు! నీకు అపాయమేదీ కలుగదు. ఈ సంసార సాగరాన్ని తరించేటందుకు ఉపాయం ఉన్నది. యతీశ్వరులు ఏ త్రోవన దీనిని దాటి వెళ్ళారో ఆ మార్గాన్ని నీకు చూపిస్తాను.

**అస్త్యుపాయో మహాన్కశ్చిత్సంసారభయనాశనః**
**యేన తీర్త్వా భవాంభోధిం పరమానందమాప్స్యసి.** 46

సంసార భయాన్ని పోగొట్టే ఒక గొప్ప ఉపాయం ఉన్నది. ఆ ఉపాయాన్ని అనుసరించి నీవు ఈ సంసార సాగరాన్ని దాటి పరమానందాన్ని పొందగలవు.

**వేదాంతార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్**
**తేనాత్యంతికసంసారదుఃఖనాశో భవత్యను.** 47

వేదాంత వాక్యాల్ని – ఉపనిషద్వాక్యాల్ని – వాటి అర్థాన్ని బాగా విచారణ చేయటం వల్ల ఉత్తమమైన జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం ద్వారా సాంసారిక దుఃఖం పూర్తిగా తొలగిపోతుంది.

**శ్రద్ధాభక్తిధ్యానయోగాన్ముముక్షో –**
**ర్ముక్తేర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః**
**యో వా ఏతేష్వేవ తిష్ఠత్యముష్య**
**మోక్షోఽ విద్యాకల్పితాద్దేహబన్ధాత్.** 48

శ్రద్ధ, భక్తి, ధ్యానము, యోగము, ఇవన్నీ ముక్తికి సాక్షాత్తు కారణాలని (వీటివల్ల ముక్తి లభిస్తుందని) వేదమాత చెపుతోంది. ఈ శ్రద్ధాభక్తి ధ్యానయోగాదులందు సుస్థిరుడయ్యేవాడు అవిద్యా కల్పితమైన దేహబంధనాల నుండి ముక్తుడౌతాడు.

**అజ్ఞానయోగాత్పరమాత్మనస్తవ**
**హ్యనాత్మబన్ధస్తత ఏవ సంసృతిః**

**తయోర్వివేకోదితబోధవహ్ని -**
**రజ్ఞానకార్యం ప్రదహేత్సమూలమ్. 49**

పరమాత్మవైన నీకు అజ్ఞానం వల్లనే ఈ అనాత్మయైన శరీర బంధనం వచ్చింది. అజ్ఞానం కారణంగానే జన్మ మరణరూపమైన ఈ సంసారం లభించింది. కాబట్టి ఆ ఆత్మ అనాత్మలకు సంబంధించిన వివేకంవల్ల కలిగే జ్ఞానమనే అగ్ని అజ్ఞానంవల్ల పుట్టిన ఈ సంసారాన్ని సమూలంగా భస్మం చేస్తుంది.

ఇది విన్న శిష్యుడు ఇట్లా అడుగుతున్నాడు.

## ప్రశ్న నిరూపణం

**కృపయా శ్రూయతాం స్వామిన్ప్రశ్నోఽయం క్రియతే మయా**
**తదుత్తర మహం శ్రుత్వా కృతార్థః స్యాం భవన్ముఖాత్. 50**

స్వామీ! నేనొక ప్రశ్న అడుగుతాను. దయతలచి వినండి. ఈ ప్రశ్నకు సమాధానం తమ శ్రీముఖం నుండి విని నేను కృతార్థుడనౌతాను.

**కో నామ బనః కథమేష అగతః**
**కథం ప్రతిష్ఠాస్య కథం విమోక్షః**
**కోఽసావనాత్మా పరమః క ఆత్మా**
**తయోర్వివేకః కథమేతదుచ్యతామ్. 51**

బంధనమంటే ఏది? అది ఎట్లా కలుగుతోంది? దాని ఉనికి ఎట్లా ఉంటుంది? దాని విముక్తి ఎట్లా లభిస్తుంది? అనాత్మ అంటే ఏమిటి? పరమాత్మ అని దేనిని అంటాం? పరమాత్మకు గురించిన వివేకం ఎట్లా కలుగుతుంది? దయచేసి నాకు ఈ విషయాలన్నీ చెప్పండి.

ఈ ప్రశ్నలు విని గురువుగారు శిష్యుణ్ణి ప్రశంసిస్తున్నారు –

**ధన్యోఽసి కృతకృత్యోఽసి పావితం తే కులం త్వయా**
**యదవిద్యా బంధముక్త్యా బ్రహ్మీభవితు మిచ్ఛసి. 52**

నీవు ధన్యుడవు. నీవు కృతకృత్యుడవైనావు. నీవు అవిద్యాబంధనాల నుండి విడివడి బ్రహ్మభావాన్ని పొందాలని అనుకుంటున్నావు కాబట్టి నీవల్ల నీ వంశం పవిత్రమైంది.

## స్వప్రయత్నం అవసరం

**ఋణమోచనకర్తారః పితుః సన్తి సుతాదయః**

**బంధమోచనకర్తా తు స్వస్మాదన్యో న కశ్చన.** 53

పితౄణాన్ని తీర్చటానికైతే కొడుకులు మొదలైనవారు ఉంటారు. కాని, భవబంధనాలనుండి తప్పించుకోవలంటే తాను తప్ప ఇతరులెవ్వరూ ఉండరు – ఇతరులవల్ల భవబంధనాలు తొలగవు.

**మస్తకన్యస్త భారాదేర్దుఃఖ మన్యైర్నివార్యతే**
**క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్.** 54

నెత్తిమీద నున్న బరువువల్ల కలిగిన దుఃఖాన్నైతే ఇతరులెవరైనా తప్పించటానికి అవకాశం ఉంది. కాని, ఆకలి దప్పికలవల్ల కలిగే దుఃఖం తనవల్ల తప్ప ఇతరులవల్ల తొలగదు – తాను తిన్నప్పుడే ఆకలి, తాను త్రాగినప్పుడే దప్పిక తీరతాయి. అట్లాగే –

**పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా**
**ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా.** 55

రోగం వచ్చినవాడు మందు తీసుకొని, పథ్యం ఆచరిస్తే అతనికి ఆరోగ్యం కలుగుతుందనే విషయం మనకు తెలుసు, అంతే తప్ప వెరొకరు మందు తీసుకొని పథ్యం చేస్తే ఈతని రోగం తగ్గదు గదా!

అట్లాగే –

**వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా**
**స్వేనైవ వేద్యం నను పండితేన**
**చంద్రస్వరూపం నిజచక్షుషైవ**
**జ్ఞాతవ్య మన్యైరవగమ్యతే కిం.** 56

వివేక వంతుడైనవాడు వస్తు స్వరూపాన్ని – ఆత్మ స్వరూపాన్ని – తనంతట తానుగా జ్ఞాననేత్రాలతో చక్కగా చూడాలి. అంతే తప్ప వేరొకరి ద్వారా ఆ పని జరగదు. చంద్రుని రూపాన్ని మన కండ్లతో మనమే చూడాలి తప్ప ఇతరుల ద్వారా మనకు ఎట్లా తెలుస్తుంది!

**అవిద్యాకామకర్మాదిపాశబన్ధం విమోచితుం**
**కః శక్నుయాద్వినాత్మానం కల్పకోటిశతైరపి.** 57

అవిద్య, కామం, కర్మ మొదలైన పాశబంధనాల నుండి మనంతట మనం ప్రయత్నించి విడివడాలే తప్ప. ఎన్ని యుగాలు గడచినా ఇతరులవల్ల మన భవబంధాలు వీడవు. అంటే స్వప్రయత్నం వల్లనే బంధవిముక్తికి అవకాశం ఉంది.

## ఆత్మజ్ఞాన మహత్వం

న యోగేన న సాంఖ్యేన కర్మణానో న విద్యయా

బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్షః సిద్ధ్యతి నాన్యథా. 58

మోక్షమనేది యోగంవల్ల సిద్ధించదు. సౌఖ్యంవల్ల లభించదు. కర్మలవల్ల లభించదు. విద్యలవల్లనూ లభించదు. బ్రహ్మాత్మైక్య బోధవల్ల మాత్రమే (జీవుడు బ్రహ్మ ఒకటే అనే జ్ఞానంవల్ల మాత్రమే) మోక్షం లభిస్తేంది. ఇంక దేని వల్లా లభించందు.

వీణాయా రూపసౌందర్యం తంత్రీవాదన సౌష్ఠవమ్

ప్రజారంజనమాత్రం తన్న సామ్రాజ్యాయ కల్పతే. 59

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యాన కౌశలమ్

వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే. 60

వీణయొక్క రూప లావణ్యాలు, ఆ తంత్రులను మీటంలోని మనోహరమైన పద్ధతులు (ఆ వీణ నుండి వెలువడే రాగాలు వగైరాలు) ప్రజల మనోరంజనానికి పనికి వస్తాయే తప్ప. వాటివల్ల సామ్రాజ్యప్రాప్తి జరగదు. అట్లాగే, పండితులయొక్క వాగ్విలాసాలు, ప్రవాహ రూపంలో మాటలు వెలువడే తీరు, శాస్త్రాలను వ్యాఖ్యా నించటంలోని నేర్పూ, పాండిత్యం, ఇవన్నీ భుక్తికి (భోగానికి) పనికివస్తాయే తప్ప. ముక్తికి పనికిరావు.

అవిజ్ఞాతేపరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా

విజ్ఞాతే-పి పరేతత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా. 61

పరమ తత్త్వాన్ని తెలుసుకోలేనప్పుడు శాస్త్రాలను అధ్యయనం చేయటం వ్యర్థం, దానివల్ల ఫలమేమీ ఉండదు. పరమతత్త్వాన్ని తెలుసుకొన్నప్పుడు సైతం శాస్త్రాధ్యయనం నిష్ఫలం. అంటే ఇక శాస్త్రాలను చదవాల్సిన అవసరం ఉండదని భావం.

శబ్దజాలంమహారణ్యం చిత్తభ్రమణకారణమ్

అతః ప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః. 62

శబ్దసమూహమనేది మహారణ్యంలాంటాది. ఆ శబ్ద జాలం, చిత్తాన్ని దిక్కుతోచకుండా చేసి, అటు ఇటు త్రిప్పుతూ ఉంటుంది. కాబట్టి ఎవరైనా మహాత్ముణ్ణి ఆశ్రయించి, ఆయన ద్వారా ప్రయత్న పూర్వకంగా ఆత్మ యొక్క తత్త్వాన్ని గూర్చి తెలుసుకోవాలి.

**అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా**
**కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః.** 63

అజ్ఞానమనే సర్పంవల్ల కాటువేయబడిన వానికి బ్రహ్మ జ్ఞానం అనే ఔషధం తప్ప వేదాలవల్ల, శాస్త్రాలవల్ల, మంత్రాలవల్ల, ఇతర మందులవల్ల ఏమి ప్రయోజనం ఉంటుంది? అవన్నీ నిష్ఫలం.

## అపరోక్షానుభవం అవసరం

**న గచ్ఛతి వినాపానం వ్యాధిరౌషధిశబ్దతః**
**వినాపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే.** 64

ఔషధం త్రాగితేనే తప్ప రోగం నయం కాదు. కేవలం ఔషధం పేరును ఉచ్చరించినంత మాత్రం చేత రోగం తగ్గదు. అట్లాగే, అపరోక్షానుభవం వల్ల మోక్షం లభిస్తుంది. అంతే తప్ప. కేవలం 'బ్రహ్మ' మనే శబ్దాన్ని ఉచ్చరించిన మాత్రం చేత మోక్షం లభించదు.

**అకృత్వా దృశ్యవిలయ మజ్ఞాత్వా తత్త్వమాత్మనః**
**బాహ్యశబ్దైః కుతో ముక్తిరు క్తిమాత్రఫలైర్నృణామ్.** 65

దృశ్య ప్రపంచాన్నంతా విలయం చేసి, ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొంటేనే తప్ప. కేవలం బాహ్యశబ్దాలను ఉచ్చరించినంత మాత్రం చేత, కేవలం జపాలు, భజనలు వగైరాల ద్వారా మానవులకు ముక్తి ఎట్లా లభిస్తుంది? లభించదని భావం.

**అకృత్వా శత్రుసంహారమగత్వాఖిలభూశ్రియమ్**
**రాజాహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హ తి.** 66

శత్రువులందర్నీ సంహరించాలి. సమస్త భూమండలంలో ఉన్నట్టి సంపదను పొందాలి. అప్పుడే 'రాజు' అవుతాడు. అంతే తప్ప. కేవలం 'నేను రాజును, నేను రాజును' అని అన్నంత మాత్రం చేత ఎవడూ రాజు కాదు. అట్లాగే 'అహం బ్రహ్మాస్మి' అన్నంత మాత్రంచేత ఎవడూ బ్రహ్మ కాడు; అని భావం.

**ఆప్తోక్తిం ఖననం తథోపరిశిలాద్యుత్కర్షణం స్వీకృతిం**
**నిక్షేపః సమపేక్షతే న హి బహిః శబ్దైస్తు నిర్గచ్ఛతి**

**తద్వద్ బ్రహ్మవిదోపదేశ మననధ్యానాది భిర్లభ్యతే**
**మాయాకార్య తిరోహితం స్వమమలం తత్త్వం నదుర్యు క్తిభిః.** 67

భూమిలో పాతిపెట్టబడియున్న నిక్షేపాన్ని పొందాలంటే, ముందుగా నమ్మకమైన వాడొకడు ఆ నిధిని గురించి చెప్పాలి. పిమ్మట అచటికిపోయి భూమిని త్రవ్వాలి. రాళ్ళు రప్పలు ఉంటే

వాటన్నిటినీ తొలగించాలి. అప్పుడా లభించిన ధనాన్ని గ్రహించాలి. అంతే తప్ప కేవలం మాటలవల్ల ఆ నిధి పైకిరాదు. అట్లాగే బ్రహ్మవేత్త అయిన సద్గురువైన వాని ఉపదేశాన్ని వినాలి. ఆత్మతత్త్వాన్ని గూర్చిన మనవ నిదిధ్యాసలే సాగాలి. ఇంత శ్రమపడ్డ తరువాతనే మాయా కల్పితమైన ఈ ప్రపంచం తిరోహితమైపోయి నిర్మలమైన ఆత్మతత్త్వం లభిస్తుంది. శుష్కవచనాలవల్ల లభించదు.

**తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయే**
**స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదావివ పండితైః.** 68

అందుచేత రోగాలు మొదలైనవాటి విషయంలో లాగానే, భవబంధ నివృత్తికోసం, పండితుడైనవాడు, తన సమస్త శక్తుల్నీ యుక్తుల్నీ ఉపయోగించి, తానే ప్రయత్నం చేయాలి. ఇట్లా అపరోక్షానుభూతి అవసరం అనే విషయాన్ని వివరించి, గురువుగారు, శిష్యుడు లోగడ అడిగిన ప్రశ్నల్ని మళ్ళీ ప్రస్తావించి అంటున్నారు.–

## ప్రశ్నలను గురించిన విచారణ

**యస్త్వయాద్య కృత: ప్రశ్నో వరీయాన్ శాస్త్రవిన్మతః**
**సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః.** 69

ఈ రోజున నీవు అడిగిన ప్రశ్నలను, శాస్త్రజ్ఞులు చాలా గొప్ప ప్రశ్నలని, మంచి ప్రశ్నలని అంగీకరిస్తారు. ఆ ప్రశ్నలు సూత్రరూపంలో ఉన్నా, చాలా గంభీరమైన అర్థంతో కూడి, ముముక్షువులైనవారు. తప్పకుండా తెలుసుకోదగినవిగా ఉన్నాయి.

**శ్రుణుష్వావహితో విద్వన్యన్మయా సముదీర్యతే**
**తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబన్ధాద్విమోక్ష్యసే.** 70

ఓ విద్వాంసుడా! నేను చెప్పే విషయాల్నిజాగ్రత్తగా – శ్రద్ధగా – విను. అట్లా వింటే, నీవు శీఘ్రంగానే భవబంధనాల నుండి విడిపింపబడతావు.

**మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే**
**వైరాగ్య మత్యన్త మనిత్య వస్తుషు**
**తతః శమశ్చాపి దమస్తితిక్షా**
**న్యాసః ప్రసక్తాఖిల కర్మణాం భృశమ్.** 71

**తతః శ్రుతిస్తన్మననం సతత్త్వ -**
**ధ్యానం చిరం నిత్యనిరంతరం మునేః**
**తతోఽ వికల్పం పరమేత్య విద్వా -**
**నిహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి.** 72

మోక్షం లభించాలంటే అనిత్యమైన వస్తువుల యెడల మిక్కిలి వైరాగ్యం కలిగి ఉండటం అనేది మొదటిదైన ప్రధానమైన విషయం. ఆ పిమ్మట, శమము, దమము, తితిక్ష, కోరికలతో, ఆసక్తితో కూడిన సమస్త కర్మలను వదలివేయటం, అనేవి ముఖ్యమైనవి. ఆ పిమ్మట మునియైన వానికి శ్రవణమనన నిది ధ్యాసలు – చిరకాలం ఎల్లప్పుడూ ఆత్మతత్త్వాన్ని ధ్యానం చేస్తూ ఉండాలి. అప్పుడు ఆ విద్వాంసుడు పరమ నిర్వికల్పావస్థను పొంది సుఖిస్తాడు.

**యద్బోద్ధవ్యం తవేదానీమాత్మానాత్మవివేచనం**
**తదుచ్యతే మయా సమ్యక్ శ్రుత్వాత్మన్యవధారయం.** 73

నీవు ముందుగా ఆత్మానాత్మ వివేకాన్ని పొందాలి. (ఏది ఆత్మ? ఏది ఆత్మకాదు? అనే విషయాన్ని తెలుసుకోవాలి) ఆ విషయాన్ని నీకు నేను ముందుగా బోధిస్తాను. చక్కగా విని, నీ చిత్తంలో పదిలపరచుకో!

## స్థూలశరీర వర్ణనం

**మజ్జాస్థిమేదః పలరక్తచర్మ -**
**త్వగాహ్వయైర్ధాతుభిరేభిరన్వితమ్**
**పాదోరువక్షోభుజపృష్ఠమ స్తకై -**
**రంగై రుపాంగైరుపయుక్తమేతత్.** 74

**అహం మమేతి ప్రథితం శరీరం**
**మోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః**

మజ్జ, అస్థి, మేద, మాంస, రక్త, చర్మ, త్వక్కులు అనే ఏడు ధాతువులతో నిర్మింపబడి, కాళ్లు, ఊరువులు, వక్షస్థలం, భుజాలు, వీపు, మస్తిష్కము మొదలైన అంగాలతో, ఉపాంగాలతో కూడి ఉండి, 'నేను' 'నాది' అనే మోహానికి ఆశ్రయమై ఉంటున్న ఈ దేహాన్ని విద్వాంసులు 'స్థూలశరీరం' అంటారు.

**నభోనభస్వద్దహనాంబు భూమయః**
**సూక్ష్మాని భూతాని భవన్తి తాని.** 75

**పరస్పరాంశైర్మిలితాని భూత్వా**
**స్థూలాని చ స్థూల శరీర హేతవః**
**మాత్రా స్తదీయా విషయాభవన్తి**
**శబ్దాదయః పంచ సుఖాయ భోక్తుః** 76

ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివి అనే సూక్ష్మభూతాంశాలు ఒక దానితో ఒకటి కలియటంవల్ల స్థూలంగా మారి ఈ స్థూలశరీరానికి కారణాలవుతున్నాయి. వీటి తన్మాత్రలే, భోక్త అయిన జీవునియొక్క అనుభవం కోసం శబ్ద స్పర్శ రూప రసగంధాలనే విషయాలు అవుతున్నాయి.

**య ఏషు మూఢా విషయేషు బద్ధా**
**రాగోరుపాశేన సుదుర్దమేన**
**ఆయాన్తి నిర్యాన్త్యధ ఊర్ధ్వ ముచ్చైః**
**స్వకర్మదూతేన జవేన నీతాః.** 77

మూఢులైనవారు, ఈ విషయాల్లో రాగం అనే సుదృఢమైన పెద్ద బంధనంతో బంధింప బడతారు. వారు, తమ కర్మ అనే భూతం ద్వారా తొందరగా ప్రేరేపింపబడి, అనేకమైన ఉత్తమాధమ యోనుల్లో వస్తూ పోతూ ఉంటారు – ఉత్తమాధమ జన్మల్ని పొందుతూ మరణిస్తూ ఉంటారు – అని భావం.

## విషయ నింద

**శబ్దాదిభిః పంచభిరేవ పంచ**
**పంచత్వమాపుః స్వగుణేన బద్ధాః**
**కురంగ మాతంగపతంగమీన -**
**భృంగా నరః పంచభిరంచితః కిం.** 78

తమ తమ స్వభావాల ననుసరించి, శబ్దాదులైన అయిదు విషయాలలో ఒక్కొక్క దానిచేతనే బంధింపబడే హరిణాలు, ఏనుగులు, పక్షులు, చేపలు, తుమ్మెదలు మొదలైనవన్నీ మృత్యువును పొందుతూ ఉన్నప్పుడు ఈ అయిదు విషయాలచేతా బంధింపబడిన మానవుడు మృత్యువు లేకుండా ఎట్లా తపించుకో గలుగుతాడు?

**దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి**
**విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషాప్యయమ్.** 79

విషయాలవల్ల కలిగే దోషం, నల్ల త్రాచుపాము యొక్క విషంకంటె తీవ్రమైంది. ఎందుచేతనంటే, విషమనేది, తిన్నవానినే, కాటువేయబడిన వానినే చంపుతుంది. కాని విషయాలు మాత్రం కండ్లతో చూచిన వానిని కూడా చంపకుండా వదిలిపెట్టవు.

**విషయాశామహపాశాద్యో విముక్తః సుదుస్త్యజాత్**
**స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్‌శాస్త్రవేద్యపి.** 80

విషయాల మీద ఆశ అనేది గట్టి బంధనం లాంటిది. అటువంటి విషయం కాంక్షను వదలివేసినవాడు మోక్షానికి అర్హుడు అవుతాడు. ఇతరులు – విషయాల మీది కోరికను వదలనివారు– షడ్దర్శనాలను (ఆరు శాస్త్రాలను) చదివినప్పటికీ మోక్షానికి అర్హులు కారు.

**ఆపాతవైరాగ్యవతో ముముక్షూన్**
**భవాబ్ధిపారం ప్రతియాతుముద్యతాన్**
**ఆశాగ్రహో మజ్జయతేఽన్తరాలే**
**విగృహ్య కంఠే వినివర్త్యవేగాత్.** 81

ఈ సంసార సాగరాన్ని దాటటానికి సిద్ధపడే, క్షణకమైనట్టి అల్ప వైరాగ్యం కలిగిన ముముక్షువులను, ఆశ అనే మొసలి మధ్యలోనే ఆపి, మెడ పట్టుకొని ముంచి జనం లేదని భావం.

**విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః**
**స గచ్ఛతి భవాంభోధేః పారం ప్రత్యూహవర్జితః.** 82

వైరాగ్యం అనే ఖడ్గంతో విషయకాంక్ష అనే మొసలిని చంపినవాడు మాత్రమే నిర్విఘ్నంగా సంసార సాగరం యొక్క ఆవలి ఒడ్డును చేరగలుగుతాడు.

**విషమవిషయ మార్గైర్గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః**
**ప్రతిపదమభియాతో మృత్యురప్యేష విద్ధి**
**హితసుజనగురూక్త్యా గచ్ఛతః స్వస్య యుక్త్యా**
**ప్రభవతి ఫలసిద్ధిః సత్యమిత్యేవ విద్ధి.** 83

విషయాలనే విషమ మార్గంలో నడిచే పాపబుద్ధి కలవానికి అడుగు అడుగునా మృత్యువు ఎదురౌతుందని గ్రహించు. అట్లా ఈ చెప్పబోయే విషయాన్ని కూడా గ్రహించు – మన మేలుకోరే సజ్జనుడు, లేదా గురువు చెప్పిన విధంగా తన యుక్తితో నడచేవానికి తప్పకుండా ఫలం సిద్ధిస్తుందని గ్రహించు.

**మోక్షస్య కాంక్షా యది వై తవాస్తి**
**త్యజాతిదూరాద్విషయాన్ విషం యథా**
**పీయూషవత్తోషదయాక్షమార్జవ -**
**ప్రశాంతిదాంతీర్భజ నిత్యమాదరాత్.** 84

నీకు మోక్షంమీద కోరికే గనుక ఉన్నట్లయితే విషయాలను విషంలాగా దూరం నుండే వదలి వెయ్యి. సంతోషము, దయ, క్షమ, ఆర్జవం (నిష్కాపట్యము, సరళత్వము) శమము, దమము అనే వాటిని నిత్యమూ అమృతాన్ని సేవించినట్లు సేవించు (ఆదరించి ఆచరించు).

## దేహాసక్తిని గూర్చిన నింద

**అనుక్షణం యత్పరిహృత్య కృత్య -**
**మనాద్యవిద్యాకృతబన్ధమోక్షణమ్**
**దేహః పరార్థోఽయమముష్య పోషణే**
**యః సజ్జతేః సః స్వమనేన హన్తి.** 85

అనాదియైనట్టి అవిద్యాకృతమైన బంధనం నుండి విడిపించుకోవటం మన కర్తవ్యం. అటువంటి తన కర్తవ్యాన్ని వదలిపెట్టి ప్రతిక్షణమూ ఇతరములకు భోగ్యరూపమైనట్టి ఈ దేహాన్ని పోషించటంలో నిమగ్నుడై ఉండేవాడు, తన ఈ ప్రవృత్తితో, తనను తానే చంపుకొంటున్నాడన్న మాట.

**శరీరపోషణార్థీ సన్య ఆత్మానం దిదృక్షతి**
**గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స ఇచ్ఛతి.** 86

శరీరాన్ని పోషించటంలోనే ప్రవృతుడై ఉంటూ ఆత్మతత్త్వాన్ని దర్శించాలని అనుకొనేవాడు, కఱ్ఱ అని అనుకొని, మొసలినే పట్టుకొని, నదిని దాటాలని కోరేవానితో సమానుడు.

**మోహ ఏవ మహామృత్యుర్ముముక్షోర్వపురాదిషు**
**మోహో వినిర్జితో యేన స ముక్తిపద మర్హతి.** 87

అనిత్యములు, అనాత్మలు అయిన శరీరాదులందు మోహాన్ని కలిగి ఉండటమే ముముక్షువుకు గొప్ప మృత్యువు. మోహాన్ని జయించిన వాడే మోక్షపదవికి అర్హుడు.

**మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు**
**యం జిత్వా మునయో యాన్తి తద్విష్ణోః పరమం పదం.** 88

దేహము, భార్య, కొడుకు మొదలైనవాటి యెడల ఉండే మోహము అనే మహామృత్యువును వదలి – ఆ మోహాన్ని జయించి – మునులైనవారు పరమాత్మయొక్క పరమపదాన్ని పొందుతారు.

## స్థూల శరీరం

**త్వక్మాంసరుధిరస్నాయు మేదో మజ్జాస్థి సంకులమ్**
**పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలమ్ నింద్యమిదం వపుః.** 89

చర్మము, మాంసము, రక్తము, నరాలు, వప (మేద) మజ్జ (మూలుగు) ఎముకలు మున్నగువాటితోను, మల మూత్రాదులతోను కూడి ఉన్నట్టి ఈ స్థూల దేహం అసహ్యమైనది, నింద్యమైనది.

**పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా**
**సముత్పన్నమిదం స్థూల భోగాయతన మాత్మనః**
**ఆవస్థా జాగరస్తస్య స్థూలార్థానుభవో యతః. 90**

పంచీకృతమైన స్థూలభూతాలవల్ల పూర్వకర్మాను సారంగా కలిగిన ఈ దేహం, జీవాత్మకు స్థూలమైనట్టి భోగాయతనం, జీవుడు ఈ స్థూలశరీరంతో సుఖ దు:ఖాలను అనుభవిస్తాడే, ఈ స్థూలశరీర ప్రతీతి జాగ్రదవస్థలో ఉంటుంది. (స్వప్న సుషుప్తుల్లో స్థూలశరీర ప్రతీతి ఉండదు) ఈ జాగ్రదవస్థలోనూ స్థూల పదార్థాల అనుభవం కలుగుతుంది.

(పంచీకరణం:– ప్రతి స్థూలభూతాన్ని రెండేసి భాగాలు చేయాలి. అందులోని ఒక సగభాగాన్ని మళ్ళీ నాలుగు భాగాలుగా విభజించాలి. అప్పుడు ఒక భూతంలోని సగాన్ని వేరొక భూతంలోని 1/8 భాగాన్ని కలిపితే, సగభాగం ఉన్నట్టి భూతపంచీకరణం జరుగుతోంది.

ఉ॥ పృథివి – 1/2+1/8+1/8+1/8+1/8 జలం – 1/2+1/8+1/8+1/8+1/8 పృథివిలోని 1/2 భాగాన్ని జలంలోని 1/8 భాగాన్ని కలిపితే పృథివీ భూత పంచీకరణం అవుతుంది ఇట్లాగే మిగతావి గ్రహించాలి.)

**బాహ్యేన్ద్రియైః స్థూలపదార్థసేవాం**
**స్రక్చందనస్త్ర్యాది విచిత్రరూపాం**
**కరోతి జీవః స్వయమేతదాత్మనా**
**తస్మాత్ప్రశస్తిర్వపుషోఽస్య జాగరే. 91**

ఇటువంటి శరీరంతోడి తాదాత్మ్యాన్ని చెందే జీవుడు, మాలలు, చందనం. స్త్రీ మొదలైన అనేక రకాల స్థూలపదార్థాలను బాహ్యేంద్రియాలతో అనుభవిస్తున్నాడు. అందుచేతనే జాగ్రదావస్థలో ఈ స్థూలదేహానికి ప్రాధాన్యత ఉంది.

**సర్వోఽపి బాహ్యసంసారః పురుషస్య యదాశ్రయః**
**విద్ధి దేహమిదం స్థూలం గృహవద్గృహమేధినః. 92**

దేనిని ఆశ్రయించినందున జీవునికి ఈ సమస్త బాహ్య జాగత్తూ ప్రతీతమౌతుందో, అటువంటి ఆ స్థూల దేహం, గృహస్థునికి గృహం లాంటిది అని గ్రహించు.

**స్థూలస్య సంభవజరామరణాని ధర్మాః**
**స్థౌల్యాదయో బహువిధా: శిశుతాద్యవస్థాః**
**వర్ణాశ్రమాది నియమా బహుధా యమాః స్యుః**
**పూజావమాన బహుమానముఖా విశేషాః. 93**

ఈ స్థూలదేహానికే జన్మ, మరణం, రోగం, ముసలితనం, స్థూలత్వం మొదలైనవి ఉంటాయి. అట్లాగే బాల్యం, యౌవనం మొదలైన అవస్థలుంటాయి. వర్ణాశ్రమధర్మాలు, యమ నియమాలు, గౌరవం, అవమానం మొదలైన విశేషాలన్నీ ఈ స్థూలదేహానికే ఉంటాయి.

## దశేంద్రియాలు

**బుద్ధీంద్రియాణి శ్రవణం త్వగక్షి**
**ఘ్రాణం చ జిహ్వా విషయావబోధనాత్**
**వాక్పాణిపాదం గుదమప్యుపస్థః**
**కర్మేంద్రియాణి ప్రవణేన కర్మసు.** 94

శ్రవణం (శ్రోత్రం) చర్మం, కండ్లు, ముక్కు, జిహ్వ ఈ అయిదూ జ్ఞానేంద్రియాలు, వీటినే బుద్ధీంద్రియాలంటారు. వాక్కు, పాణి (చేతులు) పాదాలు, గుదము, ఉపస్థ (జననేంద్రియం) ఇవి కర్మేంద్రియాలు, ఇవన్నీ కర్మ యందు ప్రవృత్తమాతూ ఉంటాయి. కాబట్టి కర్మేంద్రియాలన్నారు.

## అంతఃకరణ చతుష్టయం

**నిగద్యతేఽన్తఃకరణం మనోధీ -**
**రహంకృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః**
**మనస్తు సంకల్పవికల్పనాదిభి -**
**ర్బుద్ధిః పదార్థాధ్యవసాయధర్మతః** 95

**అత్రాభిమానాదహమిత్యహంకృతిః**
**స్వార్థానుసంధానగుణేన చిత్తమ్.** 96

తన వృత్తుల ననుసరించి అంతఃకరణం అనేది మనస్సు బుద్ధి, చిత్తము, అహంకారము అని నాలుగు పేర్లతో వ్యవహరింపబడుతోంది, అంటే, ఈ నాల్గింటి సమష్టి నామము అంతః కరణం అన్నమాట. సంకల్ప వికల్పాలవల్ల మనస్సు అనీ, పదార్థ నిశ్చయం చేయటంవల్ల బుద్ధి అనీ, నేను నేను (అహం అహం) అనే అభిమానం వల్ల అహంకార మనీ, తన ఇష్ట చింతనంవల్ల (స్వార్థాను సంధానంవల్ల) చిత్త మని పిలవబడుతుంది.

## పంచ ప్రాణాలు

**ప్రాణాపానవ్యానోదానసమానా భవత్యసౌ ప్రాణః**
**స్వయమేవ వృత్తిభేదాద్వికృతిభేదాత్సువర్ణసలిలాదివత్.** 97

నీరు, బంగారం మొదలైనవి తమలో కలిగే మార్పుల వల్ల భిన్నభిన్నాలుగా వ్యవహరింపబడినట్లే, ప్రాణం కూడా వృత్తి భేదంవల్ల ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అని అయిదు పేర్లతో వ్యవహరింపబడుతోంది.

## సూక్ష్మ శరీరం

**వాగాదిపంచ శ్రవణాదిపంచ**
**ప్రాణాదిపంచా భ్రముఖాని పంచ**
**బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణి**
**పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః. 98**

(1) వాక్కు మొదలైన కర్మేంద్రియాలు అయిదూ (2) శ్రవణాది జ్ఞానేంద్రియాలు అయిదూ, (3) ప్రాణం మొదలైన అయిదు ప్రాణాలూ, (4) ఆకాశం మొదలుగా గల పంచభూతాలూ, (5) బుద్ధి మొదలుగా గల అంతఃకరణ చతుష్టయం, (6) అవిద్య, (7) కామము, (8) కర్మ, అనే పుర్యష్టకాన్ని సూక్ష్మశరీరం అంటారు.

**ఇదం శరీరం శ్రుణు సూక్ష్మసంజ్ఞితం**
**లింగం త్వపంచీకృత భూతసంభవమ్**
**సవాసనం కర్మఫలానుభావకం**
**స్వాజ్ఞానతో-నాదిరుపాధిరాత్మనః. 99**

ఈ సూక్ష్మ శరీరాన్నే లింగశరీరం అంటారు. ఇది అపంచీకృతమైన భూతాలవల్ల ఉత్పన్నమైంది. వాసనలతో కూడినదై కర్మఫలాలను అనుభవిస్తూ ఉంటుంది. స్వస్వరూపజ్ఞానం లేనందువల్ల ఆత్మకు అనాదియైన ఉపాధిగా ఉంటుంది.

**స్వప్నో భవత్యస్య విభ క్త్యవస్థా**
**స్వమాత్రశేషేణ విభాతి యత్ర**
**స్వప్నే తు బుద్ధిః స్వయమేవ జాగ్రత్**
**కాలీననానావిధవాసనాభిః**

**కర్త్రాదిభావం ప్రతిపద్య రాజతే**
**యత్ర స్వయంజ్యోతిరయం పరాత్మా. 100**

స్వప్న మనేది ఈ సూక్ష్మశరీరం అభివ్యక్తమయ్యే అవస్థ, అంటే స్వప్నంలో ఉండే శరీరం సూక్ష్మశరీరం అన్న మాట. స్వప్నంలో తాను మాత్రమే మిగిలి ఉండి భాసిస్తూ ఉంటుంది. స్వప్నంలో స్వయంప్రకాశమైన పరాత్మయైన శుద్ధచేతనమే భిన్న భిన్న పదార్థాల రూపంలో భాసిస్తూ

ఉంటుంది. బుద్ధి స్వప్నంలో జాగ్రత్కాలీనమైన అనేక రకాల వాసనలతో, కర్త మొదలైన భావాలను పొంది తానే స్వయంగా ప్రతీతమౌతూ ఉంటుంది.

**ధీమాత్రకోపాధిరశేషసాక్షి**
**న లిప్యతే తత్కృత కర్మలేశైః**
**యస్మాదసంగస్తత ఏవ కర్మభి -**
**ర్న లిప్యతే కించిదుపాధినా కృతైః.** **101**

బుద్ధియే ఉపాధిగా కలిగినట్టి ఆ స్వర్వసాక్షి, ఆ బుద్ధి చేసినట్టి కర్మలతో ఏమీ సంబంధం లేకుండా, ఆ కర్మలతో ఏ మాత్రమూ అంటకుండా ఉంటాడు. అతడు అసంగుడు, కాబట్టే ఉపాధికృతమైన కర్మలు అంటకుండా ఉంటాడు.

**సర్వవ్యాపృతికరణం లింగమిదం స్యాచ్చిదాత్మనః పుంసః**
**వాస్యాదికమివ తక్షస్తేనైవాత్మా భవత్యసంగోఽయమ్.** **102**

వడ్రంగివానికి బాడిస అన్ని పనులకు ఉపయోగపడునట్లే ఈ లింగదేహం, చిదాత్మయైన పురుషుని యొక్క సమస్త వ్యాపారాలకు (అన్ని పనులకు ఉపయోగించే సాధనం, అందుచేతనే ఈ ఆత్మ అసంతమైనది.

**అంధత్వమన్దత్వపటుత్వధర్మాః**
**సౌగుణ్యవైగుణ్యవశాద్ధి చక్షుషః**
**బాధిర్యమూకత్వముఖాస్తథైవ**
**శ్రోత్రాదిధర్మా న తు వేత్తురాత్మనః.** **103**

నేత్రాల్లో దోషం ఉండటంవల్ల గ్రుడ్డితనం, మసకగా ఉండటం, దోషం లేకపోవటంవల్ల స్పష్టంగా కనపడటం మొదలైన సుగుణాలుగాని దుర్గుణాలుగాని నేత్రాల ధర్మాలు, అట్లాగే చెవుడు, మూగతనం మొదలైనవి శ్రోత్రాదుల ధర్మాలు, అంతే తప్ప సర్వసాక్షియైన ఆత్మవి కావు.

## ప్రాణముల యొక్క ధర్మము

**ఉచ్ఛ్వాస నిశ్వాస విజృంభణ క్షుత్**
**ప్రస్పన్దనాద్యుత్క్రమణాదికాః క్రియాః**
**ప్రాణాదికర్మాణి వదన్తి తజ్ఞాః**
**ప్రాణస్య ధర్మా వశనా పిపాసే.** **104**

ఊపిరి పీల్చటం, వదలటం, ఆవులింతలు, తుమ్ములు, వణకటం, ఎగరటం మొదలైన పనులన్నీ ప్రాణాదుల ధర్మాలని అంటారు. అట్లాగే ఆకలి దప్పిక మొదలైనవి కూడా ప్రాణధర్మాలనే తత్త్వజ్ఞులు అంటారు.

### అహంకారం

**అంతఃకరణమేతేషు చక్షురాదిషు వర్ష్మణి.**
**అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాస తేజసా.** 105

శరీరంలో ఈ కండ్లు మొదలైన ఇంద్రియ గోల కాలలో చిదాభాసయొక్క తేజస్సుతో వ్యాప్తమై ఉంటూన్న అంత:కరణం 'అహం' నేను అనే అభిమానాన్ని అహంకారాభిమానాన్ని వ్యక్తం చేస్తూ ఉంటుంది.

**అహంకారః స విజ్ఞేయః కర్తా భోక్తాభిమాన్యయమ్**
**సత్త్వాదిగుణయోగేన చావస్థాత్రయ మశ్నుతే.** 106

దీనినే మనం అహంకారంగా తెలుసుకోవాలి. కర్తగా, భోక్తగా, నేను నాది అనే అభిమానాన్ని చూపించేది ఇదే! ఇదే సత్త్వరజస్తమో గుణాల సంయోగంవల్ల మూడు అవస్థల్నీ పొందుతూ ఉంటుంది.

**విషయాణామానుకూల్యే సుఖీ దుఃఖీ విపర్యయే**
**సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానన్దస్యనాత్మనః.** 107

విషయాలు అనుకూలంగా ఉన్నప్పుడు సుఖం పొందుతూ, విసయాలు ప్రతికూలంగా ఉన్నప్పుడు దు:ఖాన్ని పొందుతూ ఉంటుంది. ఈ సుఖ దుఃఖాలు ఈ అహంకారం యొక్క ధర్మాలే తప్పనిత్యానందస్వరూపమైనట్టి ఆత్మవికావు.

## ఆత్మార్థమైనది ప్రేమ

**ఆత్మార్థత్వేన హి ప్రేయాన్ విషయో న స్వతః ప్రియః**
**స్వత ఏవ హి సర్వేషామాత్మా ప్రియతమో యతః.** 108

విషయాలు స్వతస్సిద్ధంగా ప్రియమైనవి కావు. ఆత్మార్థమే అవి ప్రియమైనవి అవుతున్నాయి. ఎందుచేతనంటే అందరికీ ఆత్మ అనేది ఒకటే అన్నిటికంటె ప్రియమైన వస్తువు. (ఈ విషయాన్ని బృహదారణ్యకంలో యాజ్ఞవల్క్యుడు మైత్రేయితో విపులంగా చెప్పాడు).

**తత ఆత్మా సదానందో నాస్య దుఃఖం కదాచన**
**యత్సుషుప్తౌనిర్విషయ ఆత్మానన్దోఽనుభూయతే**
**శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి. 109**

అందుచేత ఆత్మ ఎల్లప్పుడూ ఆనందస్వరూపమైనదే! ఆత్మయందు దుఃఖమనేది ఉండదు. అందుచేతనే విషయా అనుభవం లేని సుషుప్తిలో సైతం ఆత్మానందాన్ని అనుభవిస్తున్నాము, ఈ విషయంలో మనకు శ్రుతి ప్రమాణం, ప్రత్యక్ష ప్రమాణం, ఇతిహాస ప్రమాణం, అనుమాన ప్రమానం సైతం ఉన్నాయి.

## మాయా నిరూపణం

**అవ్యక్తనామ్నీ పరమేశశక్తి -**
**రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా**
**కార్యానుమేయా సుధియైవ మాయా**
**యయా జగత్సర్వమిదం ప్రసూయతే. 110**

'అవ్యక్తము' అనే పేరు కలిగినట్టి, త్రిగుణాత్మకమైనట్టి (సత్త్వ రజ స్తమస్సుల సామ్యావస్థ) అనాదియైనట్టి అవిద్యా స్వరూపం కలిగినట్టి పరమేశ్వరుని యొక్క శక్తినే మాయ అంటారు. ఆ మాయవల్లనే ఈ జగత్తు అంతా పుడుతోంది. బుద్ధిమంతులైనవారు, ఆ మాయయొక్క కార్యాలనుబట్టే, దానిని అనుమానంతో తెలుసుకొంటారు.

**సన్నాప్యసన్నా ప్యుభయాత్మికా నో**
**భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో**
**సాంగా ప్యనంగాప్యుభయాత్మికా నో**
**మహాద్భుతానిర్వచనీయరూపా. 111**

ఆ మాయ అనేది సత్తూ కాదు, అసత్తూ కాదు. సదసత్తూ కాదు, (సత్ అసత్ ల సమ్మేళనమూ కాదు) అట్లాగే అది భిన్నమూ కాదు, అభిన్నమూ కాదు, భిన్నాభిన్నము కాదు–(భిన్నము అభిన్నమూ అనే వీటి ఉభయ రూపమూ కాదు) ఇది అంగములతో కూడినదీ కాదు, అంగరహితమైనదీ కాదు; ఉభయాత్మకమూ కాదు, ఇది (మాయ) అద్భుతమైనది. అనిర్వచనీయమైన రూపం కలది.

**శుద్ధాద్వయ బ్రహ్మవిబోధనాశ్యా**
**సర్పభ్రమో రజ్జువివేకతో యథా**
**రజస్తమః సత్త్వమితి ప్రసిద్ధా**
**గుణాస్తదీయాః ప్రథితైః స్వకార్యైః. 112**

త్రాడు అనే జ్ఞానం కలగటంతోనే పాము అనే భ్రమ ఎట్లా తొలగిపోతుందో అట్లాగే శుద్ధ బ్రహ్మజ్ఞానం కలగటంతోనే ఈ మాయ అనేది తొలగిపోతుంది. ఆ మాయ యొక్క కార్యాలకువి సత్వరజస్తమో గుణాలు మూడు కారణాలు, కాబట్టి మాయ అనేది త్రిగుణాత్మకం అన్నారు.

## రజోగుణం

**విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా**
**యతః ప్రవృత్తిః ప్రసృతా పురణీ**
**రాగాదయో-స్యాః ప్రభవన్తి నిత్యం**
**దుఃఖాదయో యే మనసో వికారాః.** 113

క్రియరూపం కలిగినట్టి విక్షేపశక్తి (అవిద్యా శక్తి). రజోగుణానికి సంబంధించినట్టిది. ఈ రజోగుణం యొక్క విక్షేపశక్తివల్లనే అనాది కాలం నుండి అన్ని పనులు (క్రియలు) జరుగుతున్నాయి. దీనివల్లనే రాగము, దు:ఖము మొదలైన మానసిక వికారాలన్నీ కలుగుతున్నాయి.

**కామః క్రోధః లోభదంభాద్యసూయా -**
**హంకారేర్ష్యా మత్సరాద్యాస్తు ఘోరాః**
**ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తి -**
**ర్యస్మాదేషా తద్రజోబంధహేతుః.** 114

కామం, క్రోధం, లోభం, దంభం, అసూయ, అభిమానం, ఈర్ష్యం, మత్సరం ఈ భయంకరమైన ధర్మాలన్నీ రజోగుణానికి సంబంధించినవి, జీవులు ఈ రజోగుణం వల్లనే వివిధ కర్మలందు ప్రవృత్తి మౌతున్నాయి. కాబట్టి, ఈ రజోగుణమే జీవునికి బంధహేతువు.

## తమోగుణం

**ఏషావృతిర్నామ తమోగుణస్య**
**శక్తిర్యయా వస్త్వవభాసతేஉన్యథా**
**సైషా నిదానం పురుషస్య సంసృతే -**
**ర్విక్షేపశక్తేః ప్రసరస్య హేతుః.** 115

తమోగుణానికి ఉండే శక్తిని ఆవరణ శక్తి అంటారు. ఆవరణ శక్తి వల్లనే మనకు ఒక విధంగా ఉన్న వస్తువు మరొక విధంగా ప్రతీతమౌతుంది. ఇదే పురుషుని యొక్క జన్మమరణ రూపమైన సంసారానికి ఆది కారణం. ఇదే విక్షేప శక్తి ప్రసరించటానికి కారణం.

**ప్రజ్ఞావానపి పండితోఽపి చతురోఽప్యత్యన్తసూక్ష్మార్థదృక్**
**వ్యాలీఢ స్తమసా న వేత్తి బహుధా సంబోధితోఽపి స్ఫుటమ్**
**భ్రాన్త్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్**
**హన్తాసౌ ప్రబలా దరంతతమసః శక్తిర్మహత్యావృత్తిః.** 116

తమోగుణంచేత కప్పబడినవాడు, ఎంత బుద్ధిమంతుడైనా, ఎంత గొప్ప విద్వాంసుడైనా, నేర్పరి అయినా, అనేక శాస్త్రాలలోని సూక్ష్మార్థాలను గ్రహించగలవాడైనా, చక్కగా బోధింపబడిన విషయాన్ని సైతం సరిగా గ్రహించలేడు. తమోగుణావరణం కారణంగా భ్రమవల్ల ఆరోపితమైన వస్తువునే సత్యమని అనుకుంటాడు. వాటి గుణాలనే ఆశ్రయిస్తాడు. ఆహా! ఈ తమోగుణావరణ ప్రభావం, దాని శక్తి ఎంత ప్రబలమైనదో గదా!

**అభావనా వా విపరీతభావనా**
**సంభావనా విప్రతిప త్తిరస్యాః**
**సంసర్గయుక్తం న విముంచతి ధ్రువం**
**విక్షేపశక్తిః క్షపయత్యజస్రమ్.** 117

ఈ ఆవరణ శక్తి యొక్క సంసర్గంతో కూడిన వానిని, అభావన, విపరీత భావన, అసంభావన, విప్రతిపత్తి అనే ఈ తమోగుణ శక్తులు వదలవు. విక్షేప శక్తి సైతం అతనిని ఎల్లప్పుడూ తలక్రిందులు చేస్తూ వుంటుంది.

పరమాత్మ లేదు అనే జ్ఞానం అభావన అవుతుంది. నేను శరీరాన్ని అనే జ్ఞానం విపరీత భావన అవుతుంది. ఉన్నదా? లేదా? అవునా? కాదా? అనే సంశయం 'విప్రతిపత్తి' అవుతుంది. ఏదైనా జరగటంతో అనుమానం ఉంటే 'అసంభావన' అవుతుంది. ప్రపంచ వ్యవహారాన్నే మాయ యొక్క విక్షేపశక్తి అంటారు.

**అజ్ఞాన మాలస్యజడత్వనిద్రా -**
**ప్రమాదమూఢత్వముఖాస్తమోగుణాః**
**ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కించి -**
**న్నిద్రాళువత్ స్తంభవదేవ తిష్ఠతి.** 118

అజ్ఞానము, ఆలస్యము (సోమరితనము) జడత్వము, నిద్ర, ప్రమాదము (ఏమఱిపాటు) మూఢత్వము, మొదలైనవి తమొగుణ లక్షణాలు తమోగుణంతో కూడినవాడు, దేనినీ తెలుసుకోలేడు, నిద్రాళువులాగా, లేదా ఒక స్తంభంలాగా జడంగా ఉంటాడు.

## సత్త్వగుణం

సత్త్వం విశుద్ధం జలవత్తథాపి
తాభ్యాం మిలిత్వా సరణాయకల్పతె
యాత్రాత్మబింబః ప్రతిబింబః సన్
ప్రకాశయత్యర్క ఇవాఖిలం జడమ్. 119

సత్త్వగుణం అనేది జలంలాగా శుద్ధంగా, స్వచ్ఛంగా ఉంటుంది. అయినప్పటికీ, రజోగుణం, తమోగుణం దానితో కలియటంవల్ల ఆ సత్త్వగుణం కూడా పురుషుని సంసార బంధనానికి కారణం అవుతోంది. ఈ సత్త్వగుణంలో ప్రతి బింబితమౌతూ ఆత్మయొక్క బింబం, సూర్యబింబం లాగా, సమస్త జడపదార్థాలనూ ప్రకాశితం చేస్తోంది.

మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మా -
స్త్వమానితాద్యా నియమా యమాద్యాః
శ్రద్ధాచ భక్తిశ్చ ముముక్షుతా
దైవీ చ సంపత్తిరసన్నివృత్తిః. 120

గర్వం లేకుండా ఉండటం మొదలైన సద్గుణాలు, యమ నియమాదులు, శ్రద్ధ, భక్తి, ముముక్షుత్వం, దైవీ సంపత్తి అసత్పదార్థాల్ని వదలిపెట్టటం, ఇవన్నీ మిశ్రితమై యున్న సత్త్వగుణ ధర్మాలు

విశుద్ధ సత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానందరసం సమృచ్ఛతి. 121

ప్రసన్నత, ఆత్మానుభవం, పరమశాంతి, తృప్తి, ఆత్యంతికానందం, పరమాత్మయందు స్థితి, ఇవన్నీ విశుద్ధమైన సత్త్వగుణం యొక్క ధర్మాలు, వీటివల్ల ముముక్షువు నిత్యానంద రసాన్ని పొందుతాడు.

## కారణ శరీరం

ఆవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః
సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా
ప్రలీన సరేంద్రియబుద్ధివృత్తిః. 122

ఈ విధంగా మూడు గుణాలను నిరూపించటంవల్ల ఆవ్యక్తాన్ని వర్ణించినట్లైంది. ఇదే ఆత్మయొక్క కారణ శరీరం. సుషుప్తియందు దీని అభివ్యక్తి జరుగుతుంది. ఆ సుషుప్తిలో సమస్త బుద్ధివృత్తులూ లీనమైపోతాయి.

**సర్వప్రకార ప్రమితిప్రశాంతి -**
**ర్బీజాత్మనావస్థితిరేవ బుద్ధేః**
**సుషుప్తిరేతస్య కిల ప్రతీతి:**
**కించిన్న వేద్మీతి జగత్ప్రసిద్ధేః. 123**

ఆ సుషుప్తిలో అన్నిరకాలైన జ్ఞానమూ శాంతిస్తుంది, బుద్ధి కేవలం బీజరూపంలో మాత్రమే స్థిరంగా ఉంటుంది. 'నిద్రలో నాకేమీ తెలియ లేదు' అనే లోకంలోని ప్రసిద్ధమైన మాట ద్వారా మాత్రమే, ఈ సుషుప్తిని గూర్చిన ప్రతీతి కలుగుతోంది.

## అనాత్మ నిరూపణం

**దేహేన్ద్రియప్రాణమనోఽహమాదయః**
**సర్వే వికారా విషయాః సుఖాదయః**
**వ్యోమాదిభూతాన్యఖిలం చ విశ్వ -**
**మవ్యక్త పర్యన్తమిదం హ్యనాత్మా. 124**

దేహం, ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు, అహంకారం మొదలైన సమస్తవికారాలు, సుఖం మొదలైన సమస్త విషయాలు, ఆకాశాది భూతాలు, అవ్యక్తపర్యంతము (ప్రకృతి పర్యంతం) సమస్త విశ్వమూ అనాత్మ పదారాలే!

**మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యంతం**
**ఆసదిదమనాత్మకం త్వం విద్ధి మరు మరీచికాకల్పమ్. 125**

మాయ, మహత్తత్వం మొదలుకొని (బుద్ధి మొదలుకొని) దేహపర్యంతం గల మాయయొక్క సమస్త కార్యాలను ఎడారిలోని ఎండమావుల వంటివని, అసత్తులని, అనాత్మలని తెలుసుకో!

## ఆత్మ నిరూపణం

**అథతే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః**
**యద్విజ్ఞాయ నరో బన్ధాన్ముక్తః కైవల్యమశ్నుతే. 126**

ఇక నీకు పరమాత్మ యొక్క స్వరూపాన్ని గూర్చి చెపుతాను. అది తెలుసుకొన్నవాడు బంధనాల నుండి విడివడి కైవల్యాన్ని పొందుతాడు.

**అస్తి కశ్చిత్ స్వయం నిత్యమహం ప్రత్యయాలంబనః**
**అవస్థాత్రయ సాక్షి సన్పంచకోశవిలక్షణః** 127

అహం ప్రత్యయానికి ఆధారమైనట్టి దేదో నిత్య పదార్థం తా నొకటి ఉంది. అది మూడు అవస్థల్లోనూ – జాగ్రత్ స్వప్న సుషువుల్లో–సాక్షిగా ఉంటూ కూడా, పంచ కోశాలను అతీతంగా ఉంటుంది.

**యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు**
**బుద్ధితద్వృత్తి సద్భావమభావమహమిత్యయమ్.** 128

అదే, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల్లో బుద్ధి, దాని వృత్తులు ఉండటం లేకపోవటాన్ని 'అహం' భావంతో ఉంటూ తెలుసుకొంటుంది.

**యః పశ్యతి స్వయం సర్వం యం న ప్రశ్యతి కశ్చన**
**యశ్చేతయతి బుద్ధ్యాదిం న తు యం చేతయత్యయమ్.** 129

అది (ఆత్మ) సమస్తాన్నీ తాను చూస్తూ ఉంటుంది. అయినప్పటికీ దానిని ఎవరూ చూడలేరు. అది బుద్ధి మొదలైనవాటిని ప్రకాశింపచేస్తూ ఉంటుంది. అయినప్పటికీ బుద్ధి మొదలైనవేవీ దానిని (ఆత్మను) ప్రకాశింప చేయలేవు.

**యేన విశ్వమిదం వ్యాప్తం యన్న వ్యాప్నోతి కించన**
**ఆభారూపమిదం సర్వం యం భాన్త మనుభాత్యయమ్.** 130

అది (ఆత్మ) సమస్త విశ్వంలోనూ అంతటా వ్యాప్తమైఉంది. కాని దానిని ఎవరూ ఏదీ వ్యాప్తం చేయలేరు. ఆది ప్రకాశించటంవల్లనే ఈ సమస్త జగత్తూ ఈ విధంగా భాసితమౌతోంది – ప్రకాశింపబడుతోంది.

**యస్య సన్నిధిమాత్రేన దేహేన్ద్రియమనోధియః**
**విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ.** 131

దాని (ఆత్మయొక్క) సన్నిధి మాత్రం చేతనే – సామీప్యం మాత్రం చేతనే – దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఇవన్నీ ప్రేరేపింపడిన వానిలాగా విషయాలలో ప్రవృత్తమౌతున్నాయి.

**అహంకారాదిదేహాన్తా విషయాశ్చ సుఖాదయః**
**వేద్యన్తే ఘటవద్యేన నిత్యబోధస్వరూపిణా.** 132

అహంకారం మొదలుకొని దేహం వరకు, సుఖం మొదలుకొని సమస్త విషయాలూ, ఆ నిత్యజ్ఞాన స్వరూపం ద్వారా మనం ఘటాన్ని తెలుసుకొన్నట్లుగా తెలుసుకోబడుతున్నాయి. అవన్నీ ఆత్మద్వారా స్పష్టంగా తెలుసుకోబడుతున్నాయి.

ఏషో౽న్తరాత్మా పురుషః పురాణో
నిరంతరాఖండసుఖానుభూతిః
సదేకరూపః ప్రతిబోధమాత్రో
యేనేషితా వాగసవశ్చరన్తి. 133

ఈ నిత్య అఖండానందానుభవ రూపంలో ఉండే అంతరాత్మయే పురాణ పురుషుడు, అతడు – ఆ అంతరాత్మ – ఎల్లప్పుడూ ఏకరూపంతో బోధమాత్రుడై ఉంటాడు. జ్ఞానరూపుడై ఉంటాడు. ఆ అంతరాత్మ ప్రేరణవల్లనే వాక్కు మొదలైన ఇంద్రియాలు, ప్రాణాలు పనిచేస్తున్నాయి.

ఆత్మైవ సత్త్వాత్మని ధీగుహాయా -
మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః
ఆకాశ ఉచ్చైః రవివత్ప్రకాశతే
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్. 134

ఈ సత్త్వాత్మ – బుద్ధి అనే గుహయందున్నట్టి అవ్యక్తాకాశంలో ఒక పరమ ప్రకాశమయమైన ఆకాశం సూర్యునిలాగా తన తేజస్సుతో ఈ సమస్త ప్రపంచాన్నీ దేదీప్యమానం చేస్తు, తాను ఎంతో తీవ్రంగా ప్రకాశిస్తోంది.

జ్ఞాతా మనోహంకృతి విక్రియాణాం
దేహేంద్రియప్రాణకృతక్రియాణామ్
అయో౽గ్నివత్తాననువర్తమానో
న చేష్టతే నో వికరోతి కించన. 135

ఆ ఆత్మ అనేదే మనస్సు, అహంకారం మొదలైన వికారాలకూ, దేహము, ఇంద్రియాలు, ప్రాణాలు చేసే పనులకూ, జ్ఞాతగా ఉంటుంది. ఇవన్నీ చేసే పనులను తెలుసుకొంటూ ఉంటుంది. ఇనుప ముక్క నిప్పులో ఉంటూ కూడా ఏ విధమైన మార్పు లేకుండా, ఏ విధమైన చేష్టలూ లేకుండా ఉన్నట్లే, ఆ ఆత్మ కూడా దేహేంద్రియాలతో ఉంటూ కూడా తానేమీ చేయదు, తాను మార్పుకు లోను కాదు.

న జాయతే నో మ్రియతే న వర్ధతే
నక్షీయతే నో వికరోతి నిత్యః
విలీయమానేపి వపుష్యముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరమ్ స్వయమ్. 136

ఆత్మకు పుట్టుక లేదు, చావు లేదు, దానికి పెరుగుదల లేదు, తగుదలా లేదు, అది ఏ విధమైన మార్పుకూ లోను కాదు, అది నిత్యమైనది, కుండ బ్రద్దలైపోయినప్పటికీ ఘటాకాశం లీనం కానట్లే (బద్దలు కానట్లే) ఈ శరీరం నాశనమైనా ఇది మాత్రం నాశనం కాదు అని భావం.

**ప్రకృతివికృతిభిన్నః శుద్ధబోధస్వభావః**
**సదసదిదమశేషం భాసయన్నిర్విశేషః**
**విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా -**
**స్వహమహమితి సాక్షాత్ సాక్షిరూపేణ బుద్ధేః.** 137

ఈ ఆత్మ, ప్రకృతికంటె దాని వికారల కంటె భిన్నమైనది, శుద్ధ జ్ఞానస్వరూపం కలది, అట్టి అనిర్విశేషమైన పరమాత్మ సత్ అసత్తులు అన్నింటినీ ప్రకాశింపజేస్తూ, జాగ్రదాది అవస్థలలో అహంభావం ద్వారా (నేను, నాది అనే భావం ద్వారా) స్ఫూరిస్తూ, బుద్ధికి సాక్షిరూపంలో విలసిల్లుతూ ఉంటుంది.

**నియమితమనసా త్వం స్వమాత్మానమాత్మ -**
**న్యయమహమితి సాక్షాద్విద్ధి బుద్ధిప్రసాదాత్**
**జనిమరణతరంగాపారసంసారసిన్ధుం**
**ప్రతర భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః.** 138

నీవు చిత్తాన్ని లోబరచుకొని, బుద్ధి ప్రసన్నంగా ఉన్నప్పుడు 'ఆ ఆత్మను నేనే!' అని నీ అంతః కరణంలో ప్రత్యక్షంగా అనుభవాన్ని పొందు, ఇట్లా అపరోక్షానుభవాన్ని పొంది, జన్మమరణరూపమైన అలలతో కూడినట్టి, అపారమైనట్టి ఈ సంసారసాగరాన్ని దాటి బ్రహ్మరూపంలో స్థితిని పొంది కృతార్థుడవు కమ్ము!

## అధ్యాసం

**అత్రానాత్మన్యహమితి మతిర్బన్ధ ఏషోఽస్య పుంసః**
**ప్రాప్తోఽజ్ఞానాజ్జననమరణక్లేశసంపాతహేతుః**
**యేనైవాయం వపురిదమసత్సత్యమిత్యాత్మబుద్ధ్యా**
**పుష్యత్యుక్షత్యవతి విషయైస్తన్తుభిఃకోశకృద్వత్.** 139

పురుషుడు, అనాత్మ వస్తువులందు 'అహం – నేను' అని ఆత్మబుద్ధిని కలిగి ఉండటమే, జన్మమరణ రూపమైన క్లేశాన్ని కలిగించేటటువంటి, అజ్ఞానం వల్ల లభించే బంధనం అన్నమాట. అంటే అజ్ఞానంవల్ల అనాత్మ వస్తువులందు ఆత్మ భావాన్ని కలిగి ఉండటమే బంధనం. అజ్ఞానంవల్ల అసత్పదార్థమైన శరీరాన్ని సత్యంగా తలచి, దానినే ఆత్మగా భావించి పటుపురుగు దారాలతో

గూటిని (పట్టుకాయను) వలె, ఈ శరీరాన్ని విషయాలతో పోషిస్తూ, శుభ్రం చేస్తూ రక్షిస్తూ ఉంటాడు.

**అతస్మింస్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా**
**వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా**
**తతోఽనర్థవ్రాతో నిపతతి సమాదాతురధిక -**
**స్తతో యోఽసద్గ్రాహః స హి భవతి బంధః శ్రుణు సఖే!** 140

మూఢునికి తమోగుణం వల్లనే అన్యమైన దాని యందు అన్యబుద్ధి (ఒక దానియందు వేరొకటి అనే బుద్ధి) కలుగుతోంది. వివేకం లేనందువల్లనే రజ్జువునందు సర్ప బుద్ధి (పాము అనే బుద్ధి) కలుగుతోంది. ఇటువంటి బుద్ధి కలవానినే అనేక రకాలైన అనర్థాలు వచ్చి చుట్టు ముట్టుతాయి. కాబట్టి, ఓ మిత్రుడా! విను! అసత్తును సత్యమని అనుకోవటమే బంధనం.

**అఖండనిత్యాద్వయ బోధశక్త్యా**
**స్ఫురన్త మాత్మానమనన్తవైభవమ్**
**సమావృణోత్యావృతిశక్తిరేషా**
**తమోమయీ రాహురివార్కబింబం.** 141

అఖండము, నిత్యము, అద్వయము, జ్ఞానశక్తి ద్వారా స్ఫురింపబడే ఐశ్వర్య సంపదతో కూడిన ఈ ఆత్మతత్త్వాన్ని, సూర్యబింబాన్ని రాహువు కప్పవేసినట్లుగా, తమోమయమైన ఆవరణశక్తి కప్పివేస్తుంది.

**తిరోభూతే స్వాత్మన్యమలతరతేజోవతి పుమా -**
**ననాత్మానం మోహాదహమితి శరీరం కలయతి**
**తతః కామక్రోధప్రభృతిభిరముం బంధనగుణైః**
**పరం విక్షేపాఖ్యా రజస ఉరుశక్తిర్వ్యథయతి.** 142

మిక్కిలి నిర్మలము, తేజోమయము అయిన ఆత్మతత్త్వం తిరోభూతమైనప్పుడు – అదృశ్యమైనప్పుడు – పురుషుడు, అనాత్మయైన దేహాన్నే మోహంవల్ల 'నేను' అని అనుకుంటాడు. అంటే, అనాత్మయైె దేహాన్నే ఆత్మగా భావిస్తాడు. రజోగుణాని కుండే 'విక్షేపం' అనే అత్యంత ప్రబలమైన శక్తి తనయొక్క బంధించే గుణం కలిగినట్టి కామక్రోధాదులతో భాధిస్తూ ఉంటుంది.

**మహామోహగ్రాహగ్రసనగలితాత్మావగమనో**
**ధియో నానావస్థాః స్వయమభినయంస్తద్గుణతయా**
**అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ**
**నిమజ్యోన్మజ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః.** 143

అప్పుడు అనేక విధాల నీచగతిని పొందినట్టి, బుద్ధి హీనుడైన జీవుడు విషయాలనే విషంతో నిండిన అంతులేని ఈ సంసారసాగరంలో మునుగుతూ, లేస్తూ, మహామోహం అనే మొసలికి చిక్కి, ఆత్మజ్ఞానం నశించిపోయినందువల్ల బుద్ధికుండే గుణాలయందు అభిమానం కలవాడై దాని అనేక అవస్థలకులోనై నటిస్తూ తిరుగుతూ ఉంటాడు.

**భానుప్రభాసాజ్జనితాభ్రపంక్తి**
**ర్భానుం తిరోధాయ విజృంభతే యథా**
**ఆత్మోదితాహంకృతిరాత్మతత్త్వం**
**తథా తిరోధాయ విజృంభతే స్వయం. 144**

సూర్యుని తేజస్సుతో పుట్టిన మేఘాలు సమూహం ఆకాశంలో బాగా విస్తరించి ఆ సూర్యుణ్ణే కప్పివేసినట్లుగా ఆత్మ నుండి ప్రకటమయ్యే అహంకారం అత్మనే కప్పివేస్తూ వ్యాప్తి చెందుతుంది.

## ఆవరణ శక్తి, విక్షేపణ శక్తి

**కవలితదిననాథే దుర్దినే సాంద్రమేఘై**
**ర్వ్యథయతి హిమఝంఝావాయురుగ్రోయథైతాన్**

**అవిరతతమసాత్మన్యావృతే మూఢబుద్ధిం**
**క్షపయతి బహుదుఃఖైస్తీవ్రవిక్షేపశక్తిః. 145**

దుర్దినమందు – తుపానువల్ల, మేఘాలవల్ల సూర్యుడు కనిపించకుండా పోయిన రోజున – దట్టమైన మేఘాలవల్ల సూర్యుడు కప్పివేయబడినప్పుడ్ణు, చలివల్ల, ఈదురుగాలుల వల్ల అందరూ బాధపడతారు, అట్లాగే తమోగుణంవల్ల బుద్ధి బాగా కప్పివేయబడినప్పుడు, ఆ విక్షేపశక్తి మూఢుల్ని అనేక రకాలుగా దుఃఖితుల్ని చేస్తూ బాధ పెడుతూ ఉంటుంది.

**ఏతాభ్యామేవ శక్తిభ్యాం బన్ధః పుంసః సమాగతః**
**యభ్యాం విమోహితోదేహం మత్వాత్మానం భ్రమత్యయం. 146**

తమోగుణానిదైన ఆవరణశక్తి, రజోగుణానిదైన విక్షేపశక్తీ ఈ రెండింటివల్లను పురుషునికి బంధనప్రాప్తి కలిగింది. వీటివల్ల మోహితుడై, ఈ దేహాన్నే ఆత్మగా తలచి, సంసార చక్రంలో పడి తిరుగుతున్నాడు.

## బంధ నిరూపణం

**బీజం సంసృతి భూమిజస్య తు తమో దేహాత్మధీరంకురో**
**రాగః పల్లవమంబుకర్మ తు వపుః స్కన్ధో-సవః శాఖికాః**

**ఆఘ్రాణీన్ద్రియ సంహితశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం**
**నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాత్ర జీవః ఖగః. 147**

సంసారమనే వృక్షానికి అజ్ఞాన మనేది బీజం. దేహమందు ఆత్మబుద్ధి అనేది అంకురం. రాగం అనేది ఆకులు. కర్మ అనేది జలం. శరీర మనేది స్తంభం (మాను) ప్రాణాలు శాఖలవంటివి. ఇంద్రియాలు ఉపశాఖలు - చిన్న కొమ్మలు. విషయాలనేవి పుష్పాలు. అనేక రకాల కర్మలవల్ల లభించే దుఃఖం అనేది ఫలం. ఇటువంటి దుఃఖఫలాన్ని అనుభవించేది జీవుడు అనే పక్షి. కాబట్టి జీవుడు కర్మఫలభోక్త అన్న మాట.

**అజ్ఞానమూలోఽయమనాత్మబంధో**
**నైసర్గికోఽనాదిరనన్త ఈరితః**
**జన్మాప్యయవ్యాధిజరాదిదుఃఖ -**
**ప్రవాహపాతం జనయత్యముష్య. 148**

ఈ అజ్ఞానం వల్ల జనించినట్టి అనాత్మతోడి బంధనం అనేది స్వాభావికమని, అనాదియైనదని, అనంతమైనదని అంటారు. ఇదే జీవునికి జన్మ మరుణ వ్యాధి వార్ధక్యాది దుఃఖ పరంపరను కలిగిస్తూ ఉంటుంది.

## ఆత్మానాత్మ వివేకం

**నాస్త్రైర్నశస్త్రైరనిలేన వహ్నినా**
**ఛేత్తుం న శక్యో న చ కర్మకోటిభిః**
**వివేకవిజ్ఞాన మహాసినా వినా**
**ధాతుః ప్రసాదేన సితేన మంజునా. 149**

ఈ బంధనం అనేది విధాతయొక్క దయవల్ల లభించే వివేకజ్ఞానం అనే గొప్ప ఖడ్గంతో తప్ప ఏ ఇతర అస్త్ర శస్త్రాలవల్లను గాని, వాయువువల్ల గాని ఛేదింపబడదు.

**శ్రుతి ప్రమాణైకమతేః స్వధర్మ**
**నిష్ఠా తయైవాత్మవిశుద్ధిరస్య**
**విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం**
**తేనైవ సంసారసమూల నాశః.**

ఎవనికి శ్రుతి ప్రామాణ్యంలో దృఢమైన నిశ్చయం ఉంటుందో, అట్టివానికే స్వధర్మనిష్ఠ ఉంటుంది. అతని చిత్తమే (స్వధర్మనిష్ఠవల్ల) నిర్మలంగా ఉంటుంది. అతని చిత్తం నిర్మలంగా

ఉంటుంది. కాబట్టి వానికే పరమాత్మను గురించిన జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానంవల్లనే సంసార వృక్షం సమూలంగా నశిస్తుంది.

**కోశైరన్నమయాద్యైః పంచభిరాత్మా న సంవృతో భాతి**
**నిజశక్తిసముత్పన్నైః శైవాలపటలైరివాంబు వాపీస్థమ్.** 151

అన్నమయాది అయిదు కోశాలతోనూ కప్పబడి ఉన్నట్టి ఆత్మ పైకి భాసించదు. నీటి నుండి పుట్టిన నాచుతో కప్పబడిన నూతిలోని జలం పైకి కనపడదు గదా! అట్లాగే పంచకోశాలచే అచ్ఛాదింపబడిన ఆత్మసైతం పైకి కనిపించదు.

**తచ్ఛైవాలాపనయే సమ్యక్ సలిలం ప్రతీయతే శుద్ధమ్**
**తృష్ణా సంతాపహరం సద్యః సౌఖ్యప్రదం పరం పుంసః.** 152

**పంచానామపి కోశానామపవాదే విభాత్యయం శుద్ధః**
**నిత్యానందైకరసః ప్రత్యగ్రూపః పరః స్వయంజ్యోతిః.** 153

ఆ కప్పి ఉంచిన నాచును పూర్తిగా తొలగించినంతనే మానవుల దప్పికవలని తాపాన్ని పోగొట్టజాలినట్టి, వెంటనే సుఖాన్ని కలిగింపజాలినట్టి నీరు స్పష్టంగా కనిపిస్తుంది. అట్లాగే పంచకోశాలను కాదని త్రోసివేసినంతనే శుద్ధము, నిత్యానందైక రసస్వరూపము, అంతర్యామి, స్వయంప్రకాశము అయిన పరమాత్మ భాసిస్తాడు.

**ఆత్మానాత్మ వివేకః కర్తవ్యో బంధముక్తయే విదుషా**
**తేనైవానన్దీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానందం.** 154

బంధనాల నుండి విడివడాలంటే విద్వాంసుడైనవాడు. ఆత్మ, అనాత్మల వివేకాన్ని పొందాలి. ఆత్మానాత్మవివేకం వల్ల తానే సచ్చిదానందరూపుడని గ్రహించి ఆనందాన్ని పొందుతాడు.

**ముంజాదిషీకామివ దృశ్యవర్గా**
**త్ప్రత్యంచమాత్మానమసంగ మక్రియం**
**వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం**
**తదాత్మనా తిష్ఠతి యః స ముక్తః.** 155

అసంగము, అక్రియము అయిన ప్రత్యగాత్మను, ముంజదర్భలోని ముల్లునువలే జాగ్రత్తగా ఈ దృశ్యవర్గం నుండి వేరుచేసి, సమస్తాన్నీ దానియందే లయం చేసి, ఆత్మ భావంతో ఉన్నవాడే ముక్తపురుషుడు. ఆత్మను కప్పి ఉంచినట్టి, మనం వేరు చేయవలసినట్టి పంచకోశాలను వివరిస్తున్నారు.

**దేహోఽయమన్నభవనోఽన్నమయస్తు కోశ -**
**శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః**

**త్వక్చర్మమాంసరుధిరాస్థిపురీషరాశి -**
**ర్నాయం స్వయం భవితుమర్హతి నిత్యశుద్ధః.** 156

అన్నంతో ఉత్పన్నమైన ఈ శరీరాన్నే అన్నమయ కోశం అంటారు. అన్నం ఉంటేనే అది బ్రతికి ఉంటుంది. అన్నం లేకపోతే నశించిపోతుంది. త్వక్కు, చర్మం, మాంసం, రక్తం, ఎముకలు, మలము మొదలైనవాటి సమూహం అయిన ఈ దేహం, నిత్యము, శుద్ధము అయిన ఆత్మ కాజాలదు.

**పూర్వ్వ జనేరపి మృతేరపి నాయమస్తి**
**జాతః క్షణం క్షణగుణో-నియత స్వభావంః**
**నైకో జడశ్చ ఘటవత్పరిదృశ్యమానః**
**స్వాత్మా కథం భవతి బావవికారవేత్తా.** 157

ఈ దేహం – అన్నమయ దేహం – జన్మించటానికి పూర్వమూ ఉండటం లేదు, మృత్యువు పిమ్మటా ఉండటంలేదు. క్షణంలో పుడుతోంది, క్షణికమైన గుణాలు కలది. అస్థిర స్వభావం కలది. పైగా ఇది అనేక తత్త్వాల సమూహం. జడంలాగా, ఘటంలాగా దృశ్యమైనది. అటువంటి ఇది భావవికారాలను తెలుసుకొనే ఆత్మ ఎట్లా అవుతుంది?

**పాణిపాదాదిమాన్దేహో నాత్మా వ్యంగే-పి జీవనాత్**
**తత్తచ్ఛక్తేరనాశాచ్చ న నియమ్యో నియామకః.** 158

చేతులు, కాళ్లు వగైరాలు కలిగినట్టి ఈ దేహం ఆత్మ కాజాలదు, ఎందుచేతనంటే ఈ శరీరయొక్క అవయవాలు కొన్ని విరిగినా, లేకపోయినా, తన శక్తి ఏ మాత్రమూ తగ్గనందున పురుషుడు జీవించే ఉంటున్నాడు, పైగా, ఈ శరీరం శాసంపబడేది, ఆత్మ అనేది శాసించేది. కాబట్టి శరీరం ఆత్మ కాదు.

**దేహతద్ధర్మ తత్కర్మ తదవస్థాది సాక్షిణః**
**స్వత ఏవ స్వతః సిద్ధం తద్వైలక్షణ్యమాత్మనః.** 159

దేహానికీ, దాని ధర్మానికీ, దాని కర్మలకూ, దాని అవస్థలకూ, ఆత్మ అనేది సాక్షిగా ఉండటంవల్లనే శరీరం ఆత్మకంటె భిన్నమైనదనే విషయం రుజువౌతోంది.

**కుల్యరాశిర్మాంసలిప్తో మలపూర్ణో-తి కశ్మలంః**
**కథం భవేదయం వేత్తా స్వయమేతద్విలక్షణః.** 160

ఎముకల గూడుపై మాంసం అంటుకొని ఉన్నట్టి, మలంతో నిండి ఉన్నట్టి, మిక్కిలి అసహ్యకరమైన దేహం, తనకంటె భిన్నమైనట్టి తనను తెలుసుకోనేటటువంటి (తనకు జ్ఞాతయైనట్టి) ఆత్మ ఎట్లా కాగలుగుతుంది?

త్వక్‌మాంసమేదోఽస్థిపురీషరాశా -
వహంమతిం మూఢజనః కరోతి
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థభూతమ్. 161

చర్మం, మాంసం, వప (క్రొవ్వు) ఎముకలు, మలము మొదలైనవాటి కుప్ప (ప్రోగు) అయిన ఈ శరీరాన్ని 'నేను' అని తలుస్తారు – ఈ శరీరం మీద 'అహం' బుద్ధిని చూపుతారు. విచారశీలురైనవారు తన పరమార్థ స్వరూపాన్ని (ఆత్మను) ఈ శరీరానికి భిన్నమైన దానినిగానే తలుస్తారు.

దేహాఽహమిత్యేవ జడస్య బుద్ధి
ర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః
వివేక విజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహ విత్యేవ మతిః సదాత్మని. 162

'నేను దేహాన్ని' అని దేహంలో ఆత్మబుద్ధి మూర్ఖులకు మాత్రమే ఉంటుంది. శాస్త్రజ్ఞులైన విద్వాంసులకు జీవునియందు ఆత్మబుద్ధి ఉంటుంది. వివేక విజ్ఞానయుక్తులైన మహాత్ములకు 'అహంబ్రహ్మాస్మి' 'నేనే బ్రహ్మను' అని, సత్యమైన ఆత్మయందే అహంబుద్ధి ఉంటుంది.

అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే
త్వఙ్మాంస మేదో-స్థిపురీషరాశౌ
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే
కురుష్వ శాన్తిం పరమాం భజస్వ. 163

ఓ మూర్ఖుడా! త్వక్కు మాంసము మేద అస్థి మలరాశియైన ఈ శరీరంలో ఆత్మబుద్ధిని వదలి, సర్వాత్మయైనట్టి నిర్వకల్ప బ్రహ్మమందే ఆత్మభావాన్ని పొంది పరమశాంతిని అనుభవించుము.

దేహేన్ద్రియాదావసతి భ్రమోదితాం
విద్యానహన్తాం న జహాతి యావత్
తావన్న తస్యాస్తి విముక్తివార్తా
ప్యస్త్వేష వేదా న్తనయాన్తదర్శీ. 164

విద్వాంసుడు ఈ అసత్యమైన దేహము ఇంద్రియాలు మొదలైనవాటి యందు భ్రమవల్ల కలిగిన అహంతను (నేను నాది అనే భావాన్ని) వదలిపెట్టనంతవరకు అతడు ఎన్ని వేదాంత సిద్ధాంత గ్రంథాలను చదివినా, ఎంత పండితుడైనా అతనికి మోక్షమనేది మాత్రం అసంభవం.

ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే
యత్స్వప్నదేహే హృది కాచి -
యాథాత్మబుద్ధిస్తవ నాస్తి కాచి -
జీవచ్ఛరీరే చ తథైవ మాస్తు. 165

నీడయందు, ప్రతిబింబంలోను, స్వపంలోను, మనస్సులో కల్పించుకొన్న శరీరాల్లోనూ నీకు ఆత్మబుద్ధి ఎట్లా కలగదో, అట్లాగే బ్రతికి ఉన్న ఈ శరీరంలో సైతం ఆత్మ బుద్ధి కలుగకూడదు.

దేహాత్మధీరేవ నృణామసిద్ధ్యాం
జన్మాదిదుఃఖప్రభవస్య బీజమ్
యతస్తతస్త్వం జహి తాం ప్రయత్నా -
త్త్యక్తే తు చిత్తే న పునర్భవాశాః. 166

ఎందుచేతనంటే, దేహమే ఆత్మ అనే అసద్బుద్ధియే మానవుల జనన మరణాది దుఃఖాలు కలగటానికి కారణం కాబట్టి నీవు ప్రయత్నంతో దానిని – దేహాత్మబుద్ధిని – వదలివెయ్యి! ఆ బుద్ధిని వదలివేస్తే ఇక పునర్జన్మను గూర్చిన ఆ శంక ఉండదు.

## ప్రాణమయకోశం

కర్మేంద్రియైః పంచభిరంచితోఽయం
ప్రాణో భవేత్ప్రాణమయస్తు కోశః
యేనాత్మవానన్నమయోన్నపూర్ణః
ప్రవర్తతేఽసౌ సకలక్రియాసు. 167

అయిదు కర్మేంద్రియాలతో కూడిన ఈ ప్రాణమే ప్రాణమయకోశం అని వ్యవహరింప బడుతుంది. ఈ ప్రాణం వల్లనే ఈ అన్నమయ కోశం అన్నంవల్ల తృప్తిచెంది, సమస్త కర్మలందూ ప్రవృత్తమౌతోంది.

నైవాత్మాపి ప్రాణమయో వాయువికారో
గన్తాగన్తా వాయువద న్తర్బహిరేషః
యస్మాత్కించిత్క్వాపి న వేత్తీష్టమనిష్టం
స్వం వాన్యం వా కించన నిత్యం పరతంత్రంః. 168

ప్రాణమయకోశం సైతం ఆత్మకాదు. ఎందుచేతనంటే అది వాయువికారం కాబట్టి! వాయువులాగానే బయటకు లోపలికి వస్తూపోతూ ఉంటుంది. పైగా అది పరతంత్రమైనది కూడాను! అది ఎన్నడూ తన ఇష్టా నిష్టాలను గాని, తనదనిగాని, ఇతరులదనిగాని ఏమీ ఎరుగదు.

## మనోమయకోశం

జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయః స్యా -
త్కో శో మమాహమితి వస్తువికల్పహేతుః
సంజ్ఞాదిభేదకలనాకలితో బలీయాం
స్తత్పూర్వకోశమభిపూర్య విజృంభతే యః. 169

అయిదు జ్ఞానేంద్రియాలూ, మనస్సు కలసి మనోమయ కోశం, 'నేను, నాది' మొదలైన వికల్పాలకు హేతువు మనోమయకోశమే! నామం మొదలైన భేదాలతో కూడినందున తెలుసుకోబడుతుంది. ఇది చాలా బలీయమైనది. దీనికి పూర్వమున్న కోశాలతో వ్యాపమై ఉంటుంది.

పంచేన్ద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా
జాజ్వల్యమానో బహువాసనేన్ధనై -
ర్మనోమయాగ్నిర్దహతి ప్రపంచం. 170

పంచేంద్రియాలు అనే హోతల ద్వారా విషయాలనే ఘృతాహుతులతో బాగా పెంపొంది, అనేక రకాల వాసనలనే కట్టెపుల్లలచే (సమిధలచే ప్రజ్వలితమై, ఈ మనోమయాగ్ని, సమస్త విశ్వాన్నీ – దృశ్యప్రపంచాన్నంతటిని దగ్ధం చేస్తూ ఉంటుంది. అంటే ఇంద్రియాలు వాసనలనే పుల్లలను రగుల్కొల్పుతాయి. అప్పుడు మనోమయాగ్ని ప్రకటమౌతుంది. ఆ అగ్నిలో ఇంద్రియాలు యజ్ఞంలో హోతలలాగా విషయాలనే నేతిని అహుతులుగా ఇస్తాయి. అప్పుడే ప్రపంచం అంతా దానిలో లీనమైపోతుంది.

న హ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనోహ్యవిద్యా భవబంధహేతుః
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభితేఽస్మిన్సకలం విజృంభతే. 171

మనస్సును మించిన అవిద్య ఇంకేదీ లేదు. మనస్సే సంసారబంధనానికి హేతుభూతమైన అవిద్య, ఆ మనస్సు అనేది నశిస్తే అన్నీ నశిస్తాయి. ఆ మనస్సు అనేది విజృంభిస్తే సమస్తమూ ప్రతీతమౌతాయి–మనస్సు మేల్కొంటే అన్నీ ప్రతీతమౌతాయి.

స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాది విశ్వం మన ఏవ సర్వం
తథైవ జాగ్రత్యపి నో విశేష -
స్తత్సర్వ మేతన్మనసో విజృంభణమ్. 172

స్వప్నావస్థలో ఒక పదార్థమంటూ ఏదీ ఉండదు. అటువంటి సప్నంలో సైతం, మనస్సే తన శక్తివల్ల పూర్తిగా భోక్తను భోగ్యాదుల్నీ సృష్టిస్తోంది. అట్లాగే జాగృతిలో కూడా స్వప్నంకంటె విశేషమేమీ లేదు, జాగృతిలో కనిపించే ఇదంతా ఆ మనస్సు యొక్క విలాసమే!

**సుషుప్తికాలే మనసి ప్రలీనే**
**నైవాస్తి కించిత్సకల ప్రసిద్ధేః**
**ఆతో మనఃకల్పిత ఏవ పుసః**
**సంసార ఏతస్య న వస్తుతోఽస్తి.** 173

సుషుప్తి సమయంలో మనస్సు లీనమైపోయినందున ఏమీ ఉండదు అనే విషయం అందరికీ తెలుసు. కాబట్టి, జీవుని కున్నట్టి ఈ సంసారమంతా మనస్సుచేత కల్పింపబడినదే తప్ప, ఇంకేమీ కాదు అనే విషయం తెలుస్తోంది. వాస్తవానికి ఈ సంసారమనేది ఏమీ లేదు.

**వాయునానీయతే మేఘః పునస్తేనైవ నీయతే**
**మనాసా కల్ప్యతే బన్ధో మోక్షస్తైనైవ కల్ప్యతే.** 174

మేఘం వాయువు ద్వారా తీసికొని రాబడుతోంది. ఆ వాయువు వల్లనే దూరంగా వెళ్ళిపోతుంది. అట్లాగే మనస్సువల్లనే ఈ బంధనాలన్నీ వస్తున్నాయి. అది పోతే బంధనాలూ పోతున్నాయి. అంటే బంధ మోక్షాలకు మనస్సే కారణం అని తెలుస్తోంది.

**దేహాది సర్వవిషయే పరికల్ప్య రాగం**
**బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన**
**వైరస్యమత్ర విషవత్సు విధాయ పశ్చా -**
**దేనం విమోచయతి తన్మన ఏవ బన్ధాత్.** 175

ఈ మనస్సే దేహాదులైన సమస్త విషయాల యందు రాగాన్ని కల్పించి, త్రాటితో పశువును బంధించినట్టు ఆ రాగంతో పురుషుని బంధిస్తుంది. అట్లా విషయాలయెడల విషంలాగా అయిష్టాన్ని పుట్టించి పురుషుణ్ణి బంధనాలనుండి ముక్తుణ్ణి చేస్తుంది, మనస్సే విషయాలయెడ రాగాన్ని పుట్టించి బంధిస్తుంది వైరాగ్యాన్ని పుట్టించి ముక్తుణ్ణి చేస్తుంది అని భావం.

**తస్మాన్మనః కారణమస్య జన్తో -**
**ర్బంధస్య మోక్షస్య చ వా విధానే**
**బన్ధస్య హేతుర్మలినం రజోగుణై -**
**ర్మోక్షస్య శుద్ధం విరజస్తమస్కమ్.** 176

కాబట్టి ఈ జీవుని బంధనానికి, మోక్షానికీ మనస్సే కారణం. రజోగుణంవల్ల ఈ మనస్సు మలినమై బంధహేతువు అవుఏతోంది. రజ స్తమస్సులు లేని శుద్ధ సత్త్వగుణంతో కూడినప్పుడు మోక్షానికి కారణమౌతోంది.

**వివేకవైరాగ్యగుణాతిరేకా -**
**చ్ఛుద్ధత్వ మాసాద్య మనో విముక్త్యై**
**భవత్యతో బుద్ధిమతో ముముక్షో -**
**స్తాభ్యాం దృఢాభ్యాం భవితవ్యమగ్రే. 177**

వివేక వైరాగ్యాది గుణాలయొక్క ఉత్కర్షవల్ల నిర్మలత్వాన్ని పరిశుద్ధతను పొంది, ఈ మనస్సు ముక్తికి హేతువు అవుతోంది. కాబట్టి ముముక్షువు అయినవానికి ముందుగా జ్ఞానవైరాగ్యాలు రెండూ దృఢం కావాలి.

**మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు**
**చరత్యత్ర గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః. 178**

మనస్సనేది భయంకరమైన పెద్దపులి లాంటిది. అది విషయాలనే మహారణ్యంలో తిరుగుతూ ఉంటుంది. సాధువులు, ముముక్షువులు అయినవారు అచటికి ఆ విషయారణ్యంలోకి పోకూడదు, దూరంగా ఉండాలి.

**మనః ప్రసూతే విషయానశేషాన్ -**
**స్థూలాత్మనా సూక్ష్మతయా చ మోక్తుః**
**శరీర వర్ణాశ్రమ జాతిభేదాన్**
**గుణక్రియా హేతు ఫలాని నిత్యమ్. 179**

ఈ మనస్సే సమస్తమైన స్థూలవిషయాలను, సూక్ష్మవిషయాలను, శరీరం, వర్ణము, ఆశ్రమం, జాతి మొదలైన భేదాలను పుట్టిస్తూ ఉంటుంది అంతే కాదు. గుణము, క్రియ, హేతువు, ఫలము మొదలైనవాటిని భోక్త కోసం, జీవుని కోసం-నిత్యమూ పుట్టిస్తూ ఉంటుంది.

**అసంగ చిద్రూపమయం విమోహ్య**
**దేహేన్ద్రియప్రాణగుణైర్నిబధ్య**
**అహంమమేతి భ్రమయత్య జస్రం**
**మనః స్వకృత్యేషు ఫలోపభుక్తిషు. 180**

అసంగము, చిద్రూపము అయినట్టి ఆత్మను మోహింపజేస్తూ, దీనిని (ఆత్మను) దేహము ఇంద్రియాలు, ప్రాణాలు, గుణాలతో బంధించి, ఈ మనస్సే దీనిచేత (ఆత్మచేత) 'నేను నాది' అనే భావంతో కర్మలు చేయిస్తూ ఆ కర్మఫలాలను అనుభవిస్తూ తిరిగేటట్లు చేస్తూ ఉంటుంది.

**ఆధ్యాసదోషాత్పురుషస్య సంసృతి -**
**రధ్యాసబన్ధస్త్వమునైవ కల్పితః**
**రజస్తమోదోషవతో-వివేకినో**
**జన్మాది దుఃఖస్య నిదానమేతత్.** 181

అధ్యాస దోషంవల్లనే – ఒక దానిని మరొకటిగా తలచటం అనే మిథ్యాజ్ఞానం వల్లనే పురుషునికి జన్మ మరణ రూపమైన సంసారం కలుగుతోంది. ఈ అధ్యాసం అనేది మనస్సు చేతనే కల్పింపబడుతోంది. రజ స్తమస్సుల దోషంతో కూడిన అవివేకియైన వానికి, ఈ అధ్యాసమే, జన్మ మరణాది దుఃఖాలకు మూలకారణం అవుతోంది.

**అతః ప్రాహుర్మనో-విద్యాం పండితా స్తత్త్వదర్శినః**
**యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునేవాభ్రమండలం.** 182

అందుకే తత్త్వదర్శియైనట్టి విద్వాంసులు ఈ మనస్సునే 'అవిద్య' అంటారు. వాయువుల్ల మేఘమండలంలాగా ఈ సమస్త విశ్వమూ, మనస్సు అనే అవిద్యవల్లనే పరిభ్రమిస్తోంది.

**తన్మనః శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా**
**విశుద్ధే సతి చైతస్మిన్ముక్తిం కరఫలాయతే.** 183

ముముక్షువైనవాడు ప్రయత్నపూర్వకంగా ఆ మనస్సును శోధించాలి – పరీక్షించి పరిశుభ్రం చేయాలి. ఆ మనస్సు పరిశుద్ధమైతే ముక్తి అనేది కరతలామలకం అవుతుంది.

**మోక్షక సక్త్యా విషయేషు రాగం**
**నిర్మూల్య సన్న్యస్య చ సర్వ కర్మ**
**సచ్ఛ్రద్ధయా యః శ్రవణాది నిష్ఠో**
**రజః స్వభావం స ధునోతి బుద్ధేః.** 184

మోక్షమందలి ఆసక్తిఓ విషయాల యందుండిన రాగాన్ని నిర్మూలించి, సమస్త కర్మలను త్యజించి, పరిశుద్ధమైన శ్రుద్ధతో కూడినవాడై, శ్రవణమననాదులందు తత్పరుడై ఉండేవాడు. బుద్ధియొక్క రజోమయమైన చంచల స్వభావాన్ని పోగొట్టుకోగలుగుతాడు.

**మనోమయో నాపి భవేత్పరాత్మా**
**హ్యాద్యన్తవత్త్వా త్పరిణామి భావాత్**
**దుఃఖాత్మకత్వా ద్విషయత్వ హేతో -**
**ర్ద్రష్టా హి దృశ్యాత్మతయా న దృష్టః.** 185

పై కారణాలన్నింటినిబట్టి చూస్తే, ఆది, అంతము ఉన్నట్టి, పరిణామం కలిగి ఉన్నట్టి, దుఃఖాత్మకం అయినట్టి, విషయ స్వరూపం కలిగినట్టి ఈ మనోమయ కోశం కూడా పరాత్మ కాజాలదు. ఎందుచేతనంటే ద్రష్ట ఎన్నడూ దృశ్య రూపంలో చూడబడదు.

## విజ్ఞాన మయకోశం

**బుద్ధిర్బుద్ధీంద్రియైః సార్ధం సవృత్తిః కర్తృలక్షణః**
**విజ్ఞానమయకోశః స్యాత్పుంసః సంసార కారణ.** 186

అయిదు జ్ఞానేంద్రియాలతోనూ, వృత్తులతోనూ కూడినట్టి బుద్ధియే కర్తకుండే స్వభావం కలిగినట్టి విజ్ఞనం మయకోశం. ఇది పురుషుని యొక్క జనన మరణ రూపమైన సంసారానికి కారణం.

**అనువ్రజచ్చి త్ప్రతిబింబశక్తి**
**విజ్ఞాన సంజ్ఞః ప్రకృతేర్వికారః**
**జ్ఞానక్రియా వానహవిత్యజస్రం**
**దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశమ్.** 187

చిత్తాన్ని, ఇంద్రియాలను అనుసరించి పోతూ ఉండే చేతనం యొక్క ప్రతిబింబశక్తినే విజ్ఞన మంటారు. ఇది ప్రకృతియొక్క వికారం. ఇది 'అహం' జ్ఞానము, కర్తృజ్ఞానము (చేస్తున్నాను అనే అభిమానం) ఉండి, దేహేద్రియాదుల్లో ఎల్లప్పుడూ అభిమానం కలిగి ఉంటుంది.

**అనాదికాలోఽయ మహం స్వభావో**
**జీవః సమస్త వ్యపహార వోఢా**
**కరోతి కర్మాణ్యపి పూర్వ వాసనః**
**పుణ్యాన్య పుణ్యాని చ తత్ఫలాని.** 188

**భుంక్తే విచిత్రాస్వపి వ్రజ**
**న్యాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేషః**
**అస్యైవ విజ్ఞానమయస్య జాగ్రత్**
**స్వప్నాద్యవస్థా సుఖదుఃఖభోగం.** 189

**దేహాది నిష్ఠాశ్రమ ధర్మకర్మ**
**గుణాభిమానం సతతం మమేతి**
**విజ్ఞనకోశోఽయ మతి ప్రకాశః**
**ప్రకృష్ట సాన్నిధ్యవశా త్పరాత్మనః**

**అతో భవత్యేష ఉపాధిరస్య**
**యదాత్మధీః సంసరతి భ్రమేణ.** 190

ఈ 'అహం' స్వభావం కటిగినట్టి ఈ మనోమయ కోశమే అనాదికాలీనమైనట్టి జీవుడు జగత్తులకు సంబంధించిన సమస్త వ్యవహారాలనూ నిర్వహిస్తోంది. ఇది తన పూర్వ వాసనలవల్ల, అనేకమైన పుణ్య పాప కర్మలను చేస్తూ ఆయా కర్మల ఫలాన్ని అనుభవిస్తోంది; అనేకమైన విచిత్ర యోనుల్లో తిరుగుతూ, ఒకప్పుడు ఉన్నత స్థితినీ ఒకప్పుడు నీచస్థితినీ పొందుతూ ఉంటుంది.

జాగ్రత్ స్వప్నాద్యవస్థలూ, సుఖదుఃఖాది భోగాలూ (అనుభవాలూ) దేహాదులకు సంబంధించిన ఆశ్రమాదులలోఇన ధర్మాలు, కర్మలు, గుణాలు, వీటికి సంబంధించిన అభిమానము, మమకారంము మొదలైనవన్నీ ఈ విజ్ఞాన మయకోశంలో ఉండేవే! ఇది – ఈ విజ్ఞానమయకోశం, ఆత్మకు మిక్కిలి సమీపంలో ఉండేది కాబట్టి మిక్కిలి ప్రకాశవంతంగా ఉంటుంది. అందుచేతనే అది (విజ్ఞానమయకోశం) ఆత్మకు ఉపాధి. ఆ ఉపాధిలో పడే, దానినే (అవిజ్ఞాన మయకోశాన్నే) ఆత్మగా తలజి జీవుడు జన్మమరణరూపమైన సంసార చక్రంలో భ్రమిస్తున్నాడు.

## ఆత్మకు ఉపాధితో సంగం లేదు

**యోఽయం విజ్ఞానమయః ప్రాణేషుహృది స్ఫురత్స్వయం జ్యోతిః**
**కూటస్థః సన్నాత్మా కర్తా భోక్తా భవత్యుపాధిస్థః.** 191

ఈ స్వయంజ్యోతి, (ఆత్మ) విజ్ఞాన స్వరూపంతో హృదయంలో ప్రాణాదుల్లో స్ఫురిస్తూ ఉంటుంది. అది కూటస్థమైనప్పటికీ (నిర్వికారమైనప్పటికీ) ఉపాధి కారణంగా కర్త, భోక్త అవుతోంది.

**స్వయం పరిచ్ఛేదముపేత్య బుద్ధే**
**స్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః**
**సర్వాత్మకః సన్నపి వీక్షతే స్వయం**
**స్వతః పృథక్త్వేవ మృదోఘటానివ.** 192

ఈ పరాత్మ, మిథ్యాబుద్ధిచేత పరిచ్ఛిన్నమై, ఆ బుద్ధితో తాదాత్మ్యాన్ని పొందినందువల్ల – ఏకీభావాన్ని పొందిన దోషంవల్ల – నిజంగా తాను సర్వాత్మకమై యున్నప్పటికీ, మట్టినుండి కుండ భిన్నమైనదిగా అయినట్లు తన్ను తానే వేరు చేసుకొంటోంది.

**ఉపాధి సంబంధ వశాత్పరాత్మా**
**హ్యుపాధి ధర్మాననుభాతి తద్గుణః**
**అయోవికారాన వికారి వహ్నివ**
**త్సదైకరూపోఽపి పరః స్వభావాత్.** 193

ఆ పరాత్మ, తనదైన స్వరూపంతో ఎల్లప్పుడూ ఏక రూపం కలదే! అయినప్పటికీ ఉపాధి సంబంధంవల్ల ఆ ఉపాధియొక్క గుణాలతో కూడినదానిలాగా, ఆ ఉపాధి యొక్క ధర్మాలతో ప్రకాశితమౌతూ ఉంటుంది – లోహ వికారాలలో వ్యాప్తమైన అగ్ని, వాటిలాగానే (అలోహాదుల్లాగానే) కనిపించినట్లు!

## ముక్తి ఎట్లా జరుగుతుంది?

అని శిష్యుడు అడుగుతున్నాడు:

**భ్రమేణా ప్యన్యథా వాస్తు జీవభావః పరాత్మనః**
**తదుపాధేరనాదిత్వాన్నానాదేర్నాశ ఇష్యతే.** 194

ఓ గురుదేవా! భ్రమవల్లగాని, లేదా వేరొక కారణం వల్లగాని పరమాత్మకే జీవభావం కలిగింది. అతడు పొందిన ఉపాధి సైతం అనాదియైనదే! అనాదియైన వస్తువుకు నాశనమనేది ఉండదు గదా!

**అతోఽస్య జీవభావో-పి నిత్యోభవతి సంసృతిః**
**న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద.** 195

శ్రీ గురుదేవా! అందుచేత పై కారణంవల్ల – ఆత్మ యొక్క జీవభామ కూడా నిత్యమైనదే అవుతోంది. కాబట్టి దీనియొక్క జన్మ మరణరూపమైన సంసార చక్ర మనేది ఎన్నడూ నివృత్తం కాదు గద! అటువంటప్పుడు, జీవునికి మోక్షం ఎట్లా కలుగుతుందో చెప్పండి.

## ఆత్మజ్ఞానమే మోక్షోపాయం

శిష్యుని సందేహానికి గురువుగారు సమాధానం చెపుతున్నారు:

**సమ్యక్పృష్టం త్వయా విద్వన్సావధానేన తచ్ఛృణు**
**ప్రామాణికీ న భవతి భ్రాన్త్యా మోహితి కల్పనా.** 196

నాయనా! నీవు బుద్ధిమంతుడవు. నీవు చాలా మంచి విషయం అడిగావు. సరే! నీవు శ్రద్ధగా విను. మోహంతో కూడినవారు భ్రమకులోనై కల్పించుకొన్న కల్పన ప్రామాణికం కాదు – అంగీకరింపతగ్గది కాదు.

**భ్రాన్తిం వినా త్వసంగస్య నిష్క్రియస్య నిరాకృతేః**
**న ఘటేతార్థ సంబంధో నభసో నీలతాదివత్.** 197

నీలపు రంగు మొదలైన వాటితో ఆకాశానికి ఎట్లా ఏ విధమైనట్టి సంబంధమూ ఉండదో

అట్లాగే అసంగము, నిరాకారము, నిష్క్రియము అయిన ఆత్మకు, పదార్థాలతో ఏవిధమైన సంబంధమూ ఉండదు. (ఆకాశానికి రంగు ఉండదు. అది నీలంగా కనిపించటానికి భ్రమే కారణం.)

**స్వస్య ద్రష్టుర్నిర్గుణ స్యా క్రియస్య**
**ప్రత్యగ్బోధానందరూపస్య బుద్ధేః**
**భ్రాన్త్యా ప్రాప్తో జీవభావో న సత్యే**
**మోహపాయే నా స్త్యవస్తు స్వభావత్.** 198

సాక్షి, నిర్గుణము, అక్రియము, ప్రత్యక్ జ్ఞానానంద స్వరూపంము అయిన ఆత్మయందు, బుద్ధియొక్క భ్రమవల్ల జీవభావం ప్రాప్తించింది. అది వాస్తవమైనది కాదు. ఎందుచేతనంటే, అది (ఆత్మ) అవస్తురూపమైనదైనందున, మోహం తొలగిపోగానే స్వాభావికంగానే అది (ఆ జీవ రూపం) ఉండదు. ఎట్లాగంటే –

**యావద్ భ్రాన్తి స్తావదేవాస్య సత్తా**
**మిథ్యా జ్ఞానోజ్జృంభితస్య ప్రమాదాత్**
**రజ్జ్వాం సర్పో భ్రాంతి కాలీన ఏవ**
**భ్రాన్తే ర్నాశే నైవ సర్పోఽపి తద్వత్.** 199

భ్రమ ఉన్నంతవరకే రజ్జువునందు (త్రాటియందు) సర్పప్రతీతి ఉంటుంది. ఆ భ్రమ తొలగిపోగానే ఒక సర్ప ప్రతీతి ఉండదు. అట్లాగే భ్రమ ఉన్నంతవరకే, ప్రమాదవశాన కలిగి మిథ్యాజ్ఞానం వల్ల ప్రకటమైన జీవభావం ఉంటుంది.

**అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే**
**ఉత్పన్నాయాం తు విద్యాయామావిద్యకమనాద్యపి.** 200

**ప్రబోధే స్వప్నవత్సరం సహమూలం వినశ్యతి**

లోకంలో అవిద్య, దాని కార్యమైనట్టి జీవభావం అనేవి అనాదియైనట్టివిగా భావింపబడు తున్నాయి. కాని, మేల్కోనగానే స్వప్నంలో సాక్షాత్కరించిన సమస్తమూ సమూలంగా నష్టమైపోయినట్లే జ్ఞానోదయం కాగానే అవిద్య వల్ల కలిగిన జీవభావం నశించిపోతుంది.

**అనాద్యపీదం నో నిత్యం ప్రాగభావ ఇవ స్ఫుటమ్.** 201
**అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః**

ఈ జీవభావం అనేది అనాదియైనప్పటికి, ప్రాగభావంలాగా (ఘలవస్త్రాదులు ఉత్పత్తికి పూర్వం ఉండవు. ఈ అభావం – లేకపోవటం – ప్రాగభావం) నిత్యం, ఎందుచేతనంటే, అనాదియైన ప్రాగభావం కూడా ధ్వంసం అవటం చూస్తున్నాం.

**యద్బుద్ధ్యుపాధి సంబంధాత్పరికల్పితమాత్మని.** 202

**జీవత్వం న తతోఽన్యత్తు స్వరూపేణ విలక్షణమ్**
**సంబంధః స్వాత్మనో బుద్ధ్యా మిథ్యాజ్ఞాన పురఃసరః.** 203

**వినివృత్తిర్భవేత్తస్య సమ్యక్జ్ఞానేన నాన్యథా**
**బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సమ్యక్జ్ఞానం శ్రుతేర్మతమ్.** 204

బుద్ధి అనే ఉపాధి యొక్క సంబంధం వల్లనే ఆత్మ యందు ఏ జీవత్వ కల్పింపబడ్డద్దో, అది (ఆ జీవత్వం) స్వరూపంతో ఆత్మకంటె భిన్నమైనదేమీ కాజాలదు. బుద్ధితోడి ఆత్మయొక్క ఈ సంబంధం మిథ్యాజ్ఞానం కారణంగా కలిగిందే! సరియైన జ్ఞానం కలగటంవల్లనే ఈ మిథ్యాజ్ఞానం నివృత్తమౌతుంది – మరొక విధంగా కాదు. వాస్తవిక జ్ఞానం అంటే బ్రహ్మాత్మైక్య జ్ఞానమే అని శ్రుతి సిద్ధాంతం. కాబట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞానం కలగటంతోనే జీవభావ నివృత్తి జరుగుతుంది.

**తదాత్మానాత్మనోః సమ్యగ్వివేకేనైవ సిధ్యతి**
**తతోవివేకః కర్తవ్యః ప్రత్యగాత్మ సదాత్మనోః.** 205

అటువంటి బ్రహ్మాత్మైక్య జ్ఞానం సిద్ధించాలంటే; ఆత్మ అనాత్మలను గూర్చిన వివేకం (ఈ రెంటికీ ఉన్న భేదాన్ని గూర్చిన జ్ఞానం) చక్కగా కలగాలి. అంటే ప్రత్యగాత్మ, మిథ్యాత్మలను గూర్చిన వివేచన చక్కగా జరగాలి.

**జలం పంకవదత్యన్తం పంకాపాయే జటం స్ఫుటమ్**
**యథాభాతి తథాత్మాపి దోషాభావే స్ఫుటప్రభః.** 206

మిక్కిలి మురికనీరు కూడా బురద అడుగుభాగానకు చేరింతనే స్వచ్ఛమైన నీరే అయినట్లుగా దోషం పోగానే ఆత్మ కూడా స్పష్టంగా ప్రకాశిస్తుంది.

**ఆసన్నివృత్తౌ తు సదాత్మనా స్ఫుటం**
**ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః**
**తతో నిరాసః కరణీయ ఏవా -**
**సదాత్మనః సాధ్వహమాదివస్తునః.** 207

సత్యాత్మను గూర్చిన విచారణవల్ల అసత్తు నివర్తింపబడి ప్రత్యగాత్మ (అంతరకమైన ఆత్మ) యొక్క ప్రతీతి కలగటం ఆరంభమౌతుంది. కాబట్టి అహంకారం మొదలైనట్టి అనాత్మల (అసదాత్మల) నిరాకరణం చక్కగా జరగాలి.

**అతోనాయం పరాత్మా స్యాద్విజ్ఞానమయశబ్దభాక్**
**వికారిత్వాజ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వహేతుతః**
**దృశ్యత్వాద్వ్యభిచారిత్వాన్నానిత్యో నిత్య ఇష్యతే.** 208

కాబట్టి విజ్ఞానమయశబ్దంతో వ్యవహరింపడబే విజ్ఞాన మయకోశం కూడా వికారియైనందు వల్లను, జడమైనందు వల్లను, పరిచ్ఛిన్నము, దృశ్యము, వ్యభిచారి–అసత్యమైనది–కాబట్టి, పరాత్మ కాజాలదు. అది (విజ్ఞానమయకోశం) అనిత్యమైనది, అనిత్యమైన వస్తువు ఎన్నడూ నిత్యం కాదు.

## ఆనందమయకోశం

**ఆనంద ప్రతిబింబచుంబిత తనుర్వృత్తిస్తమోజ్జృంభితా**
**స్యాదానందమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థలాభోదయః**
**పుణ్యస్యానుభవే విభాతి కృతినామానందరూపః స్వయం**
**భూత్వానన్దతి యత్ర సాధు తనుభృన్మాత్రః ప్రయత్నంవినా.** 209

ఆనందస్వరూపమైన ఆత్మయొక్క ప్రతిబింబంచేత చుంబితమైనట్టి, తమోగుణంవల్ల ప్రకటమైనట్టి వృత్తిని ఆనందమయకోం అంటారు. ఇది ప్రియము, మోదము, ప్రమోదము అనే మూడు గుణాలతో కూడి ఉండి, తనకు అభీష్టమైన పదార్థం లభించినప్పుడు ప్రకటమౌతుంది. పుణ్య కర్మ పరిపాకంవల్ల దీనికి ఫలస్వరూపమైన సుఖం అనుభవించే సమయంలో అదృష్టవంతులైన వారికి ఈ ఆనందమయకోశం యొక్క స్వరూపం గోచరిస్తుంది. దీనివల్లనే శరీర ధారులైన జీవులందరు ఏ విధమైన ప్రయత్నం లేకుండానే ఆనందాన్ని పొందుతున్నారు.

(ప్రియము అంటే పుత్రాదులను చూచినప్పుడు కలిగే సంతోషం. మోహము అంటే మనం కోరుకున్నవి లభించినప్పుడు కలిగే సంతోషం. ప్రమోదము అంటే మోదమే అధికంగా కలిగితే ప్రమోదం.)

**ఆనందమయకోశస్య సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా**
**స్వప్నజాగరయోరీషదిష్టసందర్శనాదనా.** 210

ఆనందమయకోశం యొక్క తీవ్రప్రతీతి సుషుప్తిలో కలుగుతుంది. జాగ్రత్ స్వప్నాలలో కూడా ఇష్టవస్తు సందరన్శనాదులవల్ల ఏ కొంచెమో అది గోచరిస్తూనే ఉంటుంది.

**నైవాయమానందమయః పరాత్మా**
**సోపాధికత్వాత్ప్రకృతేర్వికారాత్**
**కార్యత్వహేతోః సుకృతక్రియాయా**
**వికారసంఘాత సమాహితత్వాత్.** 211

ఈ ఆనందమయకోశం ఉపాధితో కూడినట్టిది. ప్రకృతి వికారమైనట్టిది. శుభకర్మలకిది కార్యం. అంటే, పుణ్యకర్మలవల్ల సుఖం లభిస్తుంది కాబట్టి శుభకర్మలకిది ఫలం అన్నారు. ఇది, ప్రకృతి వికారాల సమూహమైనట్టి శరీరాన్ని ఆశ్రయించి ఉంటుంది. కాబట్టి ఈ ఆనందమయకోశం కూడా పరాత్మ కాదు.

**పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః**
**తన్ని షేధావధిః సాక్షి బోధరూపో-వశిష్యతే.** 212

శ్రుతులకు అనుకూలమైన యుక్తుల ద్వారా పంచకోశాలనూ నిషేధించగా ఆ నిషేధానికి అవధి రూపంలో మిగిలి ఉండే బోధస్వరూపము, సాక్షి అయినది ఆత్మయే మిగులుతుంది.

**యోఽయమాత్మా స్వయంజ్యోతిః పంచకోశవిలక్షణః**
**అవస్థాత్రయసాక్షి సన్నిర్వికారో నిరంజనః**
**సదానందః విజ్ఞేయః స్వాత్మత్వేన విపశితా.** 213

ఇట్లా, స్వయంప్రకాశము, అన్నమయాది పంచకోశాలకంటె విలక్షణమైనది, జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలకు సాక్షియైనట్టిదైనప్పటికీ నిర్వికారంగా ఉండేదీ, నిర్మలము, నిత్యానంద స్వరూపము అయిన దానినే, విద్వాంసులైనవారు, యథార్థమైన ఆత్మగా తెలుసుకోవాలి.

## ఆత్మస్వరూప విషయకమైన ప్రశ్న

**ఇదంతా విని, శిష్యుడు ఇట్లా అడుగుతున్నాడు-**

**మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశేష్వేతేషు పంచసు**
**సర్వాభావం వినాకించిన్న పశ్యామత్ర హే గురో**
**విజ్ఞేయం కిముపస్త్వస్తి స్వాత్మనాత్ర విపశ్చితా.** 214

గురుదేవా! ఈ అయిదు కోశాలనూ మిథ్యారూపం కలవి అని నిషేధించగా నాకు సర్వాభావమే – ఏమీ మిగలని శూన్యమే – తప్ప ఇంకేమీ గోచరించటం లేదు. ఇక బుద్ధిమంతులు ఏ వస్తువును తన ఆత్మగా అనుకోవాలి?

## ఆత్మ స్వరూప నిరూపణం

గురువుగారు ఇట్లా సమాధానం చెపుతున్నారు–

**సత్యముక్తం త్వయా విద్వన్నిపుణోఽసి విచారణే**
**అహమాది వికారాస్తే తదభావోఽయమప్యను.** 215

ఓ విద్వాంసుడా! నీవు సరిగానే అడిగావు. ఆలోచన చేయటంలో నీవు నేర్పరివే! అహంకారాదులు నీ వికారాలైనట్లే, వాటి అభావం కూడా ఒక వికారమే!

**సర్వే యేనానుభూయన్తే యః స్వయం నానుభూయతే**
**తమాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సుసూక్ష్మయా. 216**

దేనిద్వారా ఈ సర్వమూ అనుభవింపబడుతున్నాయో, ఏది తానుగా అనుభవింపబడదో, అటువంటి అన్నింటికీ సాక్షియైనదానిని ఆత్మ అని బుద్ధితో బాగా ఆలోచించి తెలుసుకో!

**తాత్సాక్షికం భవేత్తత్తద్యద్యదేనానుభూయతే**
**కస్యాప్యననుతార్థే సాక్షిత్వం నోపయుజ్యతే. 217**

దేని దేనిద్వారా, ఏ ఏ అనుభవాలు అనుభవింపబడుతున్నాయే అవన్నీ అతని సాక్షిత్వంలోనే జరుగుతున్నాయని అంటారు. అనుభవింపబడని పదార్థంలో ఎవరూ కూడా సాక్షి అవటం అనేది అంగీకరింపబడని విషయం.

**అసౌ స్వసాక్షికో భావో యతః స్వేనానుభూయతే**
**అతః పరం స్వయం సాక్షాత్ప్రత్యగాత్మా న చేతరః. 218**

ఈ ఆత్మ తనంతట తానే అనుభవింపబడుతోంది కాబట్టి అది తనకు తానే సాక్షి. అందుచేత దీనికి భిన్నంగా దీనికి అతీతంగా వేరొక అంతరాత్మ అంటూ లేదు.

**జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌసముజ్జృంభతే**
**ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యంతః స్ఫురన్నైకధా**
**నానాకార వికారభాగిన ఇమాన్పశ్యన్నహందీముఖాన్**
**నిత్యానంద చిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది. 219**

జాగ్రత్ స్వప్న సుషుప్తి అనే మూడు అవస్థల్లోనూ అంతఃకరణం లోపల ఎల్లప్పుడూ 'నేను, నేను' అని అనేక విధాలుగా స్ఫురిస్తూ ప్రత్యగ్రూపంతో స్పష్టంగా ప్రకాశిస్తూ, అహంకారం మొదలుగా ప్రకృతియొక్క నానా వికారాలనూ సాక్షి రూపంలో చూస్తూ, ఎల్లప్పుడూ చిదానంద స్వరూపంతో స్ఫురిస్తూ ఉండేదానినే నీవు నీ అంతఃకరణంలో ఉన్నట్టి దానినే 'స్వం' అని గుర్తించు. అదే ఆత్మ అని తెలుసుకో!

**ఘటోదకే బింబిత మర్కబింబ-**
**మాలోక్య మూఢో రవిమేవ మన్యతే**
**తథా చిదాభాసముపాధి సంస్థం**
**భ్రాన్త్యాహమిత్యేవ జడోఽభిమన్యతే.**

మూడులైనవారు కుండలోని నీటిలో ప్రతిబింబించిన సూర్య బింబాన్ని చూచి, దానినే అసలైన సూర్యబిఆంబం అని అనుకుంటారు. అట్లాగే ఉపాధిలో ఉన్నట్టి చిదాభాసను అజ్ఞానులైన వారు భ్రమకు లోనై 'నేను' అనే – ఆత్మ అనే అనుకుంటారు.

**ఘటం జలం తద్గతమర్కబింబం**
**విహాయ సర్వం వినిరీక్ష్యతేఽర్కః**
**తటస్థ ఏతత్త్రితయావభాసకః**
**స్వయం ప్రకాశో విదుషా యథా.** 221

**దేహం ధియం చిత్ప్రతిబింబమేతం**
**విసృజ్య బుద్ధౌనిహితం గుహాయాం**
**ద్రష్టారమాత్మానమఖండబోధం**
**సర్వప్రకాశం సదసద్విలక్షణమ్.** 222

**నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ -**
**మన్తర్బహిఃశూన్యమనన్యమాత్మనః**
**విజ్ఞాయ సమ్యక్నిజరూపమేత -**
**త్పుమాన్విపాప్మా విరజో విమృత్యుః.** 223

విద్యాంసుడైనవాడు కుండ, జలం, ఆ జలంలో ఉన్న సూర్యుని యొక్క ప్రతిబింబం, వీటి అన్నింటిని వదలి, ఈ మూడింటినీ ప్రకాశింపజేసే స్వయంప్రకాశ రూపుడైన సూర్యుణ్ణే చూస్తున్నాడో, అట్లాగే దేహము, బుద్ధి, చిదాభాస ఈ మూడింటినీ వదలి, బుద్ధి గుహయందున్నట్టి సాక్షి రూపంలో ఉండే ఆత్మను, అఖండ భోధస్వరూపాన్ని, సమస్తాన్నీ శాసించే దానిని సదసత్తులకంటె భిన్నమైనదానిని, నిత్యుడు, విభుడు, సర్వగతుడు, సూక్ష్ముడు, బాహ్యాభ్యన్తర భేదరహితుడు, అద్వితీయుడు అయిన ఆ పరాత్మనే తన స్వరూపంగా తెలుగుకొని, పాపరహితుడు, అమరుడు, నిర్మలుడు అవుతాడు.

**విశోక ఆనన్దఘనో విపశ్చి -**
**త్స్వయం కుతశ్చిన్న బిశేతి కశ్చిత్**
**నాన్యోఽస్తిపంథా భవబంధముక్తే -**
**ర్వినా స్వతత్త్వావగమం ముముక్షోః.** 224

అటువంటి మిక్కిలి బుద్ధిమంతుడైన పురుషుడు, శోక రహితుడు, ఆనంద ఘనస్వరూపుడు అయినందున ఎన్నడూ ఎవరకీ భయపడడు, ముముక్షువు అయినవానికి, ఈ సంసార బంధనాల నుండి విడివడటానికి ఆత్మతత్త్వాన్ని గురించిన జ్ఞానంకంటె మించినది ఇంకేది లేదు.

బ్రహ్మాభిన్నత్వం విజ్ఞానం భవమోక్షస్య కారణమ్
యేనాద్వితీయమానందం బ్రహ్మసంపద్యతే బుధైః. 225

బ్రహ్మ, ఆత్మల అభేదజ్ఞానమే భవబంధనాల నుండి ముక్తిని పొంటానికి కారణం అవుతోంది. ఈ అభేదజ్ఞానం వల్లనే బుద్ధిమంతుడైనవాడు, అద్వితీయమైన బ్రహ్మపదాన్ని పొందుతాడు.

బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః
విజ్ఞాతవ్యమతః సమ్యగ్బ్రహ్మాభిన్నత్వమాత్మనః.

బ్రహ్మభూతుడైన పిమ్మట, విద్వాంసుడు మళ్ళీ జన్మ మరణ రూపమైన చక్రంలోపడడు. అందుచేత ఆత్మకు బ్రహ్మతో గల అభిన్నత్వాన్ని (బ్రహ్మకు ఆత్మకు భేదం లేక పోవటాన్ని) చక్కగా తెలుసుకోవాల్సి ఉంది.

సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ విశుద్ధం పరం స్వతఃసిద్ధమ్
నిత్యానందైకరసం ప్రత్యగభిన్నం నిరంతరం జయతి. 227

బ్రహ్మ సత్యము జ్ఞానము అనంతస్వరూపం కలది. అది విశుద్ధము, పరము, స్వతః సిద్ధము, నిత్యము, ఏకమాత్ర ఆనందస్వరూపము, ప్రత్యగ్రూపం (అంతరతమము) అభిన్నము, నిరంతరమూ ఉన్నతిశీలం కలది.

## బ్రహ్మము జగత్తు ఒకటే

సదిదం పరమాద్వైతం స్వస్మాదన్యస్య వస్తునోఽభావాత్
నహ్యన్యదస్తి కించిత్సమ్యక్పరమార్థతత్త్వబోధే హి. 228

ఈ స్వాత్మకంటె అన్యమైన వస్తువంటూ ఏదీ లేదు కాబట్టి, ఈ పరమాద్వైతం మాత్రమే సత్యపదార్థం. ఈ పరమార్థమైన తత్త్వం పూర్తిగా బోధపడితే ఇక తెలుసుకోవాల్సింది ఏదీ ఉండదు.

యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీతమజ్ఞానాత్
తత్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషం. 229

అజ్ఞానం కారణంగా అనేక విధాలుగా ప్రతీతమౌతూ ఉన్న ఈ సమస్త జగత్తూ కూడా భావనా దోషాలు ఏమీ లేనట్టి నిర్వకల్పమే! బ్రహ్మమే!

మృత్కార్యభూతోఽపి మృదో న భిన్నః
కుంభోఽస్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్
నకుంభరూపం పృథగస్తి కుంభః
కుతో మృషా కల్పిత నామమాత్రః. 230

కుండ అనేది మట్టియొక్క కార్యం. అయినప్పటికీ, ఆ కుండ అనేది మట్టికంటె భిన్నమైనదేమీ కాదు – ఆ కుండ కూడా మృత్తిక రూపం కలదే కాబట్టి! కుండ అనేది మట్టిలో కల్పితమైనట్టి నామమాత్రంగా ఉండే సత్త మాత్రమే! కుండకు ప్రత్యేక అస్తిత్వం – సత్త – ఎక్కడ ఉంది!

**కేనాపి మృద్భిన్నతయా స్వరూపం**
**ఘటస్య సందర్శయితుం న శక్యతే**
**అతోఘటః కల్పిత ఏవ మోహా -**
**న్మృదేవ సత్యం పరమార్థభూతమ్.** **231**

మట్టికి భిన్నంగా, మట్టి అనేది లేకుండా ఘటంయొక్క స్వరూపం మనకు కనిపించదు. అందుచేత ఘట మనేది మోహంవల్ల కల్పింబడ్డదే! యథార్థానికి తత్త్వస్వరూపంలో ఉన్నది మృత్తికయే తప్ప ఘటం కాదు.

**సద్బ్రహ్మకార్యం సకలం సదైవ**
**తన్మాత్రమేతన్న తతోఽన్యదస్తి**
**అస్తీతి యో వక్తి న తస్య మోహో**
**వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః.** **232**

సద్బ్రహ్మ యొక్క కార్యమైనట్టి ఈ సమస్త ప్రపంచమూ సత్స్వరూపమే! ఎందుచేతనంటే, ఈ సమస్తమూ ఆ బ్రహ్మమే! దానికి భిన్నమైనదంటూ ఏదీ లేదు కాబట్టి! ఎవరైనా ఆ బ్రహ్మానికి భిన్నంగా ఏదైనా కొంత ఉన్నదని అంటే, అటువంటివాని మోహం – అజ్ఞానం పోలేదన్న మాట. అట్టివాని మాట నిద్రిస్తున్నవాడు నిద్రలో వాగే వాగుడులాంటిది.

**బ్రహ్మైవేదం విశ్వమిత్యేవ వాణీ**
**శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా**
**తస్మాదేతద్బ్రహ్మమాత్రం హి విశ్వం**
**నాధిష్ఠానాద్భిన్నతారోపితస్య.** **233**

'ఈ సమస్త విశ్వమూ బ్రహ్మమే!' 'బ్రహ్మైవేదం సర్వం' అని శ్రేష్ఠమైన అథర్వ వేదం చెపుతోంది. కాబట్టి ఈ విశ్వమంతా బ్రహ్మమే! అధిష్ఠానాన్ని మించి ఆరోపితమైన వస్తువుకు వేరుగా ఒక సత్త అంటూ ఉండనే ఉండదు కాబట్టి బ్రహ్మమందు ఆరోపితమైన ఈ విశ్వం బ్రహ్మమే!

**సత్యం యది స్యాజ్జగదేతదాత్మనో -**
**ఽనన్తత్వహానిర్నిగమాప్రమాణతా**

**అసత్యవాదిత్వమపీశితుః స్యా**
**న్నైతత్త్రయం సాధు హితం మహాత్మనాం.** 234

ఈ జగత్తు సత్యం అని గనుక వుంటే, ఆత్మయొక్క అనంతత్వంలో దోషం వస్తుంది. పైగా శ్రుతి కూడా అప్రామాణికమౌతుంది. గీతోపదేశకుడైన శ్రీకృష్ణపరమాత్మ అసత్యవాది అవుతాడు. ఈ మూడూ కూడా సత్పురుషులైనవారికి అంగీకారయోగ్యాలు కావు.

**ఈశ్వరోవస్తుతత్త్వజ్ఞో నచాహం తేష్వవస్థితః**
**న చ వత్స్థాని భూతానీత్యేవమేవ వ్యచీక్లుపత్.** 235

పరమార్థతత్త్వవిదుడైన శ్రీకృష్ణభగవానుడు "నేను భూతాల్లో లేను, భూతాలు నాలోనూ లేవు" అని చెప్పిన విషయం సత్యమైనది. అంటే – దీనివల్ల ఈ విశ్వమే పరమాత్మ అనే విషయం స్పష్టమౌతోంది. రెండూ భిన్నాలు కావు.

**యది సత్యం భవేద్విశ్వం సుషుప్తావుపలభ్యతాం**
**యన్నోపలభ్యతే కించిదతోఽసత్స్వప్నవన్మృషా.** 236

ఈ ప్రపంచమే గనుక సత్యమైతే అది సుషుప్తిలో కూడా గోచరించాలి – నిద్రలో కూడా కనిపించాలి. కాని నిద్రలో అది ప్రతీతమవటం లేదు. కాబట్టి, అది – ప్రపంచం–స్వప్నంలాగానే అసత్తూ, మిథ్యా అని తెలుస్తోంది.

**అతః పృథక్నాస్తి జగత్పరాత్మనః**
**పృథక్ప్రతీతిస్తు మృషా గుణాదివత్**
**అరోపితస్యాస్తి కిమర్థవత్తా -**
**ధిష్ఠానమాభాతి తథా భ్రమేణ.** 237

కాబట్టి, పరమాత్మకంటె వేరుగా జగత్తంటూ ఏదీ లేదు. దాని ప్రతీతి, గుణి (గుణాలు కలవానికంటె) కంటే, గుణాలు మొదలైనవి వేరుగా (భిన్నంగా) కనపడటం లాగా మిథ్యయే! ఆరోపితమైన వస్తువుకు సత్యత్వం ఎట్లా ఉంటుంది? అదిష్ఠానమే మన భ్రమ కారణంగా ఆ విధంగా భాసిస్తోంది.

**భ్రాన్తస్య యద్యద్భ్రమతః ప్రతీతిం**
**బ్రహ్మైవ తత్త్వద్రజతం హి శుక్తిః**
**ఇందంతయా బ్రహ్మ సదైవ రూప్యతే**
**త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్.** 238

భ్రమ కారణంగా వెండిలాగా కనిపించినదంతా యదార్థానికి ముత్యపుచిప్పే అయినట్లుగా, అజ్ఞానియైనవానికి అజ్ఞానంవల్ల ఏదైనా కనిపిస్తూ ఉంటే అది యథార్థానికి బ్రహ్మమే తప్ప అన్యమైనదేదీ కాదు. 'ఇదం జగత్' (ఇది జగత్తు) అనే ఈ వాక్యంలో 'ఇదం' (ఇది) అనేది ఎప్పుడూ బ్రహ్మమే! 'ఇదం'లో అరోపితమైన జగత్తు ఆరోపితం. కాబట్టి నామమాత్రమే!

## బ్రహ్మ నిరూపణం

**అతః పరం బ్రహ్మ సదద్వితీయం**
**విశుద్ధ విజ్ఞానఘనం నిరంజనమ్**
**ప్రశాంతమాద్యంత విహీనమక్రియం**
**నిరన్తరానన్దరస్వరూపమ్.** 239

అందుచేత పరబ్రహ్మము సత్స్వరూపం కలది. అద్వితీయము, శుద్ధము, విజ్ఞానఘనము, నిర్మలము, శాంతము, అద్యంతరహితము, అక్రియము, ఎల్లప్పుడూ ఆనందైక రసస్వరూపం కలది.

**నిరస్తమాయాకృతసర్వభేదం**
**నిత్య సుఖం నిష్కలమప్రమేయం**
**అరూపమవ్యక్తమనాఖ్యమవ్యయం**
**జ్యోతిః స్వయం కించిదం చ కాస్తి.**

మాయవల్ల కలిగిన ఏ బేధాలూ లేనట్టది, నిత్యము సుఖస్వరూపము, కలారహితము, ప్రమాణాదులకు విషయం కానట్టిది, అరూపము, అవ్యక్తము, అనామము (పేరు లేనిది) అక్షయమైనది అయిన ఆ బ్రహ్మము స్వయం ప్రకాశమైనది-స్వయంజ్యోతి యైనది

**జ్ఞాతృజ్ఞేయ జ్ఞానశూన్యమనన్తం నిర్వికల్పకం**
**కేవలాఖండచిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః.** 241

బుద్ధిమంతులైనవారు ఆ పరమతత్త్వాన్ని జ్ఞాత, జ్ఞేయం, జ్ఞానం అనే త్రిపుటి లేని దానినిగా, అనన్తము, నిర్వికల్పము, కేవలము, అఖండచైతన్యమాత్రంగా తెలుసుకుంటారు.

**అహేయమనుపాదేయం మనోవాచామగోచరం**
**అప్రమేయమనాద్యన్తం బ్రహ్మ పూర్ణం మహన్మహః.** 242

ఆ బ్రహ్మ మనేది త్యజించటానికి (వదలిపెట్టటానికి) గ్రహించటానికీ కూడా వీలులేనట్టిది. మనస్సుకు, వాక్కుకు విషయం కానిది - ఈ రెంటికీ అందనిది. అప్రమేయము తెలుసుకోవటానికి శక్యం కానిది. ఆది అంతము రెండూ లేనిది. పరిపూర్ణము, గొప్ప తేజస్సుతో కూడినది.

## మహావాక్య విచారము

**తత్త్వం పదాభ్యామభిధీయమానయో -**
**ర్బ్రహ్మాత్మనోః శోధితయోర్యదీత్థమ్**
**శ్రుత్యా తయోస్తత్త్వమసీతి సమ్య**
**గేకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః. 243**

ఛాందోగ్యోపనిషత్తులో (6-8) 'తత్త్వమసి' అనే వాక్యాలలోని తత్ త్వం అనే శబ్దాలను గూర్చిన విచారణ చేసి చెప్పబడిన బ్రహ్మ (తత్) ఆత్మ (త్వం) శ్రుతిద్వారా మాటి మాటికీ (అనేక ఉదాహరణలతో) పూర్తిగా ఈ రెంటి ఏకత్వమే ప్రతిపాదింపబడ్డది.

**ఐక్యం తయోర్లక్షితయోర్న వాచ్యయో -**
**ర్నిగద్యతేఽన్యోన్య విరుద్ధ ధర్మిణోః**
**ఖద్యోతభాన్వోరివ రాజభృత్యయోః**
**కూపాంబు రాశ్యోః పరమాణుమేర్వోః. 244**

సూర్యుడు మిణుగురు పురుగు, రాజు సేవకుడు, సముద్రము, కూపం, మేరువు పర్వతం పరమాణువులాగా పరస్పరం విరుద్ధ ధర్మాలు కలవానిలో ఏకత్వాన్ని లక్ష్యార్థంలో చెప్పబడిందే తప్ప వాచ్యార్థంలో చెప్పబడలేదు.

**తయోర్విరోధోఽయ ముపాధికల్పితో**
**నవాస్తవః కశ్చిదుపాధిరేషః**
**ఈశాన్య మాయా మహదాది కారణం**
**జీవస్యకార్యం శ్రుణం పంచకోశం. 245**

ఆ రెంటికీ ఉన్న విరోధం ఉపాదికారణంగా ఉన్నదే! ఈ ఉపాధి అనేది వాస్తవికం కాదు - సత్యం కాదు. ఈశ్వరుని ఉపాధది మహత్తత్వాది కారణరూపమైన మాయ అయితే జీవుని ఉపాధి, కార్యరూపంలో ఉండే పంచకోశాలు.

**ఏతావుపాధీ పరజీవయో స్తయోః**
**సమ్యక్‌నిరాసే న పరో న జీవః**
**రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటక -**
**స్తయోరపోహే న భటో న రాజా. 246**

ఇది మాయ, పంచకోశాలు అనేవి క్రమంగా పరమాత్మకు జీవునికీ ఉపాధులు. ఆ ఉపాధుల్ని తొలగించివేస్తే, పరమాత్మా లేదుడ, జీవుడూ లేదు. అట్లాగే రాజు యొక్క ఉపాధి

రాజ్యం. సైనికుని ఉపాధి డాలు. ఈ రెండు ఉపాధుల్నీ తొలగించి వేస్తే రాజూ లేదు, సైనికుడూ లేదు.

**అధాత అదేశ ఇతి శ్రుతిః స్వయం**
**నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయం**
**శ్రుతిప్రమాణానుగృహీత యుక్త్యా**
**తయోర్నిరాసః కరణీయ ఏవ.** 247

"ఆధాత ఆదేవో నేతి నేతి" (బృహదారణ్యకోపనిషత్తు 2-3-6) అనే శ్రుతి వాక్యం వివరింపబడుతోంది, బ్రహ్మమందు కల్పితమై యున్నట్టి ద్వైతాన్ని 'ఆథాత ఆదేశో నేతి నేతి' అనే శ్రుతి స్వయంగా నిషేధిస్తోంది. అందుచేత శ్రుతి ప్రమాణానుకూలమైన యుక్తితో పైన పేర్కొనబడిన ఉపాధుల్ని త్రోసివేయాలి.

**నేదం నేదం కల్పితత్వాన్న సత్యం**
**రజ్జౌ దృష్టవ్యాలవత్స్వప్నవచ్చ**
**ఇత్థం దృశ్యం సాధుయుక్త్యా వ్య పోహ్య**
**జ్ఞేయః పశ్చాదేశభావస్తయోర్యః.** 248

ఈ దృశ్యము కల్పితమైనందున, రజ్జువునందు కల్పితమయ్యే సర్పములాగా, స్వప్నంలో భాసించే వివిధ పదార్థాలలాగా సత్యం కాదు. ఇటువంటివే అయిన ప్రబలమైన యుక్తుల ద్వారా దృశ్యాన్ని నిషేదించగా, మిగిలి ఉండే జీవేశ్వరుల ఏకీభావమే తెలిసికోదగినది.

**తతస్తు తౌ లక్షణయా సులక్ష్యౌ**
**తయోరఖండైక రసత్వసిద్ధయే**
**నాలం జహత్యా న తథా జహత్యా**
**కింతూభయార్థాత్మికయైవ భావ్యమ్.** 249

జీవాత్మ పరమాత్మలయొక్క అఖండైక రసత్వం సిధించటం కోసం మహావాక్యాల యొక్క జ్ఞానం లక్షణ అనే శబ్దశక్తివల్ల కలుగుతుంది. వాటిని గూర్చిన ( ఆ మహావాక్యాలను గూర్చిన) సరియైన జ్ఞానం జహల్లక్షణ వల్లనూ కలగదు. అజహల్లక్షణంవల్లనూ కలగదు. జహత్య జహ లక్షణ శక్తిని ప్రయోఒగించాల్సి వస్తుంది. జహత్య జహలక్షణ అనేశబ్దశక్తిద్వారా వాటి అర్థాన్ని గ్రహించాలి.

లక్షణ = శబ్దం యొక్క ముఖ్యార్థానికి బాధ కలిగినప్పుడు వేరొక అర్థాన్ని యిచ్చే శబ్దశక్తి.

జహల్లక్షణ: దీనినే జహత్స్వార్థ అని కూడా అంటారు. ప్రకరణవశాస, సందర్భవశాన, ఒక పదం, తన అర్థాన్ని వదలి వేరొక అర్థాన్ని బోధించే లక్షణం.

ఉదా: గంగాయాం ఘోషః–గంగలో గొల్లపల్లె ఉండటం అసంభవం కాబట్టి, గంగ అనే పదం తన 'నది' అనే అర్థాన్ని వదలి 'గంగాతీరం' అనే అర్థాన్ని ఇస్తోంది.

అజహల్లక్షణ: ఒక పదం తన అర్థాన్ని వదలకుండానే వేరొక అర్థాన్ని తెలపుతుంది. ఉదా: 'కావడులు వెడుతున్నాయి' అన్నప్పుడు కావళ్ళనే కాక వాటిని మోసేవారిని కూడా 'కావడులు' అనే పదం తులుపుతుంది.

జహదజహల్లక్షణ: ఒక పదం తన వాచ్యార్థంలో కొంతభాగం వదలి కొంత భాగాన్ని గ్రహించే లక్షణం. ఉదా: "సో–యం దేవదత్తః" ఈ దేవదత్తుడు వాడే అన్నప్పుడు వెనుకటి ఇప్పటి దేవదత్తుల్లో దేశ కాలాలకు సంబంధించిన భేదంవున్నా ఆ భేదాన్ని వదలి కేవలం దేవదత్త శబ్దార్థాన్నే గ్రహించటం జరుగుతుంది. అట్లాగే జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని ఈ జహదజహల్లక్షణ ద్వారా గ్రహించాలని భావం) విపులీకరిస్తున్నారు.

**స దేవదత్తో-యమితీహ చైకతా**
**విరుద్ధధర్మాంశమపాస్య కథ్యతే**
**యథా తథా తత్త్వమసీతి వాక్యే**
**విరుద్ధధర్మానుభయత్ర హిత్వా.** 250

'ఆ దేవదత్తుడు ఈ దేవదత్తుడే!' ఈ వాక్యంలో 'ఆ' అనే శబ్దం పరోక్షాన్ని సూచిస్తోంది. 'ఈ' అనే పదంఅపరోక్షాన్ని సూచిస్తోంది. ఇక్కడ ఉన్నట్టి విరుద్ధ ధర్మాలను పరిహరించి, దేవదత్తుడు ఒకడే అనే అర్థాన్ని ఎట్లా గ్రహిస్తున్నామో అట్లాగే 'తత్త్వమసి' అనే వాక్యంలో 'తత్' అనే శబ్దానికి వాచ్యమైన ఈశ్వరుని యొక్క ఉపాధియైన మాయను, 'త్వం' పదానికి వాచ్చమైన జీవునియొక్క ఉపాధియైన అంతఃకరణాన్నీ, ఈ రెంటికీ ఉన్న విరుద్ధధర్మాలను పరిహరించి శుద్ధచైతన్యంశం యొక్క ఏకత్వాన్ని శ్రుతిలో చెప్పారు.

**సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో -**
**రఖండభావంః పరిచీయతేబుధైః**
**ఏవం మహావాక్యశతేన కథ్యతే**
**బ్రహ్మాత్మనోరైక్య మఖండభావం.** 251

ఈ విధంగా లక్షణాశక్తి ద్వారా జీవాత్మ పరమాత్మల యొక్క చేతనాంశంలోని ఏకత్వాన్ని నిశ్చయించుకొని, బుద్ధిమంతులైనవారు వాటి అఖండ భావానికి సంబంధించిన జ్ఞానాన్ని

పొందుతున్నారు. ఇట్లాగే శ్రుతుల్లో వందలకొలది మహావాక్యాల ద్వారా జీవాత్మ పరమాత్మల అఖండ ఏకత్వం స్పష్టంగా వర్ణింపబడ్డది.

## బ్రహ్మ భావన

**అస్థూలమిత్యేతదసన్నిరస్య**
**సిద్ధం స్వతోవ్యోమవదప్రతర్క్యమ్**
**అతోమృషామాత్రమిదం ప్రతీం**
**జహీహి యత్స్వాత్మతయా గృహీతమ్**
**బ్రహ్మాహ మిత్యేవ విశుద్ధబుద్ధ్యా**
**విద్ధి స్వమాత్మన మఖండబోధమ్.** 252

"అస్థూల మనణ్వ హ్రస్వమదీర్ఘమ్" బృహదారణ్య కోపనిషత్తు 3-8-7) అనే శ్రుతివాక్య వివరణ.

"అస్థూలమనణ్వహ్రస్వం" ఇత్యాది శ్రుతివాక్యాల ద్వారా, అసత్తును స్థూలత్వం మొదలైనవాటిని త్రోసివేసినందున, అకాశంలాగా వ్యాపకము, అతర్క్యము అయిన వస్తువు స్వయంగానే సిద్ధిస్తోంది. ఇందువల్ల ఆత్మగా భావింపబడుతూన్న ఈ దేహాదులన్నీ మిథ్య అని రుజువు అవుతోంది. వీటిల్లో-దేహాదుల్లో-ఆత్మబుద్ధిని వదలి 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మను' అనే శుద్ధమైన బుద్ధితో అఖండము, జ్ఞాన స్వరూపము అయిన ఆత్మను తెలుసుకో!

**మృత్కార్యం సకలం ఘటాది తతతం మృన్మాత్రమేవాభిత -**
**స్తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్**
**యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం స ఆత్మా స్వయం**
**తస్మాత్తత్త్వమసి ప్రశాస్తమమలం బ్రహ్మాద్వయం యత్పరం.** 253

మృతిక యొక్క కార్యలైన ఘటాదులు అన్ని విధాలా మృత్తికే తప్ప అన్యం కానట్లుగా సత్ నుండి ఉత్పన్నమైనట్టి ఈ తత్స్వరూపమైన సమస్త జగత్తూ సన్మాత్రమే తప్ప అన్యం కాదు. ఎందుచేతనంటే సత్‌కు అతీతమైనది (మించినట్టిది) మరేది లేదు. అదే సత్యం. అదే స్వయంగా ఆత్మకూడాను. అందుచేత శాంతము నిర్మలము అద్వితీయము అయిన ఆ పరబ్రహ్మవు నీవే!

**నిద్రాకల్పితదేశకాలవిషయాజ్ఞత్రాది సర్వం యథా**
**మిథ్యా తద్వదిహాపి జాగ్రతి జగత్స్వాజ్ఞాన కర్యాత్వతః**
**యస్మాదేవమిదం శరీరకరణ ప్రాణహమాద్యప్యసత్**
**తస్మాత్తత్త్వమసి ప్రశాంతమమలం బ్రహ్మాద్వయం యత్పరం.** 254

స్వప్నంలో నిద్రాదోషంవల్ల కల్పితమైన దేశకాల విషయజ్ఞాతాదులు అన్నీ మిథ్యయే అవుతున్నాయి. అట్లాగే జాగ్రదవస్థలో కూడా ఈ జగత్తు మన అజ్ఞానానికి కార్యమైనందున మిథ్యయే! ఈ విధంగా చూస్తే ఈ శరీరాలు, ఇంద్రియాలు, ప్రాణాలు, అహంకారం మొదలైనవన్నీ అసత్యాలే! కాబట్టి నీవే శాంతము నిర్మలము అద్వితీయము అయిన పరబ్రహ్మవు. (కొన్ని ప్రతుల్లో ఈ దిగువ శ్లోకం అదనంగా కనిపిస్తోంది)

**యత్రభ్రాన్త్యాకల్పితం తద్వివేకే తత్తన్మాత్రంనైవ తస్మాద్విభిన్నం**
**స్వప్నేనష్టే స్వప్నవిశ్వం విచిత్రం స్వస్మాద్భిన్నం కిన్ను దృష్టం ప్రబోధే.**

ఒక వస్తువునందు వేరొక వస్తువు భ్రమ కారణంగా కల్పితమౌతుంది. బాగా ఆలోచించగా ఆ వస్తువు తన రూపంలోనే ప్రతీతమౌతుంది. దానికి భిన్నంగా కనిపించదు. స్వప్నం నష్టపోయిన పిమ్మట, జాగ్రదవస్థలో, విచిత్రమైన ఆ స్వప్నప్రపంచం తనకంటె భిన్నంగా కనిపించదు గదా!

**జాతినీతికులగోత్రదూరగం**
**నామరూపగుణదోషవర్జితం**
**దేశకాలవిషయాతివర్తి యద్**
**బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 255**

జాతి, నీతి, కులము, గోత్రం, వీటి అన్నింటికి అతీతమైనది, నామం, రూపం, గుణం, దోషం, ఇవేవీ లేనిదీ, దేశకాల వస్తువుల కంటె భిన్నమైనదీ, ఏదీ కలదో, ఆ బ్రహ్మవివి నీవే! ఈ విధంగానే నీ అంతఃకరణంలో భావించు.

**యత్పరం సకలవాగగోచరం**
**గోచరం విమలబోధ చక్షుషః**
**శుద్ధచిద్ఘనమనాదివస్తు యద్**
**బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 256**

ప్రకృతికి అతీతమైనట్టి, వాక్కుకు విషయం కానట్టి (వాక్కుకు అందనట్టి) నిర్మలమైన జ్ఞానచక్షువులతో మాత్రమే తెలుసుకో దగినట్టి, శుద్ధచిద్ఘనమైనట్టి అనాది యైనట్టిది ఏదీ కలదో ఆ పరబ్రహ్మవు నీవే! ఈ విధంగా నీ అంతఃకరణంలో భావన చేయుము.

**షడ్భిరూర్మిభిరయోగి యోగిహృద్ -**
**భావితం న కరణైర్విభావితం**
**బుద్ధ్యవేద్యమనవద్యభూతి యద్**
**బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 257**

షడూర్ములు (ఆకలి, దప్పిక, శోకం, మోహం, జర, మరణం) లేనట్టి యోగులు హృదయంలో ఎవరిని ధ్యానం చేస్తూ ఉంటారో ఎవరిని ఇంద్రియాల ద్వారా గ్రహించటానికి వీలుకాదో, బుద్ధికి కూడా అందనట్టి, అంతులేని విభూతి సంపన్నుడైనట్టి ఆ పరబ్రహ్మావు నీవే! అని ఈ విధంగా అంతఃకరణంలో భావన చేయుము.

**భ్రాన్తి కల్పిత జగత్కలాశ్రయం**
**స్వాశ్రయం చ సదసద్విలక్షణం**
**నిష్కలం నిరుపమానమృద్ధిమద్**
**బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 258**

భ్రాంతిచేత కల్పితమైన ఈ జగత్తు అనే కళకు ఆధారమైనట్టి, తనకు తానే స్వయంగా ఆధారమైనట్టి (ఆశ్రయమైనట్టి) సత్ అసత్తులు రెండింటికంటె విలక్షణమైనట్టి, నిరవయవుడైనట్టి, నిరూపమానుడైనట్టి, పరమైశ్వర్య సంపన్నుడైనట్టి ఆ పరబ్రహ్మావు నీవే! ఇట్లా అంతఃకరణంలో భావన చేయుము!

**జన్మవృద్ధి పరిణత్యపక్షయ -**
**వ్యాధినాశవిహీన మవ్యయమ్**
**విశ్వసృష్ట్యవన ఘాతకారణః**
**బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 259**

పుట్టుక, పెరుగుదల, పరిణామము (మార్పు) అపక్షయము (క్షీణించటం) వ్యాధి, నాశనము అనే ఆరూ శరీరానికి ఉండే వికారాలు, ఇట్టి వికారాలు ఏవీ లేనట్టి, అవి - నాశియైనట్టి, విశ్వసృష్టికి, జగత్పోషణకు, జగద్వినాశనానికి కారణమైన పరబ్రహ్మావు నీవే! ఈ విధంగా అంతరాత్మలో భావన చేయుము!

**అ స్తభేదమనపా స్తలక్షణం**
**నిస్తరంగ జలరాశి నిశ్చలం**
**నిత్యముక్తమవిభక్తమూర్తి యద్**
**బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 260**

భేదరహితుడు, పరిణామ మనేది లేనట్టివాడు, అలలు లేనట్టి, నిశ్చలంగా ఉండే మహాసముద్రంలాంటివాడు, నిత్యముక్తుడు, విభజించరానివాడు (విభాగరహితుడు) అయిన ఆ పరబ్రహ్మావు నీవే! ఇట్లా అని నీ అంతఃకరణంలో భావన చేయుము!

ఏకమేవ సదనేక కారణం
　　కారణా న్తర నిరాస కారణం
కార్యకారణ విలక్షణం స్వయం
　　బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 261

తాను ఒకడే అయినప్పటికీ, అనేకమైనవాటికి కారణమైనవాడు, తాను స్వయంగా కార్యకారణ భావాలకు అతీతుడుగా ఉండేవాడు, అయిన ఆ పరబ్రహ్మవు నీవే! ఈ విధంగా నీవు నీ అంతః కరణంలో భావన చేయుము!

నిర్వికల్పక మనల్ప మక్షరం
　　యత్క్షరాక్షర విలక్షణం పరం
నిత్యమవ్యయ సుఖం నిరంజనం
　　బ్రహ్మతత్త్వమసి భావయాత్మని. 262

ఏ విధమైన వికల్పాలూ లేనట్టి, గొప్పవాడైనట్టి, నాశనం అనేది లేనట్టి, క్షరాక్షరాలకంటె (శరీరము, జీవుడు, ఈ ఇరువురికంటె) భిన్నమైనదైనట్టి, నిత్యుడు, అవ్యయుడు, ఆనంద స్వరూపుడు, నిష్కలంకుడు అయిన ఆ పరబ్రహ్మవు నీవే! అని హృదయంలో భావన చేయుము!

యద్విభాతి సదనేకధా భ్రమా
　　న్నామరూప గుణ విక్రియాత్మనా
హేమవత్స్వయ మవిక్రియం సదా
　　బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 263

ఎల్లప్పుడూ సద్రూపంలో ప్రకాశించేవాడు, సువర్ణం లాగాతాను నిర్వికారంగా ఉంటూనే, భ్రమ కారణంగా ఆ సువర్ణ వికారాలైన కటకకుండలాదుల రూపంలో, అనేక నామరూపగుణ క్రియాది వికారాలతో భాసిస్తూ ఉండే ఆ పరబ్రహ్మవు నీవే! అని నీ చిత్తంలో భావన చేయుము.

యచ్చకాస్త్య న పరం పరాత్ పరం
　　ప్రత్యగేకరస మాత్మ లక్షణం
సత్య చిత్సుఖ మనన్త మవ్యయం
　　బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని. 264

తనకంటె మించినవారంటూ ఎవరూ లేనట్టివాడు, – పరాత్పరుడైనవాడు, అవ్యక్త ప్రకృతికంటె అతీతుడైనవాడు, ప్రత్యగ్రూపుడు, ఏకైక రసస్వరూపుడు, అన్నిటికి అందరికి అంతరాత్మయైనవాడు, సచ్చిదానంద స్వరూపుడు, అనంతుడు, అవ్యయుడు అయినట్టి ఆ బ్రహ్మవు నీవే! ఇట్లా నీ చిత్తంలో చింతన చేయుము.

ఉక్తమర్థ మిమమాత్మని స్వయం
భావయ ప్రథిత యు క్తిభిర్ధియా
సంశయాది రహితం కరాంబువత్
తేన తత్త్వనిగమో భవిష్యతి. 265

పైన చెప్పబడిన విషయాన్ని నీ బుద్ధితో ఆలోచించు, ఉపనిషత్తులలోని ప్రసిద్ధమైన యుక్తుల ద్వారా నీ చిత్తంలో విచారణ చెయ్యి, దానివల్ల నీలోనున్న సంశయాలూ, విపర్యయాలూ దూరమైపోయి అరచేతిలోని నీటి లాగా స్పష్టంగా తత్త్వజ్ఞానం కలుగుతుంది.

స్వం బోధమాత్రం పరిశుద్ధ తత్త్వం
విజ్ఞాయ సంఘే నృపవచ్చ సైన్యే
తదాత్మనైవాత్మని సర్వదా స్థితో
విలాపయ బ్రహ్మణి బ్రహ్మణి దృశ్యజాతమ్. 266

సేనయొక్క మధ్యభాగంలో ఉండే రాజులాగా భూత సంఘాత రూపమైన ఈ శరీర మధ్యంలో ఉంటూ ఉండే స్వయంప్రకాశ రూపమైనట్టి, విశుద్ధ తత్త్వాన్ని తెలుసుకొని, సదా తన్మయభావంతో స్వస్వరూపంలో ఉంటూ, సమస్తదృశ్యప్రపంచాన్నీ ఆ బ్రహ్మంలోనే లీనం చేయుము.

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయమ్
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం
పునర్న తస్యాంగ గుహాప్రవేశః 267

వత్సా! ఆ సదసద్విలక్షణుడు, అద్వితీయుడు, సత్య స్వరూపుడు అయిన పరమాత్మ, బుద్ధి అనే గుహయందు విరాజమానుడై ఉన్నాడు. ఆ గుహయందలి ఆ పరబ్రహ్మతో ఏకరూపుడై ఉండేవానికి మళ్ళీ ఈ శరీరం అనే గుహలోకి ప్రవేశించే అగత్యం ఉండదు–మళ్ళీ జన్మ అంటూ ఉండదు.

## వాసనా త్యాగం

జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనానాదిరేషా
కర్తాభోక్తా ప్యహమితి దృఢా యాస్య సంసార హేతుః
ప్రత్యగ్దృష్ట్యాత్మని నివసతా సాపనేయా ప్రయత్నా
న్ముక్తిం ప్రాహు స్తదిహ మునయో వాసనాతానవం యత్. 268

వాసన అనేది, ఆత్మవస్తువును గూర్చిన జ్ఞానం కలిగినప్పటికీ, నేను కర్తను, నేను భోక్తను అనే ఈ రూపంలో దృఢమై, జన్మమరణ రూపమైన సంసారానికి కారణమౌతోంది. అట్టి ప్రబలమైన అనాదియైన వాసనను ఆంతరిక దృష్టితో, ఆత్మరూపంలో స్థితుడై దూరం చేసుకోవాలి. ఎందుచేతనంటే, ఈ విధమైన సాంసారిక వాసనలన్నీ క్షీణించిపోవటాన్నే మన ఋషులంతా 'ముక్తి' అని పేర్కొన్నారు.

**అహం మమేతి యోభావో దేహాక్షాదావనాత్మని**
**అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా. 269**

దేహము, ఇంద్రియాలూ మొదలైన అనాత్మ వస్తువుల్లో జీవునికి ఉండే 'నేను' 'నాది' అనే భావమే (అహం, మమభావం) అధ్యాసం, విద్వాంసుడైనవాడు, ఈ అధ్యాసాన్ని ఆత్మనిష్ఠ ద్వారా దూరం చేసుకోవాలి. ఎట్లాగంటే –

**జ్ఞాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వృత్తి సాక్షిణాం**
**సోఽహ మిత్యేవ సద్వృత్త్యా నాత్మ న్యాత్మమతిం జహి. 270**

ప్రత్యగాత్మ స్వరూపమైన తన్నుతాను, బుద్ధికి, దాని వృత్తులకు సాక్షిగా తలచి (తెలుసుకొని) ఆ బ్రహ్మను నేనే అనే చక్కటి భావంతో అనాత్మ వస్తువుల్లో వ్యాపించి ఉన్నట్టి ఆత్మ బుద్ధిని త్యజించాలి.

**లోకాను వర్తనం త్యక్త్వా దేహానువర్తనమ్**
**శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యా సాపనయం కురు. 271**

లోకవాసనను వదలిపెట్టు, శారీరక వాసనలను వదలిపెట్టు, శాస్త్రవాసనను సైతం వదలిపెట్టు. ఈ మూడింటినీ వదలిపెట్టి నీయందున్నట్టి సంసార సంబంధమైన అధ్యాసాన్ని త్యజించు.

**లోక వాసనయా జన్తోః శాస్త్రవాసనయాపి చ**
**దేహ వాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే. 272**

లోక వాసన, శాస్త్రవాసన, దేహవాసన ఈ మూడు వాసనలవల్లే, జీవులకు సరియైన జ్ఞానం కలగటం లేదు.

**సంసార కారాగృహ మోక్షమిచ్ఛో**
**రయోమయం పాదనిబద్ధ శృంఖలమ్**
**వదన్తి తజ్జ్ఞాః పటు వాసనా త్రయం**
**యోఽస్మాద్విముక్తః సముపైతి ముక్తిమ్. 273**

సంసారం అనే కారాగారం నుండి విముక్తిని కోరే వానికి, ఈ వాసనలనేవి కాళ్ళకు వేయబడిన సంకెళ్ళవంటివని, బ్రహ్మజ్ఞులైనవారు అంటారు. ఈ వాసనలనే లోహ శృంఖలాలను వదలించుకొన్నవానికే మోక్షం లభిస్తుంది.

**జలాది సంపర్క వశాత్ప్రభూత**
**దుర్గంధ ధూతాగరుదివ్య వాసనా**
**సంఘర్షణేనైవ విభాతి సమ్య**
**గ్విధూయమానే సతి బాహ్యగంధే.** 274

**అ న్తఃశ్రితానన్త దురన్తవాసనా**
**ధూలీ విలప్తా పరమాత్మ వాసనా**
**ప్రజ్ఞాతి సంఘర్షణతో విశుద్ధా**
**ప్రతీయతే చన్దనగన్దవత్స్ఫుటా.** 275

జలం మొదలైనదానిలో కలసి ఏదైనా మిక్కిలి దర్గంధాన్ని కలిగించే వస్తువు మనకు అంటుకొన్నప్పుడు, అగరులాంటి దివ్యమైన సుగంధాన్ని యిచ్చే వస్తువుతో బాగా రుద్దినంతనే, ఆ దుర్గంధం దూరమైపోతుంది. అట్లాగే అంతఃకరణానికి అంటిఉన్న చెడ్డవాసనలనే ధూళితో కప్పబడిఉన్న పరమాత్మవాసన, బుద్ధియొక్క సంఘర్షణవల్ల – రాపిడివల్ల – శుద్ధమై, చందనగంధం లాగానే స్పష్టంగా గోచరిస్తుంది.

**అనాత్మ వాసనా జాలైస్తిరోభూతాత్మవాసనా**
**నిత్యాత్మ నిష్ఠయా తేషాం నాశే భాతి స్వయం స్ఫుటా.** 276

అనాత్మవాసనా సమూహంవల్ల ఆత్మవాసనా మరుగున పడ్డది, అందుచేత, నిరంతరం ఆత్మనిష్ఠలో ఉన్నందువల్ల అనాత్మవాసనా సమూహం నశించిపోయి ఆత్మవాసన స్పష్టంగా ప్రకాశిస్తుంది.

**యథా యథా ప్రత్యగవస్థితం మన**
**స్తథా తథా ముంచతి బాహ్య వాసనాః**
**నిఃశేషమోక్షే సతి వాసనానా**
**మాత్మాను భూతిః ప్రతిబంధశూన్యా.** 277

మనస్సు అంతర్ముఖమౌతున్న కొద్దీ బాహ్యవాసనల్ని వదలివేస్తూ ఉంటుంది. వాసనల నుండి పూర్తిగా విముక్తి లభించినప్పుడు, ఆత్మకు ప్రతిబంధాలన్నీ తొలగిపోయిన అనుభవం కలుగుతుంది.

## అధ్యాస నిరాసనం

**స్వాత్మన్యేవ సదాస్థిత్వా మనోనశ్యతి యోగినః**
**వాసనానాం క్షయశ్చాతః స్వాధ్యా సాపనయం కురు. 278**

చిత్తవృతుల్ని నిరోధించి నిరంతరం ఆత్మస్వరూపంలోనే స్థిరుడై ఉండే యోగియొక్క మనస్సు నష్టమైపోతుంది (లయమై పోతుంది). అతని వాసనలన్నీ క్షయమైపోతాయి. కాబట్టి నీ అధ్యాసాన్ని తొలగొంచుకో! (నీ మిథ్యాజ్ఞానాన్ని పోగొట్టుకో)

**తమో ద్వాభ్యాం రజః సత్త్వాత్సత్త్వం శుద్ధే నశ్యతి**
**తస్మా త్సత్త్వమవష్టభ్య స్వాధ్యాసాపనయం కురు. 279**

రజోగుణం, సత్త్వగుణం ఈ రెంటివల్ల తమోగుణం, సత్త్వగుణంవల్ల రజోగుణం, శుద్ధసత్త్వంవల్ల సత్త్వగుణం నశిస్తాయి. కాబట్టి, నీవు శుద్ధ సత్త్వాన్ని ఆశ్రయించి నీ అధ్యాసాన్ని (భ్రమ జ్ఞానాన్ని) వదలిపెట్టు!

**ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చలః**
**ధైర్యమాలంబ్య యత్నేన స్వాధ్యాసాపనయం కురు. 280**

ప్రాబ్ధమే శరీరాన్ని పోషిస్తుంది. అని నిశ్చయించుకొని, నిశ్చల భావంతో ధైర్యాన్ని అవలంబించి ప్రయత్న పూర్వకంగా నీ అధ్యాసాన్ని వదలిపెట్టు.

**నాహం జీవః పరం బ్రహ్మేత్యతద్వ్యావృత్తి పూర్వకమ్**
**వాసనా వేగతః ప్రాప్త స్వాద్యాసాపనయం కురు. 281**

నేను జీవుణ్ణి కాను, నేను పరబ్రహ్మను. ఈ విధంగా నీలోని జీవభావాన్ని నిషేధిస్తూ, వాసనాత్రయ వేగంవల్ల లభించిన నీ అధ్యాసాన్ని త్యజించు.

**శ్రుత్యా యుక్త్యా స్వానుభూత్యా జ్ఞాత్వా సర్మాత్మ్యమాత్మనః**
**క్వచిదా భాసతః ప్రాప్త స్వాధ్యాసాపనయం కురు. 282**

శ్రుతితో, యుక్తితో, నీ స్వానుభవంతో ఆత్మ యొక్క సర్వాత్మకతను తెలుసుకొని, ఎన్నడో భ్రమవల్ల ప్రాప్తమైన నీ మిథ్యాజ్ఞానాన్ని త్యజించు.

**అనాదాన విసర్గాభ్యామీషన్నాస్తి క్రియా మునేః**
**తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయంకురు. 283**

జ్ఞానవంతుడైన మునికి గ్రాహ్యమైన వస్తువూ ఉండదు, త్యాజ్యమైన వస్తువూ ఉండదు.

అతనికి కర్త వ్యమూ ఉండదు. కాబట్టి నీవు నిరంతరము ఆత్మనిష్ఠ ద్వారా నీలో నున్న అధ్యాసాన్ని వదలివేయుము!

**తత్త్వమస్యాది వాక్యోత్థబ్రహ్మాత్మైకత్వబోధతః**
**బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయంకురు.** **284**

'తత్త్వమసి' (ఛాందోగ్యోపనిషత్తు 6–8) మొదలైన ఉపనిషణ్మహావాక్యాలవల్ల లభించినట్టి బ్రహ్మ ఆత్మల ఏకత్వజ్ఞానంతో, బ్రహ్మయందు ఆత్మబుద్ధిని దృఢం చేసుకోవటానికై నీలోని అధ్యాసాన్ని దూరం చేయుము!

**అహం భావస్య దేహేఽస్మిన్నిః శేష విలయాదధి**
**సావధానేన యుక్తాత్మా స్వాధ్యాసాపనయం కురు.** **285**

ఈ దేహంలో ఉన్నట్టి అహంభావం ( ఈ శరీరమే నేను అనే భావం) పూర్తిగా లయమైపోయేటంత వరకు, జాగ్రత్తగా, దత్తచిత్తుడవై, నీలోని అధ్యాసాన్ని తొలగించుకో!

**ప్రతీతిర్జీవజగతోః స్వప్నవద్భాతి యావతా**
**తావన్నిరంతరం విద్వన్ స్వాధ్యాసాపనయం కురు.** **286**

ఓ విద్వాంసుడా! జీవుడు, జగత్తు, ఈ రెంటిని గూర్చిన ప్రతీతి స్వప్నంలాగా గోచరించేటంత వరకు నీ యాత్మయందున్న ఈ అధ్యాసాన్ని – భ్రమజ్ఞానాన్ని నిరంతరం త్యజిస్తూ ఉండు.

**నిద్రాయా లోకవార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః**
**క్వచిన్నావసరం దత్త్వా చిన్తయాత్మాన మాత్మని.** **287**

నిద్రవల్ల గాని, లౌకిక వార్తాలాపాలవల్లగాని, శబ్దాదులవల్ల గాని, దేనివల్లనూ ఆత్మ విస్మృతికి అవకాశం యివ్వకుండా,– ఏ కారణంవల్లనైనాసరే, స్వరూపానుసంధానాన్ని మరువకుండా – నీఅంతఃకరణంలో, నిరంతరం, ఆత్మచింతన చేయుము!

**మతాపిత్రోర్మలో ద్భూతం మలమాంసమయం వపుః**
**త్యక్త్వాచండాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీభవ.** **288**

తల్లిదండ్రుల మలంతో పుట్టినట్టి మలమాంసాదులతో నిండి ఉన్నట్టి ఈ శరీరాన్ని, చండాలునివలె దూరంగానే వదలిపెట్టి బ్రహ్మభావంతో స్థిరత్వాన్ని పొంది, కృతకృత్యుడవు కావాలి.

**ఘటాకారశం మహాకశ ఇవాత్మానం పరాత్మని**
**విలాప్యాఖండభావేన తూష్ణీంభవ సదా మునే.** **289**

ఓ మునీ! ఘటం పగిలిపోగానే, ఘటంలోని ఆకాశం (శూన్యం) మహాకాశంలో కలసిపోతుంది. అట్లాగే జీవాత్మను పరమాత్మలో లీనం చేసి సర్వదా అఖండ భావంతో మౌనంగా ఉండు.

**స్వప్రకాశమధిష్ఠానం స్వయంభూయ సదాత్మనా**
**బ్రహ్మాండమపి పిండాండం త్యజ్యతాం మలభాండవత్.** **290**

ఈ జగత్తుకు స్వయం ప్రకాశ స్వరూపుడైన పరబ్రహ్మ అధిష్ఠానం, ఆ సత్స్వరూపునితో ఏకీభావం చెంది, పిండాన్ని బ్రహ్మాండాన్ని ఈ రెండు ఉపాధులను మలంతో నిండిన భాండాన్ని త్యజించినట్లుగా త్యజించు.

**చిదాత్మని సదానన్దే దేహారూఢా మహం ధియం**
**నివేశ్య లింగముత్సృజ్య కేవలో భవ సర్వదా.** **291**

దేహమందు వ్యాప్తమై ఉన్నట్టి అహంబుద్ధిని, నాత్యానంద స్వరూపమైన చిదాత్మలో నిలిపి, లింగశరీరాభిమానాన్ని వదలి సదా అద్వితీయరూపంతో ఉండు.

**యత్రైష జగదాభాసో దర్పణాన్తః పురం యథా**
**తత్‌బ్రహ్మాహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి.** **292**

ఎవనియందు ఈ జగత్తు యొక్క అభాస, దర్పణంలో ప్రతిబింబితమైన పట్టణంలాగా ప్రతీతమౌతుందో, ఆ బ్రహ్మను నేనే! అని ఈ విధంగా తెలుసుకున్న మీదట నీవు కృతకృత్యుడ వవుతావు.

**యత్సత్యభూతం నిజరూపమాద్యం**
**చిదద్వయానంద మరూపమక్రియం**
**తదేత్య మిథ్యావ పురుత్సృజైత -**
**చ్ఛైలూషవద్వేషముపా త్తమాత్మనః.** **293**

చేతనము, అద్వితీయము, ఆనందస్వరూపము, నిష్క్రియము, సత్యస్వరూపము, తన అద్యస్వరూపము-మూలరూపం-అయిన బ్రహ్మాన్ని పొంది, నటునిలాగా ధరించినట్టి, ఈ శరీరమనే మిథ్యా వేషాన్ని, దాని మీద ఆస్థను వదలిపెట్టు.

## అహం పదార్థ నిరూపణం

**సర్వాత్మనా దృశ్యమిదం మృషైవ**
**నైవాహమర్థః క్షణికత్వదర్శనాత్**

**జానామ్యహం సర్వమితి ప్రతీతిః**
**కృతోఽహమాదేః క్షణికస్య సిద్ధ్యేత్.** 294

ఈ దృశ్య జగత్తంతా మిథ్యయే! దీనియొక్క క్షణికత్వం మన చూస్తున్నాం. కాబట్టి ఈ కనిపించే జగత్తు 'అహం' పదార్థం కాజాలదు. కాబట్టి ఈ క్షణికమైన అహం–కారాదులకు 'నేను అన్నీ ఎరుగుదును' అనేలాటి ప్రతీతి ఎట్లా కలుగుతుంది?

**అహం పదార్థస్త్వహమాది సాక్షీ**
**నిత్యం సుషుప్తావపి భావదర్శనాత్**
**బ్రూతే హ్యజోనిత్య ఇతి శ్రుతిః స్వయం**
**తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః.** 295

అహం పదార్థమనేది అహంకారాదులకు సాక్షిగా ఉంటుంది. ఎందుచేతనంటే–దాని సత్తసుషుప్తిలో కూడా కనిపిస్తోంది. శ్రుతి కూడా "అజో నిత్యః" అని చెపుతోంది. కాబట్టి అది ప్రత్యగాత్మ, సదసత్తులకంటె విలక్షణమైనది.

**వికారిణాం సర్వవికారవేత్తా**
**నిత్యోఽవికారోభవితుం సమర్హతి**
**మనోరథస్వప్న సుషుప్తిషు స్ఫుటం**
**పునః పునర్దృష్టమసత్త్వమేతయోః.** 296

అహంకారాది వికారులైన వాటియొక్క సమస్త వికారాలనూ తెలుసుకొనేటటువంటిదీ, నిత్యమైనదీ అయినది ఆ వికారి కావాలి–దానికి వికారమంటూ ఉండకూడదు. మనోరథం, స్వప్న సుషుప్తికాలాల్లో ఈ స్థూల సూక్ష్మశరీరాలూ లేకుండా పోవటం మాటి మాటికీ మనం చూస్తూనే ఉన్నాం. కాబట్టి, ఈ అహం పదార్థాలు ఆత్మ ఎట్లా అవుతాయి?

**అతోఽభిమానం త్యజ మాంసపిండే**
**పిండాభిమానిన్యపి బుద్ధికల్పితే**
**కాలత్రయాబాధ్యమఖండబోధం**
**జ్ఞాత్వా స్వమాత్మాన ముపైహి శాంతిం.** 297

కాబట్టి ఈ మాంసపిండం అయిన శరీరం మీద, దీని యొక్క బుద్ధిచేత కల్పితమైన అభిమానియైన జీవుని మీద అహం బుద్ధిని వదలిపెట్టు. నీ ఆత్మను త్రికాలాబాధ్యమైన దానినిలాగా, అఖండ జ్ఞానస్వరూపంగా తెలుసుకోని శాంతిని పొందు.

త్యజాభిమానం కులగోత్ర నామ -
రూపాశ్రమేష్వార్ద్రశవాశ్రితేషు
లింగస్య ధర్మానపి కర్తృతాదీం -
స్త్యక్త్వా భవాఖండ సుఖస్వరూపః. 298

అందుచేత, క్రుళ్ళిపోయే ఈ మాంసపిండాన్ని (శరీరాన్ని) ఆశ్రయించుకొని ఉన్నట్టి కులము, గోత్రము, నామము, రూపము, బ్రహ్మచర్యాది ఆశ్రమాలు వగైరాల మీద ఉండే అభిమానాన్ని వదలిపెట్టు. కర్తృత్వం, భోక్తృత్వం వగైరా లింగదేహధర్మాలను కూడా వదలిపెట్టు, అఖండ ఆనందస్వరూపుడవు కమ్ము.

## అహంకార నింద

సంత్యన్యే ప్రతిబంధః పుంసః సంసారహేతవో దృష్టాః
తేషామేకం మూలం ప్రథమ వికారోభవత్యహంకారః. 299

పురుషునికి ఈ సంసార బంధనాలు ప్రాప్తించటానికి కారణాలైన అనేక ప్రతిబంధాలు ఉన్నాయి. కాని వాటి అన్నింటికి మూలమైనదీ, మొదటిదీ అయిన వికారం అహంకారం–మిగతా సమస్త అనాత్మభావాలన్నింటి పుట్టుక దీనివల్లనే జరుగుతోంది.

యవత్స్యాత్స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా. 300

ఈ దురాత్మయైన అహంకారంతో ఆత్మకు సంబంధం ఉన్నంతవరకు మోక్షం అనే విలక్షణమైన మాటకు లేశమాత్రం కూడా అవకాశం ఉండదు–మోక్షాన్ని ఆశించలేము.

అహంకారగ్రహాన్ముక్తః స్వరూప ముపపద్యతే
చంద్రవద్విమలః పూర్ణః సదానన్దః స్వయంప్రభః. 301

అహంకారమనే రాహుగ్రహం నుండి విడువబడినంతనే చంద్రునిలాగా ఆత్మ, నిర్మలము, పూర్ణము, నిత్యానంద స్వరూపముతో స్వయంప్రకాశంతో తన స్వరూపాన్ని పొందుతుంది.

యో వా పురే సోఽహమితి ప్రతీతో
బుద్ధ్యా విక్లుప్తస్తమసాతి మూఢయా
తస్యైవ నిఃశేషతయా వినాశే
బ్రహ్మాత్మభావః ప్రతిబంధశూన్యః. 302

అజ్ఞానం వల్ల, అత్యంతమోహితమైన బుద్ధియొక్క కల్పనవల్ల ఈ శరీరంలోనే 'ఇదే నేను' ఈ శరీరమే నేను అనే ప్రతీతి కలుగుతోంది. అది పూర్తిగా నష్టమైపోయిన పిమ్మట ఏ విధమైన ప్రతిబంధమూ లేనట్టి బ్రహ్మభావం కలుగుతుంది.

**బ్రహ్మానంద నిధిర్మహాబలవతాహంకారఘోరాహినా**
**సంవేష్ట్యాత్మని రక్ష్యతేగుణమయైశ్చండైస్త్రిభిర్మస్తకైః**
**విజ్ఞానాఖ్య మహాసినా ద్యుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం**
**నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః. 303**

బ్రహ్మానందమనే ధన నిధిని, అహంకారమనే మహా భయంకరమైన సర్పం, సత్త్వరజ స్తమోగుణాలనే మూడు పడగలతో చుట్టి, దాచి ఉంచింది. వివేకియైనవాడు అనుభవజ్ఞానం అనే ప్రకాశవంతమైన గొప్పఖడ్గంతో ఆ మూడు తలలను నరికి, ఆ సర్పాన్ని మట్టుపెట్టి, ఆ పరమానంద దాయిని అయిన ధన నిక్షేపాన్ని అనుభవించగలుగుతారు.

**యవద్వా యత్కించిద్విషదోషస్ఫూర్తిరస్తి చేద్దేహే**
**కథమారోగ్యాయ భవేత్తద్వదహన్తాపి యోగినో ముక్త్యై. 304**

శరీరంలో విషమనేది ఏ కొద్దిగా మిగిలి ఉన్నా, మానవుణ్ణి ఆ విషం ఆరోగ్యవంతుణ్ణి కానీయదు. అట్లాగే యోగికి మోక్షమార్గంలో అహంకారమనేది ఏ మాత్రం ఉన్నా, గొప్ప ప్రతిబంధకమే అవుతుంది.

**అహమోఽత్యన్తనివృత్త్యా తత్కృతనానావికల్ప సంహృత్యా**
**ప్రత్యక్తత్త్వవివేకాదయ మహమస్మీతివిన్దతే తత్త్వం. 305**

అహంకారం నిశ్శేషంగా తొలగిపోయినందువల్ల, ఆ అహకారంవల్ల పుట్టినట్టి అనేక విధాలైన వికల్పాలు కూడా నష్టమైపోతాయి. అప్పుడు ఆత్మతత్త్వవివేకం జనించటం వల్ల 'ఈ ఆత్మనే నేను' అనే తతత్త్వబోధ కలుగుతుంది.

**అహం కర్తర్యస్మిన్నహమితి మతిం ముంచ సహసా**
**వికారాత్మ న్యాత్మ ప్రతిఫలజుషి స్వస్థితి ముషి**
**యదధ్యాసా త్రాప్తా జనిమృతి జరా దుఃఖబహులా**
**ప్రతీచశ్చిన్మూర్తే స్వవ సుఖతనోః సంసృతిరియం. 306**

ఈ వికారాత్మకమైనట్టి, ఆత్మయొక్క ప్రతిబింబంతో కూడినట్టి, స్వరూపాన్ని కప్పివేసే అహంకారంలో ఉండే ఆత్మబుద్ధిని శీఘ్రంగా వదలివేయాలి. దీని అధ్యాసంవల్లనే, చైతన్య స్వరూపం, ఆనంద స్వరూపం కలిగిన, ప్రత్యగాత్మవైన నీకు, జన్మము, మరణము, ముసలితనం మొదలేన అనేక రకాల దుఃఖాలతో కూడిన ఈ సంసార బంధనం ప్రాపించింది.

సదైకరూపస్య చిదాత్మనో విభో -
రానన్దమూ ర్తే రనవద్య కీర్తేః
నైవాన్యథా క్వాప్యవికారిణస్తే
వినాహ మధ్యాస మముష్య సంసృతిః. 307

ఈ అహంకారం రూపమైన అధ్యాసమేగనుక లేకపోతే, సదా ఏకరూపము, చిదాత్మ, వ్యాపకము, ఆనంద స్వరూపము, పవిత్రకీర్తి, అవికారి అయిన ఆత్మకు సంసార బంధన మనేది ఎన్నడూ ఉండజాలదు.

తస్మాదహంకారమిమం స్వశత్రుం
భోక్తుర్గలే కంటకవత్ప్రతీతం
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినా స్ఫుటం
భుం క్ష్వాత్మ సామ్రాజ్య సుఖం యథేష్టమ్. 308

అందుచేత, ఓ విద్వాసుడా! భోజనం చేసేవాని గొంతులో అడ్డంపడిన ముల్లలాగా బాధ కలిగించే ఈ అహంకార రూపమైన నీ శత్రువును విజ్ఞానమనే గొప్ప కత్తితో చక్కగా ఛేదించి, ఆత్మసామ్రాజ్య సుఖాన్ని యథేచ్ఛగా అనుభవించు.

తతోఽహమాదేర్వినివర్త్య వృత్తిం
స్తన్త్యక్తరాగః పరమార్థలాభాత్
తూష్ణీం సమా స్స్వాత్మ సుఖానుభూత్యా
పుర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః. 309

అహంకారాదుల్లో ఉండే కర్తృత్వం, భోక్తృత్వం మొదలైన వృత్తుల్ని తొలగించి, పరమార్థ తత్త్వాన్ని పొందటంవల్ల రాగరహితుడవై ఆత్మానందానుభవంతో బ్రహ్మభావంలో పూర్తిగా స్థితుడవై కర్వికల్పుడవు కమ్ము. మునివి కమ్ము.

సమూలకృత్తోఽపి మహానహం పున -
ర్వ్యుల్లేఖితః స్యాద్యది చేతసా క్షణం
సంజీవ్య విక్షేపశతం కరోతి
నభ స్వతా ప్రావృషి వారిదో యథా. 310

ఇటువంటి ప్రబలమైన ఈ అహంకారం సమూలంగా నశింపజేయబడినప్పటికీ, ఒక్క క్షణంసేపు అయినా సరే, చితంయొక్క సంపర్కం జరిగితే మళ్ళీ ప్రకటమై వర్షకాలంలో వాయు సంపర్కం పొందిన మేఘంలాగా, వందలకొలది అనర్థాలను, విక్షేపాలను, తెచ్చిపెడుతుంది.

## క్రియ, చింత, వాసనల పరిత్యాగం

**నిగృహ్య శత్రోరహమోఽవకాశః**
**క్వచిన్నదేయో విషయాను చింతయా**
**స ఏవ సంజీవలన హేతురస్య**
**ప్రక్షీణ జంబీర తరోరివాంబు. 311**

ఈ అహంకారం అనే శత్రువును నిగ్రహించినప్పటికీ, విషయచింతనం ద్వారా మళ్ళీ అది తల ఎత్తే అవకాశం ఇవ్వకూడదు. ఎందుచేతనంటే, ఎండిపోయిన నిమ్మచెట్టు నీరు తగలగానే (నీరు అందగానే) మళ్ళీ చిగురించి బ్రతకటానికి కారణం నీరు అయినట్లే అహంకారం మళ్ళీ తల యెత్తటానికి కారణం విషయచింతనమే!

**దేహాత్మనా సంస్థిత ఏవ కామీ**
**విలక్షణః కామయితా కథం స్యాత్**
**అతోఽర్ధ సంధాన పరత్వమేవ**
**భేధ ప్రసక్త్యా భవబంధ హేతుః. 312**

ఎవనికి దేహమందు ఆత్మబుద్ధి ఉంటుందో అటువంటి వానికే కామనలు ఉంటాయి. దేహంతో సంబంధమే లేనట్టి విలక్షణమైన ఆత్మకు కామనలు ఎందుకుంటాయి? కాబట్టి, భేదాసక్తికి కారణమైనందున విషయచింతనలో తగుల్కొని ఉండటమే సంసార బంధనానికి ముఖ్యకారణం.

**కార్య ప్రవర్ధనాద్బీజ ప్రవృద్ధిః పరిదృశ్యతే**
**కార్యనాశాద్బీజనాశస్త స్మాత్కార్యం నిరోధయేత్. 313**

కార్యం పెరుగుతున్నకొలదీ దాని బీజవృద్ధి కూడా జరుగుతూ ఉండటం, కార్యం నష్టమైపోగానే బీజనాశం కూడా జరుగుతూ ఉండటం చూస్తూనే ఉన్నాం. కాబట్టి కార్యన్ని నాశనం చేసివేయాలి.

**వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా**
**వర్ధతే సర్వథా పుంసః సంసారో న నివర్తతే. 314**

వాసనలు పెరిగినకొద్దీ కార్యం పెరుగుతుంది, (దేహాత్మబుద్ధి ఎక్కువౌతుంది) కార్యం పెరిగినకొలదీ వాసనలు పెరుగుతాయి. ఈ విధంగా మానవుని సంసార బంధనం తొలగనే తొలగదు.

**సంసార బంధ విచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహేద్యతిః**
**వాసనా వృద్ధి రేతాభ్యాం చి న్తయా క్రియయా బహిః. 315**

అందుచేత యతీశ్వరులైనవారు సంసార బంధనాలను కోసివేయటానికై ఈ రెంటినీ (కామనలను, దేహాత్మ బుద్ధిని) నాశనం చేస్తారు. విషయాలను గూర్చిన చింతనము, బాహ్యక్రియ, విటివల్ల కూడా వాసనలు వృద్ధిచెందుతాయి.

**తాభ్యాం ప్రవర్ధమానా సా సూతే సంసృతి మాత్మవః**
**త్రయాణాం చ క్షయోపాయః సర్వావస్థాను సర్వదా.** 316

**సర్వత్ర సర్వతః సర్వం బ్రహ్మమాత్రావలోకనమ్**
**సద్భావ వాసనా దార్ఢ్యాత్తత్రయం లయమశ్నుతే.** 317

విషయచింతన, బాహ్యక్రియ అనే ఈ రెండింటి కంటె అధికంగా వాసన అనేది ఆత్మకు సంసారబంధనాన్ని కలిగిస్తుంది. ఈ మూడింటిని క్షయం చేసుకునేటందుకు అన్ని అవస్థల్లోను, అన్నిచోట్ల, అన్నివిధాల అందరు, బ్రహ్మను మాత్రమే దర్శించటం ఒక్కటే ఉపాయం. ఈ బ్రహ్మమయమైన వాసన దృఢమైనంతనే పైన పేర్కొన్న మూడు లయమైపోతాయి.

**క్రియానాశే భవేచ్చిన్తా నాశోఽస్మాద్వాసనాక్షయః**
**వాసనా ప్రక్షయో మోక్షః సా జీవన్ముక్తిరిష్యతే.** 318

క్రియ నష్టమైపోయినంతనే చింత నశిస్తుంది. చింత నశించటంతోడనే వాసనాక్షయం జరుగుతుంది. ఈ వాసనా క్షయం జరగతాన్నే మోక్షం అంటారు. దీనినే జీవన్ముక్తి అంటారు.

**సద్వాసనా స్ఫూర్తి విజృంభణే సతి**
**హ్యసౌ విలీనా త్వహమాది వాసనా**
**అతి ప్రకృష్టాప్యరుణ ప్రభాయాం**
**విలీయతే సాధు యథా తమిస్రా.** 319

సూర్యుని కాంతి ఉదయించటంతోనే, మిక్కిలి ఘోరమైన చీకటిరాత్రి ఎట్లా పూర్తిగా తొలగిపోతుందో, అట్లాగే బ్రహ్మవాసనాస్ఫూర్తి వ్యాపించగానే ఈ అహం కారాది వాసనలు లీనమైపోతాయి.

**తమస్తమః కార్య మనర్థజాలమ్**
**న దృశ్యతే సత్యుదితే దినేశే**
**తథాద్వయానన్ద రసాను భూతౌ**
**నైవా స్తి బన్ధో న చ దుఃఖ గన్ధః.** 320

సూర్యోదయం కాగానే అంధకారము, దానితో పాటు ఆ అంధకారంలో జరిగే దొంగతనాలు వగైరా అనర్థాలు ఇక కనిపించనట్లే, ఈ అద్వితీయమైన ఆత్మానందానుభూతి కలుగగానే ఇక సంసారబంధనాలు ఉండవు, దుఃఖగంధమూ ఉండదు.

## ప్రమాద నింద

దృశ్యం ప్రతీతం ప్రవిలాప యన్స్వయం
సన్మాత్రమానందఘనం విభావయన్
సమాహితః సన్బహి నిరంతరం వా
కాలం నయేథాః సతి కర్మబన్ధే. 321

నీ కర్మబంధనాలు ఇంకా మిగిలిఉంటే, ఈ దృశ్యజగత్తును లయంచేస్తూ, బాహ్యాభ్యన్తరాల్లో జాగ్రత్తగా ఉంటూ, నీ సత్తామాత్రమైన ఆనంద ఘనస్వరూపాన్ని చింతనచేస్తూ, కాలక్షేపం చేయుము.

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన
ప్రమాదో మత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణః సుతః. 322

బ్రహ్మ విచారణలో–బ్రహ్మనిష్ఠలో–ఏమరిపాటు అనేది ఎన్నడూ పనికిరాదు. బ్రహ్మపుత్రుడైన సనత్కుమారుడు 'ప్రమాదమే మృత్యువు' (ఏమరిపాటే మృత్యువు) అని చెప్పాడు.

న ప్రమాదాదనర్థోఽన్యో జ్ఞానినః స్వస్వరూపతః
తతోమోహస్తతోఽహంధీ స్తతో బంధస్తతో వ్యథా. 323

జ్ఞానియైనవానికి స్వస్వరూపాన సంధానంలో ఏమరిపాటును మించిన అనర్థం వేరొకటి లేదు, ఎందుచేతనంటే, ఈ ఏమరిపాటు (ప్రమాదం) వల్ల మోహం పుడుతుంది. మోహంవల్ల అహంకారం, అహంకారంవల్ల బంధనము, బంధనంవల్ల క్లేశము కలుగుతుంది.

విషయాభి ముఖం దృష్ట్వా విద్వాంసమపి విస్మృతిః
విక్షేపయతి ధీదోషైర్యోషా జరామివ ప్రియం. 324

కులటయైన స్త్రీ తన హావభావాలతో తాను ప్రేమించిన పురుషునియొక్క (జారుని) బుద్ధిని పాడుచేసి, పిచ్చివానినిగా చేసేటట్లుగా, విద్వాంసుడైనవాడు సైతం, విషయాల్లో ప్రవృత్తిమవటాన్ని చూచి, ఆత్మవిస్మృతి అనే ఏమరిపాటు బుద్ధిదోషాలతో, విద్వాంసుని సైతం విక్షిప్తం చేస్తుంది.

యతాపకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి
అవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాపి పరాఙ్ముఖం. 325

నీటి మీద వ్యాప్తమై ఉన్న నాచును ఒకసారి మనం తొలగిస్తే అది దూరంగా ఉండదు. శీఘ్రమే మళ్ళీ వ్యాప్తించి జలాన్ని కప్పివేస్తుంది. అట్లాగే ఆత్మవిచార విహీనుడైన విద్వాంసుని కూడా మాయ మళ్ళీ మళ్ళీ చుట్టి వేస్తుంది.

**లక్ష్యచ్యుతం సద్యది చిత్తమీష -**
**ద్బహిర్ముఖం సన్నిపతేత్తత స్తతః**
**ప్రమాదతః ప్రచ్యుత కేలికందుకః**
**సోపాన పంక్తౌ పతితో యథా తథా.** 326

అజాగ్రత్తవల్ల – ఏమరిపాటువల్ల–చేతినుండి జారి పడిన ఆట బంతి ఒక మెట్టుమీది నుండి మరొక మెట్టు మీదకు క్రిందకి పడుతూ పోయినట్లు చిత్తం కూడా తన లక్ష్యం నుండి (బ్రహ్మ నుండి) తొలగి, ఏమాత్రమైనా బహిర్ముఖం అవటం సంభవిస్తే ఇక అది అధోముఖంగా క్రిందకే పోతుంది.

**విషయేష్వా విశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్**
**సమ్యక్సంకల్ప నాత్కామః కామాత్పుంసః ప్రవర్తనమ్.** 327

విషయాలలో లగ్నమైన చిత్తం, వాటి గుణాలను (విషయాల గుణాలనే) చింతన చేస్తూ ఉంటుంది. అట్లా నిరంతరం విషయగుణ చింతనం చేయటంవల్ల కామన పుడుతుంది. ఆ కామనవల్ల మానవునికి మళ్ళీ విషయప్రవృత్తి కలుగుతుంది.

**తతః స్వరూప విభ్రంశో విభ్రష్టస్తు సతత్యధః**
**పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే**
**సంకల్పం వర్జయేత్తస్మాత్సర్వానర్థస్య కారణం.** 328

విషయాలయందు ప్రవృత్తమవటంవల్ల మనిషి ఆత్మ స్వరూపం నుండి చ్యుతుడౌతాడు. ఒకసారి అట్లా స్వరూపం నుండి జారిపడ్డాడంటే, ఇక నిరంతరం అధఃపతనం జరుగుతూనే ఉంటుంది. అట్లా పతితుడైనవాని సర్వనాశనమేతప్ప మళ్ళీ ఉద్ధరింపబడటం అనేది సామాన్యంగా కనిపించదు. అందుచేత, సమస్త అనార్థాలకూ కారణరూపమైన సంకల్పాన్ని త్యజించాలి.

**అతః ప్రమాదాన్న పరోఽస్తి మృత్యు -**
**ర్వివేకినో బ్రహ్మవిదః సమథౌ**
**సమాహితః సిద్ధిముపైతి సమ్యక్**
**సమాహితాత్మా భవ సావధానః.** 329

ఇందువల్ల వివేకి బ్రహ్మవేత్త అయినవానికి, సమాధిలో ప్రమాదాన్ని (ఏమరిపాటును) మించిన మృత్యువు మరేది లేదు – ఏమరిపాటు అంటే మృత్యువే! సమాహితుడైనవాడే పూర్తిగా ఆత్మసిద్ధిని పొందుతాడు కాబట్టి జాగ్రత్తగా చిత్తాన్ని సమాహితం (స్థిరం) చేయాలి.

## అసత్పరిహారం

**జీవతో యస్య కైవల్యం విదేహే స చ కేవలః**
**యత్కించిత్పశ్యతో భేదం భయం బ్రూతే యజుః శ్రుతిః.** **330**

(తైత్తిరీయకంలోని ఆనందవల్లిలో 7వ అనువాకం ఇచట ఉద్దేశింపబడ్డది.)

జీవించి ఉండగానే కైవల్యపదాన్ని పొందినవాడు, దేహపాతం తరువాత కైవల్యముక్తిని పొందుతాడు. ఎందుచేతనంటే, ఏమాత్రం అయినా (కొద్దిగానైనా) భేదాన్ని చూస్తే – తనకు పరమాత్మకు ఏమాత్రం భేదాన్ని చూచినా – అటువంటివాని విషయం, యజుర్వేదాంతర్గతమైన తైత్తిరీయోపనిషత్తు చెప్పనే చెప్పింది.

**యదా కదా వాపి విపశ్చిదేష**
**బ్రహ్మణ్యనన్తేఽ ప్యణుమాత్రభేదమ్**
**పశ్యత్యథాముష్య భయం తదైవ**
**యద్వీక్షితం భిన్నతయా ప్రమాదాత్.** **331**

విద్వాంసుడైనవాడు అనంతమైన బ్రహ్మానికీ తనకూ, అనుమాత్రమైనా భేదదృష్టిని కలిగి ఉన్నప్పుడే అతనికి భయం కలుగుతుంది. ఎందుచేతనంటే, స్వరూపంలో కలిగిన ఏమరిపాటు (ప్రమాదం) వల్లనే అఖండ బ్రహ్మలో భేదం ప్రతీతమౌతుంది.

**శ్రుతి స్మృతి న్యాయ శతైర్నిషిద్ధే**
**దృశ్యేఽత్ర యః స్వాత్మమతిం కరోతి**
**ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం**
**నిషిద్ధ కర్తా స మలిమ్లుచో యథా.** **332**

శ్రుతుల ద్వారా, స్మృతుల ద్వారా, వందలకొలది యుక్తుల ద్వారా నిషేధింపబడిన ఈ దృశ్యములైన దేహాదుల్లో ఆత్మబుద్ధి కలిగిఉన్నవాడు, నిషిద్ధకర్మల నాచరించే దొంగవానిలాగా దుఃఖాలమీద దుఃఖాలను అనుభవిస్తాడు.

**సత్యాను సంధానరతో విముక్తో**
**మహత్త్వమాత్మీయ ముపైతి నిత్యమ్**
**మిథ్యాభి సంధాన రతస్తు నశ్యేద్**
**దృష్టం తదేతద్యద చోరచోరయోః.** **333**

అద్వితీయ బ్రహ్మరూపమైన సత్యపదార్థాన్ని అన్వేషించేవాడే, ముక్తుడై నిత్యమైన మహత్వాన్ని పొందుతాడు. మిథ్యా పదార్థాలవెంట పడేవాడు నశించిపోతాడు. ఈ విషయమే ఛాందోగ్యోపనిషత్తులోని (6–16, 1, 2)లో చెప్పబడ్డది; మనం చూచాం, ఆ ప్రసంగం యిట్లా ఉంది–

(ఒక వ్యక్తిమీద దొంగతనం చేసినట్లు అనుమానం కలిగితే, రాజభటులు అతని చేతికి బాగా కాల్చిన గొడ్డలిని యిస్తారు. అతడు దొంగతనం చేసి కూడా నేను దొంగతనం చేయలేదని అంటే అతని చేయి కాలుతుంది. రాజభటులు కూడా అతనిని చంపుతారు. నిజంగా అతను దొంగతనం చేయకపోతే సత్యప్రభావంవల్ల అతని చేయి కాలదు. రాజభటులు అతనిని వదలివేస్తారు.)

**యతిరసదను సంధిం బంధహేతుం విహాయ**
**స్వయమయ మహమస్మీత్యాత్మ దృష్టైవ తిష్ఠేత్**
**సుఖయతి నను నిష్ఠా బ్రహ్మణి స్వానుభూత్యా**
**హరతి పరమవిద్యా కార్యదుఃఖం ప్రతీతమ్.** 334

యతియైనవాడు, అసత్పదార్థాల వెంటపడటం మానివేసి 'సాక్షాత్తు బ్రహ్మ నేనేను' అనే ఆత్మదృష్టిలోనే స్థిరంగా ఉండాలి. తన అనుభవంవల్ల కలిగిన బ్రహ్మ నిష్ఠయే, అవిద్యకు కార్యమైనట్టి ఈ కనిపించే ప్రాపంచిక దుఃఖాన్ని దూరంచేసి సుఖాన్ని యిస్తుంది.

**బాహ్యాను సంధిః పరివర్ధయేత్ఫలం**
**దుర్వాసనామేవ తత స్తతోఽధికామ్**
**జ్ఞాత్వా వివేకైః పరిహృత్య బాహ్యం**
**స్వాత్మాను సన్ధిం విదధీత నిత్యమ్.** 335

బాహ్యవిషయాలను గూర్చిన చింతనమే, నీ చెడ్డ వాసనలనే ఫలాన్ని ఉత్తరోత్తరా బాగా పెంపొందింపజేస్తుంది. అందుచేత, వివేకంతో ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొని, బాహ్య విషయాలను వదలివేస్తూ నిత్యమూ ఆత్మాను సంధానం చేస్తూ ఉండాలి.

**బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా**
**మనః ప్రసాదే పరమాత్మ దర్శనమ్**
**తస్మిన్సుదృష్టే భవబంధ నాశో**
**బహిర్నిరోధః పదవీ విముక్తేః.** 336

బాహ్య పదార్థాలను నిషేధించినందువల్ల మనస్సుకు ఆనందం కలుగుతుంది. మనస్సులో ఆనందోద్రేకం కలిగినంతనే పరమాత్మ సాక్షాత్కారం లభిస్తుంది. ఆ పరమాత్మ సాక్షాత్కారం చక్కగా కలిగినప్పుడు సంసార బంధనాలు నవిస్తాయి. కాబట్టి ఈ విధంగా ఆలోచించి చూస్తే, బాహ్య పదార్థాలను నిషేధించటమే ముక్తికి మార్గం.

**కః పండితః సన్సదసద్వివేకీ**
**శ్రుతిప్రమాణః పరమార్థదర్శీ**

**జానన్ని కుర్యాదసతోఽవలమ్బం**
**స్వపాతహేతోః శిశువన్ముముక్షుః.**

సదసద్వస్తు వివేకం కలిగినవాడు, శ్రుతి ప్రమాణం తెలిసినవాడు, పరమార్థ తత్వాన్ని ఎరిగినవాడు, బుద్ధి మంతుడైనవాడు, ముక్తిని కోరుతూ కూడా, తెలిసి తెలిసి, పిల్లవానిలాగా తన పతనానికి కారణమైన అసత్పదార్థాలను ఎందుకు కోరతాడు?

**దేహాదిసంసక్తిమతో నముక్తి -**
**ర్ముక్తస్య దేహాద్యభిమత్యభావః**
**సుప్తస్య నో జాగరణం న జాగ్రత్తః**
**స్వప్నస్తయోర్భిన్నగుణాశ్రయత్వాత్.** 338

దేహాదులైన అనాత్మ వస్తువులందు ఆసక్తి కలవానికి మోక్షమనేది ఉండజాలదు. ముక్తుడైనవానికి దేహాది అసత్పదార్థాల మీద అభిమానమూ ఉండదు–నిద్రలో ఉన్నవానికి జాగృతిలోని అనుభవం ఉండదు. మేల్కొని ఉన్నవానికి స్వప్నానుభవం ఉండదు గదా! ఈ రెండు అవస్థలూ భిన్నగుణాలకు ఆశ్రయం అయినట్టివి కాబట్టి.

## ఆత్మనిష్ఠ యొక్క పద్ధతి

**అన్తర్బహిః స్వం స్థిరజంగమేషు**
**జ్ఞానాత్మనాధారతయా విలోక్య**
**త్యక్తాఖిలో పాధిరఖండ రూపః**
**పూర్ణాత్మనా యః స్థిత ఏష ముక్తః.** 339

సమస్త స్థావరజంగమ పదార్థాల లోపల బయటా కూడా, తననే, జ్ఞానస్వరూపంతో వాటికి ఆధారభూతమైన వానినిగా చూస్తూ, సమస్త ఉపాధులనూ వదలి, అఖండము పరిపూర్ణము అయిన స్థితిలో ఉన్నట్టివాడే ముక్తుడు.

**సర్వాత్మనా బంధవిముక్తహేతుః**
**సర్వాత్మభావాన్న పరోఽస్తి కశ్చిత్**
**దృశ్యాగ్రహే సత్యుపపద్యతేఽసౌ**
**సర్వాత్మభావోఽస్య సదాత్మనిష్ఠయా.** 340

సమస్త బంధనాల నుండి, సర్వథా (అన్ని విధాలా) ముక్తిని పొందటానికి సర్వాత్మభావం – (అన్నింటిని ఆత్మ రూపంలో చూడటమనే భావం) కంటె మించిన హేతువు మరొకటి లేదు, నిరంతరం, ఆత్మ నిష్ఠయందు ఉన్నందువల్ల, దృశ్యమంతా తొలగిపోయి, సర్వాత్మభావం ప్రాప్తిస్తుంది.

**దృశ్యస్యాగ్రహణం కథం ను ఘటతే దేహాత్మనా తిష్ఠతే**
**మాహ్యార్థానుభవ ప్రసక్తమనసస్తత్తత్క్రియాం కుర్వతః**
**సన్న్యస్తాఖిలధర్మకర్మ విషయైర్నిత్యాత్మ నిష్ఠాపరై -**
**స్తత్త్వజ్ఞైః కరణీయమాత్మని సదానన్దేచ్ఛుభిర్యత్నతః.** 341

దేహమే ఆత్మ అనే బుద్ధితో ఉంటూ, బాహ్య పదార్థాల యెడల మనస్సులో ఆసక్తిని కలిగిఉండి వాటి కోసమే నిరంతరం పనిచేస్తూ ఉండేవారికి దృశ్యప్రపంచాన్ని గురించిన అప్రతీతి ఎట్లా కలుగుతుంది? అందుకే, నిత్యానందాన్ని కోరే తత్త్వజ్ఞానులైనవారు సమస్త ధర్మాలను, కర్మలను, విషయాలను వదలివేసి, నిరంతరం ఆత్మనిష్ఠలోనే తత్పరులై, తన ఆత్మయందు ప్రతీతమయ్యే ఈ దృశ్య ప్రపంచాన్ని ప్రపంచాన్ని ప్రయత్న పూర్వకంగా వదలివేయాలి.

**సార్వాత్మ్యసిద్ధయే భిక్షోః కృతశ్రవణ కర్మణః**
**సమాధిం విదధాత్యేషా శాంతోదాంత ఇతి శ్రుతిః.** 342

(ఈ శ్లోకంలో బృహదారణ్యకోపనిషత్తులోని (4-4-23) మంత్రం ఉదాహృతమైంది - "తస్మాదేవం విచ్ఛాన్తోదా ఉపరత.......భవతి") ఈ శ్రుతి యతియైన వానికి వేదాస్తశ్రవణానంతరం, సర్వాత్మ్యభావసిద్ధి కోసం సమాధిని విధిస్తోంది. (ఈ విధంగా బ్రహ్మను తెలుసుకొన& వానికి ధర్మాధర్మ కర్మలయొక్క ఫలం అంటదు. సత్యపాపాలు వానిని అంటవు. అట్టివాడు బాహ్యేంద్రియ వ్యాపారాలు అన్నీ ఉపశమించినవాడై, అంతఃకరణయందు తృష్ణ లేనివాడైనందున దాంతుడు, కోరికల నుండి విముఖుడు, తితిక్షువు అయి సమూహితచిత్తుడై తనలోనే ఆత్మను దర్శిస్తాడు. తనలోనే సమస్తాన్నీ దర్శిస్తాడు... అని భావం)

**ఆరూఢశక్తేరహమో వినాశః**
**కర్తుం నశక్యః సహసాపి పిండితైః**
**యే నిర్వి కల్పాఖ్యసమాధినిశ్చలా -**
**స్తానస్తరానన్తభవా హి వాసనాః.** 343

అహంకారం యొక్క శక్తి బాగా ప్రబలంగా ఉన్నంతవరకు, ఎంతటి విద్వాంసుడైనా దానిని ఒక్క సారిగా నశింపజేయలేదు. ఎందుచేతనంటే, నిర్వికల్ప సమాధియందు, అవిచలభావంతో ఉన్నట్టివారికైనా, వారి లోపలకూడా వాసనలు కనిపిస్తాయి.

**అహంబుద్ధ్యైవ మోహిన్యా యోజయిత్వావృతేర్బలాత్**
**విక్షేపశక్తిః పురుషం విక్షేపయతి తద్గుణైః.** 344

మోహింపజేసే టటువంటి అహంబుద్ధితో, తన ఆవరణశక్తి ద్వారా మానవుని సంయోగాన్ని కలిగించి, విక్షేపశక్తి అనేది, అహం బుద్ధియొక్క గుణాలతో అతనిని విక్షిప్తుణ్ణి చేస్తుంది.

**విక్షపశక్తివిజయో విషమో విధాతుం**
**నిశ్శేషమావరణశక్తి నివృత్త్యభావే**
**దృగ్దృశ్యయోః స్ఫుటపయోజలవద్విభాగే**
**నశ్యేత్తదావరణమాత్మని చ స్వభావత్**
**నిఃసంభయేన భవతి ప్రతిబంధశూన్యో**
**విక్షేపణం న హి తదా యది చేన్మృషార్థే.** 345

**సమ్యగ్వివేకః స్ఫుటబోధజన్యో**
**విభజ్య దృగ్దృశ్యపదార్థతత్త్వమ్**
**ఛినత్తి మాయాకృతమోహబన్ధం**
**యస్మాద్విముక్తస్య పునర్న సంసృతిః.** 346

అపరణశక్తి నిశ్చేషంగా నివృత్తమైపోతేనే తప్ప విక్షేపశక్తిని జయంచటం మిక్కలి కష్టం. పాలు, నీరులాగా, ద్రష్ట దృశ్యము ఈ రెండూ వేరైనట్లుగా స్పష్టమైన జ్ఞానం కలిగిన మీదట, ఆత్మయందు వ్యాపించియున్న ఈ అవరణశక్తి తనంతట తానే నష్టమైపోతుంది. ఒక వేళ మిథ్యగా కనిపించే ఈ బుద్ధి మొదలైన పదార్థాల్లో ద్రష్ట, దృశ్య పదార్థాల స్వరూపాన్ని వేరువేరుగా చేసి, స్పష్టమైన జ్ఞానంవల్ల కలిగే సందేహ రహితము, నిషేధ రహితము అయిన పూర్ణవివేకం కలిగినప్పుడు ఇక విక్షేపం ఉండదు. ఆ వివేకం మాయవల్ల కలిగిన మోహబంధనాలను కోసి వేస్తుంది. దానినుండి ముక్తుడైనవాడు మళ్ళీ జననమరణ రూపమైన సంసారాన్ని పొందదు.

**పరావరూకత్వ వివేకవహ్ని -**
**ర్దహిత్యవిద్యాగహనం హ్యశేషం**
**కిం స్యాత్పునః సంసరణస్య బీజ**
**మద్వైతభావం సముపేయుషోఽస్య.** 347

బ్రహ్మ ఆత్మలయొక్క ఏకత్వజ్ఞానం అనే అగ్ని, అవిద్య అనే అడవినంతటినీ భస్మంచేసివేస్తుంది. అట్లా ఆవిద్య పూర్తిగా నశించిపోయిన పిమ్మట, అద్వైతభావం ప్రాప్తిస్తుంది. అప్పుడిక సాంసార ప్రాప్తికి కారణమైనదేదీ ఉండదు.

**ఆవరణస్య నివృత్తి -**
**ర్భవతి చ సమ్యక్పదార్థ దర్శనతః**

మిథ్యాజ్ఞాన వినాశ -
స్తద్వద్విక్షేప జనిత దుఃఖనివృత్తిః. 348

ఆత్మవస్తువు సరిగా సాక్షాత్కరించటంవల్ల ఆవరణ నివృత్తి జరుగుతుంది. అట్లాగే, మిథ్యాజ్ఞానం నశిస్తుంది. విక్షేపంవల్ల కలిగే దుఃఖమూ తొలగిపోతుంది.

## అధిష్ఠాన నిరూపణం

ఏతత్త్రితయం దృష్టం సమ్యగ్రజ్జు స్వరూపవిజ్ఞానాత్
తస్మాద్వస్తు సతత్త్వం జ్ఞాతవ్యం బంధముక్తయే విదుషా. 349

త్రాటియందు భ్రమ కారణంగా సర్పం యొక్క ప్రతీతి కలుగుతోంది. ఆ మిథ్యాప్రతీతి వల్లనే భయం, కంపం, వగైరా దుఃఖాలు కలుగుతున్నాయి. కాని, దీపం వగైరాల ద్వారా రజ్జువుయొక్క యదార్థ స్వరూప జ్ఞానం కలగటంతోడనే, రజ్జువును ఆవరించిన అజ్ఞానము, అజ్ఞానం వల్ల కలిగిన సర్పమనే మలము, సర్పప్రతీతివల్ల కలిగిన భయకంపాది విక్షేపం, ఈ మూడూ ఒకేసారిగా నివృత్తిమైపోతున్నాయి. అట్లాగే ఆత్మస్వరూప జ్ఞానం కలగటం తోడనే ఆత్మయొక్క అజ్ఞానం, అజ్ఞానంవల్ల కలిగిన ప్రపంచ ప్రతీతి, దానివల్ల కలిగినట్టి దుఃఖాలు ఒక్కసారిగా నివృత్తమౌతున్నాయి. అందుకే విద్యాంసుడైనవాడు సంసార బంధనాలనుండి విడివడటానికై తత్త్వసహితమైన ఆత్మ పదార్థ జ్ఞానాన్ని పొందాలి.

అయోఽగ్నియోగాదివ సత్సమన్వయా -
న్మాత్రాదిరూపేణ విజృంభతే ధీః
తత్కార్యమేతద్ద్వితయం యతో మృషా
దృష్టం భ్రమస్వప్నమనోరథేషు. 350

అగ్ని సంయోగంవల్ల ఇనుము పలుగులు పారలు వగైరా అనేక రకాల రూపాలు ధరించినట్లు, ఆత్మయొక్క సంయోగంవల్ల బుద్ధి (శబ్ద స్పర్శ రూప రసగంధాది) అనేక విషయాలలో వ్యక్తమౌతోంది; అనేక విధాలుగా ప్రకాశిసస్తోంది. ఈ ద్వైత ప్రపంచమంతా ఆ బుద్ధి యొక్క కార్యమే! అందుచేత అది మిథ్య, దాని మిథ్యాస్వరూపం, భ్రమ సమయంలో, స్వప్న సమయంలో, మనోరథాల సమయంలో మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

తతో వికారా ప్రకృతేరహం ముఖా
దేహావసానా విషయాశ్చ సర్వే
క్షణేఽన్యథాభావితయా హ్యమీషా -
మసత్త్వమాత్మా తు కదాపి నాన్యథా. 351

అందుచేత అహంకారం మొదలుకొని దేహం వరకు ప్రకృతియొక్క ఎన్ని వికారాలూ, (విషయాలూ) ఉన్నాయో అవన్నీ క్షణక్షణమూ మార్పు చెందేవే కాబట్టి అసత్యాలు, ఆత్మ అనేది ఎన్నడూ మారేది కాదు. అది ఎల్లప్పుడూ ఏక రసంగా ఉంటుంది.

**నిత్యాద్వయాఖండ చిదైకరూపో**
**బుద్ధ్యాదిసాక్షి సదసద్విలక్షణః**
**అహంపదప్రత్యయ లక్షితార్థః**
**ప్రత్యక్సదానన్దఘనః పరాత్మా.** 352

'అహం' అనే పదంవల్ల కలిగే ప్రతీతికి లక్షితమైనట్టి వాడు నిత్యుఁడ, ఆనందఘనుడు అయిన ఆ పరమాత్మ సదా అద్వితీయుడు, అఖండుడు, చేతనస్వరూపుడు, బుద్ధి మొదలైనవాటికి సాక్షి, సదసత్తులకంటె భిన్నమైనవాడు ప్రత్యగాత్మ-అంతరాత్మ.

**ఇత్థం విపశ్చి త్సదసద్విభజ్య**
**నిశ్చిత్య తత్త్వం నిజబోధదృష్ట్యా**
**జ్ఞాత్వా స్వమాత్మాన మఖండబోధం**
**తేభ్యో విముక్తః స్వయమేవ శామ్యతి.** 353

విద్వాంసులైనారు ఈ విధంగా సదసత్తులను విభజించి (వేరుచేసి) తమ జ్ఞాన దృష్టితో తత్త్వాన్ని నిశ్చయంచుకొని, అఖండ జ్ఞానస్వరూపమైన ఆత్మను తెలుసుకొని, అసత్పదార్థాల నుండి ముక్తులై, తాము స్వయంగా శాంతిని పొందుతారు.

## సమాధి నిరూపణం

**అజ్ఞాన హృదయగ్రన్థేర్నిశ్శేష విలయ స్తదా**
**సమాధినా వికల్పేన యదాద్వైతాత్మ దర్శనమ్.** 354

నిర్వికల్ప సమాధి ద్వారా అద్వైత ఆత్మస్వరూపం యొక్క సాక్షాత్కారం లభించినప్పుడు అజ్ఞానరూపమైన హృదయగ్రంథి సంపూర్ణంగా తెగిపోతుంది.

**త్వమహమిదమితీయం కల్పనా బుద్ధిదోషాత్**
**ప్రభవతి పరమాత్మన్యద్వయే నిర్విశేషే**
**ప్రవిలసతి సమాధావస్య సర్వో వికల్పో**
**విలయనముపగచ్ఛేద్వస్తు తత్త్వావధృత్యా.** 355

అద్వితీయము, నిర్విశేషము అయిన పరమాత్మయందు మన బుద్ధిదోషంవల్ల 'నీవు, నేను, ఇది' అనే ఈ విధమైన కల్పన పుడుతోంది. ఈ విధమైన కల్పనయే సంపూర్ణమైన వికల్ప సమాధిలో

విష్ణురూపంలో స్ఫురిస్తోంది. కాని తత్త్వవస్తువు సరిగా గ్రహింపబడినప్పుడు అదంతా–ఆకల్పన అంతా – లీనమైపోతుంది.

**శాంతోదాన్తః పరముపరతః క్షాన్తియుక్తః సమాధిం**
**కుర్వన్నిత్యం కలయతి యతిః స్వప్న సర్వాత్మభావమ్**
**తేనావిద్యా తిమిర జనితాన్సాధు దగ్ధ్వా వికల్పాన్**
**బ్రహ్మాకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః. 356**

యోగియైనవాడు చిత్తశాంతి, ఇంద్రియనిగ్రహం, విషయాల నుండి ఉపరతిని పొంది, క్షమాగుణంతో కూడి నిరంతరం సమాధిని అభ్యాసం చేస్తూ తన సర్వాత్మభావాన్ని అనుభవిస్తాడు. తద్వారా అవిద్య అనే అంధకారం వల్ల పుట్టిన సమస్త వికల్పాలనూ చక్కగా ధ్వంసం చేసి వేసి, నిష్క్రియుడు నిర్వికల్పుడు అయి ఆనందంతో బ్రహ్మాకార వృత్తిలో ఉంటాడు.

**సమాహితా యే ప్రవిలప్య బాహ్యం**
**శ్రోత్రాది చేతః స్వమహం చిదాత్మని**
**త ఏవ ముక్తా భవపాశబన్ధైః**
**నాన్యేతు పారోక్ష్య కథాభిధాయినః. 357**

శ్రోత్రాది ఇంద్రియసమూహాన్నీ, చిత్తాన్నీ, అహంకారాన్ని ఈ బాహ్యవస్తువులన్నింటినీ, ఆత్మయందు లీనంచేసి, సమాధిలో స్థితిని పొందేవారే సంసార బంధనాల నుండి విముక్తులౌతారు. కేవలం పనరోక్షబ్రహ్మ సంబంధమైన మాటలు చెప్పేవారు (అపరోక్ష బ్రహ్మజ్ఞానం లేనివారు) ఎన్నటికీ మోక్షాన్ని పొందరు.

**ఉపాధిభేదాత్స్వయమేవ భిద్యతే**
**చోపాధ్యపోహే స్వయమేవ కేవలః**
**తస్మాదుపాధేర్విలయాయ విద్వా**
**న్వసేత్సదాకల్పసమాధి నిష్ఠయా. 358**

ఉపాధిభేదంవల్లనే ఆత్మయందు సైతం భేద ప్రతీతి కలుగుతోంది–భేదం కనిపిస్తోంది. ఉపాధి గనుక లయమైపోతే కేవలం ‘స్వయం’ అనేదే ఉంటుంది – తాను అనేది ఒకటే మిగిలి ఉంటుంది. అందుచేత ఉపాధిని లయం చేయటం కోసమే బుద్ధిమంతులు సదా నిర్వికల్ప సమాధిలో ఉంటారు.

**సతి సక్తోనరోయాతి సద్భావం హ్యేకనిష్ఠయా**
**కీటకో భ్రమరం ధ్యాయన్భ్రమరత్వాయ కల్పతే. 359**

గూటిలో నున్న ఒక పురుగు, భ్రమరం-తుమ్మెద వలని భయంతో సదా ఆ తుమ్మెదనే ధ్యానిస్తూ ఉన్నందున, అది (పురుగు) తుమ్మెదరూపాన్నే ధరించి తుమ్మెదయే అవుతోంది ( ఇది భ్రమరకీట న్యాయం) అట్లాగే, ఏకాగ్ర చిత్తంతో నిరంతరం సత్స్వరూపమైన బ్రహ్మంలో స్థితుడై ఉండేవాడు బ్రహ్మస్వరూపుడే అవుతాడు.

**క్రియా న్తరాస క్తిముపాస్య కీటకో**
**ధ్యాయన్యథాలిం హ్యలిభావమృచ్ఛతి**
**తథైవ యోగే పరమాత్మ తత్త్వం**
**ధ్యాత్వా సమాయాతి తదేక నిష్ఠయా. 360**

ఇతరములైన సమస్త క్రియలందూ ఆసక్తిని వదలిపెట్టి, కేవలం భ్రమరాన్ని మాత్రమే ధ్యానిస్తూ కీటకం, భ్రమరమైపోతుంది. అట్లాగే యోగి ఏకనిష్ఠ కలవాడై పరమాత్మతత్త్వాన్నే చింతన చేస్తూ చేస్తూ పరమాత్మ భావాన్నే పొందుతాడు.

**అతీవసూక్ష్మం పరమాత్మతత్త్వం**
**న స్థూలదృష్ట్యా ప్రతిపత్తుమర్హ తి**
**సమాధినాత్యన్త సుసూక్ష్మవృత్త్యా**
**జ్ఞాతవ్యమార్యైరతిశుద్ధ బుద్ధిభిః. 361**

పరమాత్మ తత్త్వమనేది మిక్కిలి సూక్ష్మమైనది. స్థూల దృష్టితో దానిని ఎవరూ పొందలేరు. అందుచేత మిక్కిలి పరిశుద్ధమైన - నిర్మలమైన - బుద్ధిగల సత్పురుషులు సూక్ష్మదృష్టితో సమాధి ద్వారా దానిని (పరమాత్మ తత్త్వాన్ని) తెలుసుకోవాలి.

**యథాసువర్ణం పుటపాకశోధితం**
**త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి**
**తథామనః సత్త్వరజ స్తమోమలం**
**ధ్యానేన సన్త్యజ్య సమేతి తత్త్వమ్. 362**

అగ్నిలో కరగించి-పుటపాక క్రియలతో శుద్ధి చేయబడిన బంగారం తనలోని మాలిన్యాలన్నింటిని పూర్తిగా త్యజించి, తనదైన స్వాభావికమైన స్వరూపాన్ని పొందినట్లుగా, మనస్సు, ధ్యానం ద్వారా సత్త్వరజ స్తమస్సులనే మాలిన్యాలను వదలి ఆత్మతత్త్వాన్ని పొందుతుంది.

**నిరంతరాభ్యాసవశాత్తదిత్థం**
**పక్వం మనోబ్రహ్మణి లీయతే యదా**
**తదా సమాధిః స వికల్పవర్జితః**
**సతో-ద్వయానన్దరసానుభావకః. 363**

రాత్రింబవళ్ళు నిరంతరాభ్యాసంవల్ల పరిపక్వమై, మనస్సు, బ్రహ్మంలో లీనమైపోయినప్పుడు, అద్వితీయ బ్రహ్మానందరూపాన్ని అనుభవింపజేసే నిర్వికల్పసమాధి తనంతట అదే లభిస్తుంది – నిర్వికల్పసమాధిస్థితి సిద్ధిస్తుంది.

**సమాధినానేన సమస్తవాసనా -**
**గ్రథేర్వినాశోఽఖిలకర్మనాశః**
**అంతర్బహిః సర్వత ఏవసర్వదా**
**స్వరూప విస్ఫూర్తిరయత్నతః స్యాత్. 364**

నిర్వికల్ప సమాధివల్ల సమస్త వాసనాగ్రంథులూ నశించిపోతాయి. వాసనలన్నీ నష్టమైపోయి నందున సమస్త కర్మలూ నశిస్తాయి–కర్మనాశనం జరుగుతుంది. అంతట బాహ్యాభ్యన్తరాల్లో–అంతటా–అప్రయత్నంగానే నిరంతరము స్వరూపస్ఫూర్తి (స్వరూపం స్ఫురించటం) కలుగుతుంది.

**శ్రుతేః శతగుణం విద్యాన్మననం మాననాదపి**
**నిదిధ్యాసం లక్షగుణమనంతం నిర్వికల్పకమ్. 365**

వేదాంతాలను–ఉపనిషత్తులు మొదలైనవాటిని–ఊరికే వింటూ ఉండటం కంటె విన్న వాటిని మననం చేయటము వదరెట్లు మంచిది. మనకంటె, నిదిధ్యసనం (ఆత్మ భావనను తన చిత్తంలో స్థిరం చేసుకోవటం) లక్షరెట్లు మంచిది. నిదిధ్యాసనంకంటె కూడా నిర్వికల్ప సమాధి అంతులేనన్ని రెట్లు మంచిది. దీనివల్ల (ఈ నిర్వికల్పసమాధి వల్ల) చిత్తం మళ్ళీ ఎన్నడూ చలనం పొందదు, చలించదు.

**నిర్వికల్పకసమాధినా స్ఫుటం**
**బ్రహ్మతత్త్వ మవగమ్యతే ధ్రువమ్**
**నాన్యథా చలతయా మనోగతేః**
**ప్రత్యయాన్తర విమిశ్రితం భవేత్. 366**

నిర్వికల్ప సమాధి ద్వారా తప్పకుండా బ్రహ్మతత్త్వానికి సంబంధించినట్టి స్పష్టమైన జ్ఞానం కలుగుతుంది. ఇంకే విధంగానూ అటువంటి జ్ఞానం కలగదు. ఎందుచేతనంటే ఇతర పరిస్థితుల్లో–అవస్థల్లో–చిత్తవృత్తి చంచలంగా ఉండటంవల్ల అందులో అనేకములైన ఇతర ప్రతీతులు కూడా కలుస్తాయి.

**అతః సమాధత్స్వ యతేన్ద్రియః సదా**
**నిరంతరం శాంతమనాః ప్రతీచి**
**విధ్వంసయ ధ్వాంతమనాద్యవిద్యయా**
**కృతం సదేకత్వవిలోకనేన. 367**

కాబట్టి ఎల్లప్పుడూ ఇంద్రియాలను జయించి, శాంతమైన మనస్సుతో నిరంతరం ప్రత్యగాత్మమైన బ్రహ్మయందు చిత్తాన్ని స్థిరం చెయ్యి! సచ్చిదానందబ్రహ్మతో నీ ఏకత్వాన్ని దర్శిస్తూ, అనాదియైన అవిద్యవల్ల కలిగిన అజ్ఞానాంధకారాన్ని ధ్వంసం చేయుము.

**యోగస్య ప్రథమంద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః**
**నిరాశా చ నిరీహా చ నిత్యమేకాంతశీలతా.** **368**

వాక్కును నియమించటం (నిరోధించటం లేదా మౌనం) అపరిగ్రహం (ద్రవ్యసంగ్రహం చేయకపోవటం) లౌకిక పదార్థాలయందు ఆశ లేకుండటం కామనలను వదలి వేయటం, నిత్యమూ ఏకాంతంలో ఉండటం అనేవి యోగానికి మొదటి ద్వారం–సింహద్వారం.

**ఏకాంతస్థితిరింద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః**
**సంరోధే కరణం శమేన విలయం యాయాదహంవాసనా**
**తేనానందరసానుభూతిరజలా బ్రాహ్మీసదా యోగిన -**
**స్తస్మాచ్చిత్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నాన్మునేః.** **369**

ఏకాంతంలో ఉండటం ఇంద్రియదమనానికి కారణమౌతుంది. ఇంద్రియదమనం అనేది చిత్తనిరోధానికి కారణం అవుతుంది. చిత్తనిరోధంవల్ల వాసనా నాశనం జరుగుతుంది–వాసనాయామం సిద్ధిస్తుంది. వాసనలు నష్టమైపోయినందున యోగికి నిశ్చలమైన బ్రహ్మానందరసానుభూతి కలుగుతుంది. కాబట్టి సాధకుడైన ముని ప్రయత్నపూర్వకంగా చిత్తాన్ని నిరోధించటం అవసరం.

**వాచం నియచ్ఛాత్మని తం నియచ్ఛ**
**బుద్ధౌ ధియం యచ్ఛ చ బుద్ధిసాక్షిణి**
**తం చాపి పూర్ణాత్మని నిర్వికల్పే**
**విలాప్య శాన్తిం పరమాం భజస్వ.** **370**

వాక్కును మనస్సులో లయం చేయుము, మనస్సును బుద్ధిలో లయం చేయుము, బుద్ధిని, ఆ బుద్ధికి సాక్షియైన ఆత్మలో లయం చేయుము, బుద్ధికి సాక్షియైన కూటస్థుని నిర్వికల్ప పూర్ణబ్రహ్మలో లయం చేసి పరమశాంతిని అనుభవించుము.

**దేహప్రాణేంద్రియ మనోబుద్ధ్యాదిభిరుపాధిభిః**
**యైర్యైర్వృత్తేః సమాయోగ స్తత్తద్భావోఽస్య యోగినః.** **371**

దేహము, ప్రాణాలు, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఈ ఉపాధులలో దేనితో యోగియొక్క చిత్తవృత్తికి సంబంధం ఉంటుందో వాటికి సంబంధించిన ఆయా భావలే అతనికి కలుగుతాయి.

**తన్నివృత్త్యా మునేః సమ్యక్సర్వోపరమణం సుఖం**
**సందృశ్యతే సదానందరసానుభవ విప్లవః.** 372

ఆ ముని యొక్క చిత్తం ఈ సమస్తమైన ఉపాధుల నుండి నివృత్తమై పోయినప్పుడు అతనికి సంపూర్ణమైన ఉపరతివల్ల కలిగై ఆనందం స్పష్టంగా గోచరిస్తుంది. తద్వారా అతని చిత్తంలో సచ్చిదానందనసానుభవానికి సంబంధించిన వెల్లువ పొడిసూపుతుంది.

## వైరాగ్య నిరూపణం

**అన్తస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే**
**త్యజత్య న్తర్బహిఃసంగం విరక్తస్తు ముముక్షయా.** 373

విరక్తుడైనవాడు అంతరిక త్యాగము, బాహ్య త్యాగము రెండూ చేయాలి. అట్టివాడు మోక్షమందలి కోరికతో అంతరికమైన సంగాన్ని, బాహ్యసంగాన్ని వదలివేస్తాడు.

**బహిస్తు విషయైః సంగం తథాన్తరహమాదిభిః**
**విరక్తఏవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠితః.** 374

ఇంద్రియాలకు విషయాలతో ఉండే బాహ్యసంగాన్ని, అహంకారాదులతో ఉండే అంతరికసంగాన్నీ కూడా బ్రహ్మ విష్ఠుడైనట్టి, విరక్తుడైనట్టివాడే త్యజించగలుగుతాడు.

**వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్**
**పక్షౌ విజానీహి విచక్షణ త్వం**
**విముక్తిసౌధా గ్రతలాధిరోహణం**
**తాభ్యాం వినా నాన్యతరేణ సిధ్యంతి.** 375

ఓ విద్వాసుడా! పక్షికుండే రెండు రెక్కలలాంటివే, మోక్షకామియైన వానికుండే వైరాగ్యము, జ్ఞానము అనేవి! వైరాగ్యం జ్ఞానం అనేవి ముముక్షువుకు రెండు రెక్కల లాంటివి. ఏ ఒకటి లేకపోయినా, మిగిలిన ఒక దానితోనూ మోక్షమనే సౌధాగ్రభాగానికి ఎగిరి చేరలేదు. మోక్షప్రాప్తికి వైరాగ్యము, జ్ఞానము రెండూ అవసరమే అని భావం.

**అత్యన్తవైరాగ్యవతః సమాధిః**
**సమాహితస్యైవ దృఢప్రబోధః**
**ప్రబుద్ధతత్త్వస్య హి బంధముక్తి -**
**ర్ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః.** 376

మిక్కిలి వైరాగ్యం కలవానికే సమాధి లాభం కలుగుతుంది. సమాధిస్థుడైన వానికే దృఢమైన

జ్ఞానం (బోధ) కలుగుతుంది. సుదృఢమైన జ్ఞానవంతునికే సంసార బంధవిముక్తి కలుగుతుంది. సంసార బంధనాల నుండి విడివడినవానికే నిత్యానందానుభవం కలుగుతుంది.

**వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మన**
**స్తచ్చేచ్ఛుద్ధతరాత్మబోధసహితం స్వారాజ్య సామ్రాజ్యధుక్**
**ఏతద్ద్వారమజస్రముక్తి యువతేర్యస్మాత్త్వమస్మాత్పరం**
**సర్వత్రాస్పృహయా సదాత్మని సదా ప్రజ్ఞాం కురుశ్రేయసే. 377**

జితేంద్రియుడైన వానికి వైరాగ్యాన్ని మించిన సుఖదాయకమైనది మరేది నాకు కనిపించదు. ఆ వైరాగ్యమనేది, శుద్ధమైన ఆత్మజ్ఞానంతో కూడినదైతే స్వర్గ సామ్రాజ్య సుఖాన్ని యిచ్చేది అవుతుంది. అది మోక్షమనే కామినియొక్క నిరంతరం తెరచి ఉంచిన ద్వారం లాంటిది. అందుచేత, నాయనా! నీవు నీ మేలుకోసం అన్ని విధాలా కోరికలు లేనివాడివై సచ్చిదానంద బ్రహ్మంలో నీ బుద్ధిని స్థిరం చేయుము.

**అశాం ఛిన్ధి విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః స్మతి -**
**స్త్యక్త్వా జాతికులాశ్రమేష్వభిమతిం ముంచాతి దూరాత్క్రియాః**
**దేహాదావసతి త్యజాత్మధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని**
**త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ధయపరం బ్రహ్మాసి యద్వస్తుతః. 378**

విషమ విషయాలన్నింటినీ విషంలాగా వదలిపెట్టు! ఎందుచేతనంటే, ఈ విషయాలనేవి స్వరూప విస్మృతి అనే మృత్యువుకు మార్గంలాంటిది. జాతి, కుల, ఆశ్రమాదుల మీది అభిమానాన్ని వదలి, కర్మలకు దూరం నుండే ఒక నమస్కారం చెయ్యి! దేహాదులందు – అసత్పదార్థాల యందు, ఆత్మబుద్ధిని వదలిపెట్టు. ఆత్మయందు అహంబుద్ధిని నిలుపు. యదార్థానికిక నీవు వీటి అన్నింటికి ద్రష్టవు. నీవు నిర్మలమైవాడవు. ద్వైతరహితమైన పరబ్రహ్మవు నీవే!

### ధ్యాన విధి

**లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేంద్రియం**
**స్వస్థానే వినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితిమ్**
**బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖండ వృత్త్యానిశం**
**బ్రహ్మానంద రసం పిబాత్మని ముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః. 379**

చిత్తాన్ని నీ లక్ష్యమైన బ్రహ్మమందు దృఢంగా స్థిరంగా ఉంచుకొని, ఇంద్రియాలను వాటి విషయాలనుండి మరలించి వాటి వాటి గోళకాల్లో–స్థానాల్లో స్థిరంగా ఉంచు, శరీరాన్ని నిశ్చలంగా ఉంచు. ఆ శరీరస్థితివైపు నీ ధ్యానాన్ని సోనీయకు. ఇట్లా, బ్రహ్మను ఆత్మను ఏకంచేసి, తన్మయ

భావంతో, అఖండవృత్తిలో, రాత్రింబవళ్ళు మనస్సులోనే ఆనందంతో బ్రహ్మానందరసాన్ని అనుభవించు. అనవసరమైన చప్పిడి మాటలు ఎందుకు? వాటివల్ల లాభం ఏమిటి?

**అనాత్మ చింతనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణం**
**చిన్తయాత్మాన మానందరూపం యన్ముక్తి కారణం.** 380

దుఃఖానికి కారణమైనట్టి, మోహరూపమైనట్టి, అనాత్మచింతనాన్ని వదలిపెట్టు. ఆనంద స్వరూపమైన ఆత్మను గూర్చిన చింతన చెయ్యి! అదే – ఆత్మచింతనమే సాక్షాత్తు ముక్తికి కారణం.

**ఏష స్వయంజ్యోతి రశేష సాక్షి విజ్ఞానకోశే విలసత్యజస్రం**
**లక్ష్యం విధాయైన మసద్విలక్షణ - మఖండ వృత్త్యాత్మతయాను భావయే.** 381

స్వయంప్రకాశము, అన్నింటికి సాక్షి, విజ్ఞానమయ కోశంలో విరాజమానుడై ఉండేవాడు, సమస్త అనిత్య పదార్థాలకంటె విలక్షణమైనవాడూ అయిన పరమాత్మనే నీ లక్ష్యంగా ఉంచుకొని, తైలధారలాగా అఖండ వృత్తితో, ఆత్మభావంతో చింతన చేయుము.

**ఏతమచ్ఛిన్నయా వృత్త్యా ప్రత్యయాన్తర శూన్యయా**
**ఉల్లేఖయ న్విజానీయాత్స్వస్వరూపతయా స్ఫుటం.** 382

అన్యప్రతీతు లేవీ లేకుండా, అఖండ వృత్తితో, ఈ ఒక్కనినే చింతనచేస్తూ యోగి అతనినే–పరమాత్మనే–తన స్వరూపంగా స్పష్టంగా తెలుసుకోవాలి.

**అత్రాత్మత్వం దృఢీకుర్వన్నహ మాదిషు సన్త్యజన్**
**ఉదాసీనతయా తేషు తిష్ఠేద్ఘట పటాదివత్.** 383

ఇట్లా పరమాత్మయందే ఆత్మభావాన్ని దృఢం చేసుకొంటూ, అహంకారాదుల్లో ఆత్మబుద్ధిని వదలివేస్తూ, ఆ అహంకార శరీరాదుల విషయంలో, ఘటపటాదుల విషయంలోలాగా ఉదాసీనుడవు కావాలి.

## ఆత్మ దృష్టి

**విశుద్ధమంతః కరణం స్వరూపే**
**నివేశ్య సాక్షిణ్యవబోధ మాత్రే**
**శనైః శనైర్నిశ్చలతాముపానయన్**
**పూర్ణం స్వమేవాను విలోకయేత్తతః.** 384

అన్నింటికి సాక్షియైనట్టి, జ్ఞానస్వరూపమైనట్టి ఆత్మయందు నీ విశుద్ధమైన చిత్తాన్ని నిలిపి, మెల్లమెల్లగా నిశ్చలత్వాన్ని పొందుతూ చివరకు అంతటా పూర్తిగా తననే చూడాలి.

**దేహేంద్రియ ప్రాణ మనోఽహమాదిభిః**
**స్వాజ్ఞాన క్లృప్తైరఖిలైరుపాధిభిః**
**విముక్తమాత్మాన మఖండరూపం**
**పూర్ణం మహాకాశ మివావలోకయేత్.** 385

నీ అజ్ఞానంవల్ల కల్పితమైన దేహము, ఇంద్రియాలు, ప్రాణము, మనస్సు, అహంకారం మొదలైన ఏ ఉపాధులూ లేనట్టి అఖండమైన ఆత్మను, మహాకాశంలాగా సర్వత్ర పరిపూర్ణంగా దర్శించాలి.

**ఘట కలశకుశూల సూచి ముఖ్యై -**
**ర్గగన ముపాధిశతైర్విముక్త మేకమ్**
**భవతి న వివిధం తథైవ శుద్ధం**
**పరమహహమాది విముక్త మేకమేవ.** 386

ఆకాశమనేది, ఘతము, కలశము, కుశూలము – ధాన్యపుకొట్టు – కఱ్ఱు, సూది మొదలైన వందల కొలది ఉపాధులు లేకుండా ఒక్కటిగానే ఉంటుంది. ఉపాధులు అనేకం ఉన్నందువల్ల అది (ఆకాశం) అనేకం కాదు, అట్లాగే అహంకారాదులైన ఉపాధులు లేనట్టి శుద్ధ పరమాత్మ ఒక్కటే!

**బ్రహ్మాది స్తంభ పర్యంతా మృషామాత్రా ఉపాధయః**
**తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్.** 387

బ్రహ్మ మొదలుకొని తృణపర్యంతం కనిపించే ఉపాధులన్నీ మిథ్య. అందుచేత నిన్ను నీవు సదా ఏకరూపంలో ఉండే పరిపూర్ణమైన ఆత్మ స్వరూపంలో దర్శించాలి.

**యత్ర భ్రాన్త్యా కల్పితం యద్వివేకే**
**తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్**
**భ్రాన్తేర్నాశే భ్రాన్తిదృష్టా హి తత్త్వం**
**రజ్జు స్తద్వద్విశ్వమాత్మ స్వరూపమ్.**

ఒక వస్తువునందు (ఒక ఆధారంలో) భ్రమవల్ల వేరొక వస్తువు కల్పింపబడినప్పుడు ఆ భ్రమకు ఆధారమైన వస్తువును గూర్చిన సరియైన జ్ఞానం కలగటంతోనే, ఆ కల్పితమైన వస్తువు తద్రూపంగానే–ఆదారమైన వస్తురూపంగానే, నిశ్చితమైపోయినందున – ఇక దాని ప్రత్యేక అస్తిత్వం అంటూ ఉండదు. భ్రాంతివల్ల త్రాటితో పామును కల్పించుకొన్నాం. ఆ భ్రాంతి తొలగిపోగానే పాము రూపం పోనేపోతుంది. ఇక మిగిలేది రజ్జువు రూపమే! అట్లాగే అజ్ఞానం నష్టమైపోగానే సమస్త విశ్వమూ ఆత్మ స్వరూపంగానే గోచరిస్తుంది.

**స్వయం బ్రహ్మ స్వయం విష్ణుః స్వయమిన్ద్రః స్వయం శివః**
**స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన.** 389

తానే స్వయంగా బ్రహ్మ. తానే విష్ణువు. తానే స్వయంగా ఇంద్రుడు, తానే శివుడు. ఈ సమస్త విశ్వమూ స్వయంగా తానే. తనకంటె భిన్నమైనదంటూ ఏదీ లేదు.

**అంతః స్వయం చాపి బహిః స్వయం చ**
**స్వయం పురస్తాత్స్వయమేవ పశ్చాత్**
**స్వయం హ్యవాచ్యాం స్వయమప్యుదీచ్యాం**
**తథో పరిష్టా త్స్వయమప్యధస్తాత్.** 390

లోపల ఉన్నదీ తానే, బయట ఉన్నదీ తానే, ముందున్నదీ తానే! వెనుక నున్నదీ తానే! ఎడమవైపుననున్నది, కుడివైపున ఉన్యనదీ కూడా తానే! పైన ఉన్నదీ క్రింద నున్నదీ కూడా తానే! ఆత్మయే!

**తరంగఫేన భ్రమ బుద్బుదాది**
**సర్వం స్వరూపేణ జలం యథా తథా**
**చిదేవ దేహాద్యహమన్త మేతత్**
**సర్వం చిదేవైకరసం విశుద్ధం.** 391

తరంగాలు, నురుగు, సుడిగుండాలు, బుడగలు మొదలైనవన్నీ స్వరూపంలో జలమే! అట్లాగే, దేహం మొదలుకొని అహంకారం పర్యంతం ఈ సమస్త విశ్వమూ అఖండ శుద్ధ చైతన్యమైన ఆత్మయే!

**సదేవేదం సర్వ జగదవగతం వాఙ్మనసయోః**
**సతోన్య న్నాస్త్యేవ ప్రకృతిపరసీమ్ని స్థితవతః**
**పృథక్ కిం మృత్స్నాయాః ప్రకృతిపరసీమ్ని స్థితవతః**
**వదత్యేష భ్రాన్త స్త్వమహమితి మాయా మిదిరయా.** 392

మనస్సు, వాక్కు ద్వారా ప్రతీతమయ్యే ఈ సమస్త జగత్తూ సత్స్వరూపమే! ప్రకృతికి అతీతమైనట్టి ఆత్మ స్వరూపంలో స్థితుడై ఉండే మహాత్ముని దృష్టిలో 'సత్' కు వేరుగా ఇంకేమీ ఉండదు. మట్టికి భిన్నంగా ఘటం, కలశం, కుంభం అనేవి ఎక్కడున్నాయి? మాయ అనే మదిరవల్ల ఉన్మత్తుడైనవాడే 'నేను, నీవు' అనే భేదబుద్ధితో కూడిన మాటలు మాట్లాడుతాడు.

క్రియా సమభిహారేణ యత్ర నాన్యదితి శ్రుతిః
బ్రవీతి ద్వైతరాహిత్యం మిథ్యాధ్యాస నివృత్తయే. 393

(ఛాందోగ్యోపనిషత్తు 7-14-1 లోని మంత్రాన్ని యిక్కడ ఉదహరించారు. " యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి, నాన్య ద్విజానాతి స భూమా" అని శ్రుతి వచనం)

కార్యరూపంలో ఉండే ద్వైతానికి ఉపసంహారం చెపుతూ "ద్రష్టయైనవాడు ఈ మహత్తత్త్వంలో ఇతరమైన దానిని దేనినీ చూడదు, వినదు, తెలుసుకోదు. తెలుసుకో దగినదేదీ ఉండదు" అంటూ, అద్వైతపరంగా శ్రుతి అధ్యాస నివృత్తికోసం మాటిమాటికీ ద్వైతాభావాన్ని చెపుతోంది.

**ఆకాశవ న్నిర్మల నిర్వికల్ప -**
**నిఃసీమ నిష్పన్దన నిర్వికారమ్**
**అంతర్బహిః శూన్యమనన్య మద్వయం**
**స్వయం పరంబ్రహ్మ కిమస్తి బోధ్యమ్.** 394

ఆకాశంలాగా నిర్మలము, నిర్వికల్పము, నిస్సీమము, నిశ్చలము, నిర్వకారము, బాహ్యాభ్యన్తర శూన్యము, అనన్యము, అద్వితీయము అయిన పరబ్రహ్మము జ్ఞానానికి విషయం అవుతాడా? కాదని భావం.

**వక్తవ్యం కిము విద్యతేత్ర బహుధా బ్రహ్మైవ జీవః స్వయం**
**బ్రహ్మైతజ్జగదాతతం ను సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః**
**బ్రహ్మైవాహమితి ప్రబుద్ధ మతయః సన్త్యక్త బాహ్యాః స్ఫుటం**
**బ్రహ్మీభూయ వసన్తి సన్తత చిదానన్దాత్మనైవ ధ్రువమ్.** 395

ఈ విషయమై అధికంగా చెప్పబలసింది ఏముంది? జీవుడు బ్రహ్మమే! బ్రహ్మమే ఈ విశ్వమంతటా వ్యాప్తమై ఉన్నాడు. శ్రుతి కూడా బ్రహ్మము అద్వితీయమని చెపుతోంది. 'నేను బ్రహ్మనే' అనే జ్ఞానం కలిగినవాడు బాహ్య విషయాలన్నింటిని పూర్తిగా వదలిపెట్టి, సదా సచ్చిదానంద స్వరూపంతోనే ఉంటాడనే విషయం నిశ్చయం.

**జహి మలమయకోశే-హంధియోత్థాపితాశాం**
**ప్రసభ మనిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్**
**నిగమగదితకీర్తిం నిత్యమానంద మూర్తిం**
**స్వయమితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ.** 396

ఈ మలమయకోశంలో (దేహంలో) అహంబుద్ధి వల్ల కలిగిన ఆసక్తిని వదలిపెట్టు. పిమ్మట వాయురూపమైన లింగ దేహంలో ఉన్న ఆసక్తిని కూడా గట్టిగా వదలిపెట్టు, ఏ ఆనందస్వరూపుని యొక్క కీర్తిని వేదాలు అన్నీ వర్ణిస్తున్నాయో అటువంటి బ్రహ్మను నీ స్వరూపంగానే తెలుసుకొని సదా బ్రహ్మరూపంలోనే స్థిరంగా ఉండు.

**శవాకారం యావద్భజతి మనుజస్తావద శుచిః**
**పరేభ్యః స్యాత్క్లేశో జనన మరణ వ్యాధి నిలయః**
**యదాత్మానం శుద్ధం కలయతి శివాకార మచలం**
**తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి.** **397**

మానవుడు శవంలాటి ఈ శరీరం మీద ఆసక్తి కలిగి ఉన్నంతవరకు మిక్కిలి అపవిత్రుడే! పైగా జన్మము, మరణము, వ్యాధులకు దానిని ఆశ్రయం చేసి, ఇతరులవల్ల కూడా దుఃఖాలను పొందాల్సి వస్తుంది అని శ్రుతి చెపుతోంది. అతడు తన కళ్యాణస్వరూపాన్ని, అచలము, శుద్ధము అయిన ఆత్మయొక్క సాక్షాత్కారాన్ని పొందినపుడు సమస్త క్లేశాల నుండి ముక్తుడౌతాడు.

## ప్రపంచ నిరోధం

**స్వాత్మన్యారో పితా శేషా భాస వస్తు నిరాసతః**
**స్వయమేవ పరం బ్రహ్మ పూర్ణమద్వయ మక్రియమ్.** **398**

తన ఆత్మయందు ఆరోపింపబడిన సమస్త కల్పిత వస్తుసముదాయాన్నీ దూరంగా త్రోసివేసినంతనే మానవుడు తాను స్వయంగా అద్వితీయము, అక్రియము, పూర్ణము అయిన బ్రహ్మమే అవుతాడు.

**సమాహి తాయాం సతి చిత్తవృత్తౌ**
**పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే**
**న దృశ్యతే కశ్చిదయం వికల్పః**
**ప్రజల్ప మాత్రః పరిశిష్యతే తతః** **399**

నిర్వికల్పుడైన పరమాత్మయందు చిత్తవృత్తి స్థిరమై పోయినప్పుడు ఈ దృశ్యవికల్పాలు కనిపించనే కనిపించవు. ఆ సమయంలో ఈ దృశ్యవికల్పాలు కనిపంచనే కనిపించవు. ఆ సమయంలో ఈ దృశ్యవికల్పాలు – నామరూపాదులు – వాచారంభణం (వట్టి మాటలే) మాత్రమే అవుతాయి.

**అసత్కల్పో వికల్పోఽయం విశ్వమిత్యేక వస్తుని**
**నిర్వికారే నిరాకారే నిర్వశేషే భిదా కుతః.** **400**

ఆ ఏకైక బ్రహ్మముందు ఈ ప్రపంచం మిథ్యా వస్తువులాగా కల్పనా మాత్రంగా ఉంది. నిర్వికారము, నిరాకారము, నిర్వశేషము అయిన వస్తువునందు భేదం ఎక్కడ నుండి వస్తుంది?

**ద్రష్టుదర్శనదృశ్యాదిభావశూన్యైకవస్తుని**
**నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః** **401**

ద్రష్ట, దృశ్యము, దర్శనము మొదలైన భావాలు లేనట్టి, శూన్యము, నిర్వికారము, నిరాకారము, నిర్విశేషము అయిన వస్తువునందు భేదం ఎక్కడ నుండి వస్తుంది?

**కల్పార్ణవ ఔవాత్యన్త పరిపూర్ణైక వస్తుని**
**నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదాకుతః. 402**

ప్రళయకాలమందలి సముద్రంలాగా అత్యంత పరిపూర్ణమైనట్టి పదార్థంలో నిర్వికారము, నిరాకారము, నిర్విశేషము అయిన వస్తువులో భేదం ఎక్కడ నుండి వస్తుంది?

**తేజసీవతమోయత్రప్రలీనం భ్రాన్తికారణం**
**అద్వితీయేపరే తత్త్వే నిర్విశేషే భిదాకుతః. 403**

ప్రకాశంలో అంధకారం లీనమైపోయినట్లుగా, దేని యందైతే భ్రమకు కారణమైన అజ్ఞానం లీనమైపోతుందో అటువంటి అద్వితీయము, నిర్విశేషము అయిన పరమాత్మ యందు భేదం ఎక్కడ నుండి వస్తుంది?

**ఏకాత్మకే పరేతత్త్వే భేదవార్తా కథం భవేత్**
**సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః. 404**

ఏకాత్మకము, అద్వితీయము అయిన పరమతత్త్వంలో భేద మనేది ఎట్లా ఉంటుంది? కేవలం సుఖస్వరూపమైన సుషుప్తిలో భిన్నత్వాన్ని ఎవరైనా చూచారా?

**నహ్యస్తివిశ్వం పరతత్త్వబోధాత్**
**సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే**
**కాలత్రయే నాప్యహిరీక్షితో గుణ**
**నహ్యమ్బుబిందుర్మృగతృష్ణికాయామ్. 405**

పరమతత్త్వాన్ని తెలుసుకొన్నమీదట సత్స్వరూపము, నిర్వికల్పము అయిన ఆ పరబ్రహ్మమందు ఈ విశ్వంయొక్క జాడ ఏ మాత్రమూ ఉండదు. మూడు కాలాల్లోనూ, ఎవరైనా త్రాటిలో పామును, ఎండమావుల్లో నీటి బిందువులను చూచారా? అది వట్టి భ్రమ మాత్రమే గదా! అట్లాగే ఈ విశ్వమూను!

**మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః**
**ఇతిబ్రూతేశ్రుతిః సాక్షాత్సుషుప్తావనుభూయతే. 406**

ఈ ద్వైతమనేది కేవలం మాయ అనీ, వాస్తవానికి ఉన్నదేదో అద్వైతమనీ, మనకు సుషుప్తిలో ఆ విధమైన అనుభవమే కలుగుతోందనీ శ్రుతి చెపుతోంది.

**అనన్యత్వమధిష్ఠానాదారోప్యస్య నిరీక్షితం**

**పండితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాన్తిజీవనః. 407**

బుద్ధిమంతులైనవారు రజ్జు సర్పాదుల్లో అధ్యస్త వస్తువుకు అధిష్ఠానానికి భేదం లేకపోవటాన్ని స్పష్టంగా చూచారు. అందుచేత బ్రహ్మమందు అధ్యస్తమైన ఈ సంసారమనే వికల్పం, అజ్ఞానంవల్ల కలిగిన భ్రమ కారణంగానే నిలిచిఉంది.

## ఆత్మచింతన పద్ధతి

**చిత్తమూలో వికల్పోయం చిత్తాభావే న కశ్చన**

**అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని. 408**

ఈ వికల్ప మనేది చిత్తమూలకం – చిత్తంవల్ల కలిగింది. చిత్తం లేకుండాపోయినప్పుడు ఈ వికల్పం నామమాత్రానికి కూడా ఉండదు. అందుచేత చిత్తాన్ని లోపల ఉన్న చైతన్య స్వరూపమైన ఆత్మలో స్థిరం చేయుము.

**కిమపి సతతబోధం కేవలానందరూపం**

**నిరుపమమతివేలం నిత్యముక్తం నరీహం**

**నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం**

**హృది కలయతి విద్వాన్బ్రహ్మ పూర్ణం సమాధౌ. 409**

నిత్యజ్ఞానస్వరూపము, కేవలానందరూపము, నిరుపమానము, కాలాలకు అతీతమైనట్టి, నిత్యముక్తము, నిశ్చేష్టము, ఆకాశంలాగా నిస్సీమము (అంతులేనిది) కలారహితము, నిర్వికల్పము అయిన పూర్ణబ్రహ్మకు సంబంధించిన అనుభవాన్ని విద్వాంసులు, సమాధి స్థితిలో తమ అంతః కరణంలో సాక్షాత్తు పొందుతారు – అపరోక్షరూపంలో సాక్షాత్కారాన్ని పొందుతారు.

**ప్రకృతి వికృతి శూన్యం భావనాతీతభావం**

**సమరసమసమానం మానసబంధదూరమ్**

**నిగమవచనసిద్ధం నిత్యమస్మాత్ప్రసిద్ధం**

**హృది కలయతి విద్వాన్బ్రహ్మ పూర్ణ సమాధౌ. 410**

కార్యకారణరహితము, మానవభావాలకు అందనట్టిది, వేదవాక్యాలవల్ల సిద్ధించేదీ నిత్యము, అస్మద్రూపంలో (నేను అనే రూపంలో) ఉండే పూర్ణ బ్రహ్మను విద్యాంసులు సమాధి స్థితిలో తమ అంతరంగంలోనే అనుభవిస్తారు – బ్రహ్మానుభవాన్ని పొందుతారు.

**అజరమమరమస్తాభాసవస్తువ్యరూపం**

**స్తిమిత సలిలరాశి ప్రఖ్యమాఖ్యావిహీనం**

శమితగుణవికారం శాశ్వతం శాన్తిమేకం
హృది కలయతి విద్వాన్బ్రహ్మ పూర్ణం సమాధౌ. 411

అజరము, అమరము, అభాసశూన్యము, వస్తుస్వరూపము, నిశ్చలము, సముద్రంలాంటిది, నామరూపాలు లేనిది, గుణవికారాది శూన్యము, నిత్యము, శాంతస్వరూపము, అద్వితీయము అయిన పూర్ణబ్రహ్మసాక్షాత్కారాన్ని విద్వాంసులైనవారు సమాధిలో తమ హృదయంలోనే పొందుతారు.

సమాహితాన్తఃకరణః స్వరూపే
విలోక యాత్మాన మఖండ వైభవమ్
విచ్ఛిన్ధి బన్ధం భవగంధగంధితం
యత్నేన పుంస్త్వం సఫలకురుష్వ. 412

నిజ స్వరూపంలో చిత్తాన్ని స్థిరం చేసుకొని, అఖండైశ్వర్య సంపన్నమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొందు, సంసారవాసనలతో కూడిన బంధనాన్ని తెంపివెయ్యి, ప్రయత్నంతో నీ మానవజన్మను సఫలీకృతం చేసుకో!

సర్వోపాధి వినిర్ముక్తం సచ్చిదానందమద్వయమ్
భావయాత్మనమాత్మస్థం న భూయః కల్పసేఽధ్వనే. 413

ఏ విధమైన ఉపాధులూ లేనట్టి, అద్వితీయ సచ్చిదానందస్వరూపంతో నీ అంతఃకరణంలో ఉన్నట్టి ఆత్మను గూర్చిన చింతన చేస్తూ ఉండు. ఇట్లా చేస్తే నీవు మళ్ళీ ఈ సంసార చక్రంలో చిక్కుకోవు.

## దృశ్యాన్ని ఉపేక్షించటం

ఛాయేవ పుంసః పరిదృశ్యమాన -
మాభాసరూపేణ ఫలానుభూత్యా
శరీరమారాచ్ఛవవన్నిరస్తం
పునర్న సంధత్త ఇదం మహాత్మా. 414

మానవుని నీడలాగా కేవలం అభాసరూపమై కనిపించే ఈ శరీరాన్ని దీని పరిణామ ఫలాన్ని ఆలోచించి శవంలాగా దీనిని విసర్జించివేసి, మహాత్ములైనవారు ఇక దానిని (శరీరాన్ని) స్వీకరించరు.

సతతవిమలబోధానన్దరూపం సమేత్య
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే

**అథపునరపినైష స్మర్యతాం వాన్తవస్తు**

**స్మరణవిషయభూతం కల్పతే కుత్సనాయ.** 415

నీ నిర్మలమైన చిదానందమయ స్వరూపాన్ని పొంది, ఇక ఈ మల – భూయిష్టమైన ఉపాధిని దూరంగానే వదలి వేయుము! ఇక ఎన్నడూ దానిని గుర్తుచేసుకోవద్దు. వాంతి అయిన వస్తువును మళ్ళీ జ్ఞాపకం చేసుకోవటంవల్ల మళ్ళీ మనస్సును పాడుచేసేదే అవుతుంది.

**సమూలమేతత్పరిదహ్య వహ్నౌ**

**సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే**

**తతః స్వయం నిత్యవిశుద్ధబోధా**

**నన్ధాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః.** 416

విద్వాంసులలో శ్రేష్ఠులైనవారు ఈ స్థూలజగత్తునూ, సూక్ష్మజగత్తునూ వాటికి మూలమైన మాయతో సహా నిర్వికల్పస్వరూపమైన బ్రహ్మమనే అగ్నిలో భస్మం చేసి, తాము నిత్యము విశుద్ధము అయిన బోధానంద స్వరూపంలో నిలిచి ఉంటారు.

**ప్రారబ్ధసూత్రగ్రథితం శరీరం**

**ప్రాయతు వా తిష్ఠతు గోరివస్రక్**

**న తత్పునః పశ్యతి తత్త్వవేత్తా -**

**నందాత్మని బ్రహ్మణి లీనవృత్తిః.** 417

గోవు తన మెడలో వేయబడిన మాలను, ఉండటాన్ని పడిపోవటాన్నీ ఏ మాత్రం గమనించనట్లుగా (దానిని గురించి ధ్యానమే ఆవుకు ఉండనట్లుగా) ప్రారబ్ధమనే త్రాటితో పేనబడిన ఈ శరీరం ఉండవచ్చు, లేదా పోవచ్చు! ఈ విషయాన్ని తన చిత్తవృత్తి ఆనందస్వరూపమైన బ్రహ్మంలో లీనమైయున్న తత్త్వవేత్త (ఈ శరీరం విషయాన్ని) తలచడు.

**ఆఖండానందమాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః**

**కిమిచ్ఛన్ కస్య వా హేతోర్దేహం పుష్ణాతి తత్త్వవిత్.** 418

అఖండానంద స్వరూపమైన ఆత్మను తన స్వరూపంగా గుర్తించిన తత్త్వవేత్త ఇక ఏ కోరికతో, ఏ కారణంగా ఈ శరీరాన్ని పోషిస్తాడు! శరీరపోషణ విషయమైన శ్రద్ధ, కోరిక అతనికి ఉండవని భావం.

## ఆత్మజ్ఞాన ఫలం

సంసిద్ధస్య ఫలం త్వేతజ్జీవన్ముక్తస్య యోగినః

బహిరన్తః సదానన్దరసాస్వాద న మాత్మని. 419

ఆత్మజ్ఞానంతో సిద్ధిని పొందిన జీవన్ముక్తుడైన యోగికి తన ఆత్మ, బాహ్యాభ్యన్తరాల్లో నిరంతరం నిత్యానంద రసాన్ని ఆస్వాదిస్తూ ఉండటమే (అతని ఆత్మజ్ఞానసిద్ధికి) ఫలం.

**వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలం**
**స్వానందానుభవాచ్ఛాన్తిరేషైవోపరతేః ఫలం. 420**

వైరాగ్యానికి ఫలం జ్ఞానం. జ్ఞానానికి ఫలం ఉపరతి, (విషయాల యెడల ఔదాసీన్యం) ఉపరతికి ఫలం ఆత్మానందానుభవం వల్ల చిత్తం శాంతమవటం.

**యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వం తు నిష్ఫలం**
**నివృత్తిః పరమా తృప్తిరానన్దో-నుపమః స్వతః. 421**

పైన చెప్పినవాటిల్లో రెండవది లభించనప్పుడు మొదటిది నిష్ఫలం, అంటే జ్ఞానం లభించని వైరాగ్యం, ఉపరతి లేని జ్ఞానం, ఆత్మానుభవం లేని ఉపరతి నిష్ఫలం అని భావం. విషయాల నుండి నివృత్తిని పొందటమే పరమ తృప్తి అదే సాక్షాత్తు అనుపమానందం.

**దృష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాః ప్రస్తుతం ఫలం**
**యత్కృతం భ్రాన్తివేలాయాం నానాకర్మజుగుప్సితం**
**పశ్చాన్నరో వివేకేన తత్కథం కర్తుమర్హతి. 422**

ప్రారబ్ధవశాన లభించిన దుఃఖాలవల్ల విచలితుడు కాకుండా ఉండటమే (చలించక పోవటమే) ఆత్మజ్ఞానానికి అన్నింటికంటె మొదటి ఫలం, భ్రాంతి సమయంలో మానవుడు ఏఏ నింద్యకర్మలు చేశాడో, వాటినే జ్ఞానం వివేకం కలిగిన పిమ్మట కూడా ఎట్లా చేయగలుగుతాడు?

**విద్యాఫలం స్యాదసతో నివృత్తిః**
**ప్రవృత్తిరజ్ఞానఫలం తదీక్షితం**
**తజ్జ్ఞాజ్ఞయోర్య న్మృగ తృష్ణి కాదౌ**
**నోచేద్విదో దృష్టిఫలం కిమస్మాత్. 423**

అసత్ నుండి నివృత్తమవటం విద్యకు ఫలం, అసత్తునందు ప్రవృత్తమవటం అవిద్యకు ఫలం. ఈ రెండు ఫలాలూ జ్ఞానియైనవాడూ అజ్ఞానియైనవాడూ మృగతృష్ణాదుల ప్రతీతిలో దానిని తెలుసుకోవటం, తెలుసుకోలేకపోవటంలోనూ గుర్తింపబడతారు, అంటే జ్ఞాని మృగతృష్ణను తెలుసుకో గలుగుతాడు. అజ్ఞాని తెలుసుకోలేడు. అట్లా కాకుండా విద్వాంసుడు సైతం ఇది అసత్పదార్థమని గుర్తించలేకపోతే విద్యయొక్క ప్రయోజనం ఏముంటుంది?

**అజ్ఞాన హృదయగ్రన్థేర్వినాశో యద్యశేషతః**
**అనిచ్ఛోర్విషయః కిన్ను ప్రవృత్తేః కారణం స్వతః. 424**

అజ్ఞానరూపమైన హృదయగ్రంథి పూర్తిగా నాశనమై పోయినట్టి, ఏ కోరికలూ లేనివానికి, ఈ సాంసారిక విషయాలు, వాటంతట అవే ప్రవృత్తికి కారణాలౌతాయా? కావు; అని భావం.

**వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య పరోఽవధిః**
**అహంభావోదయాభావో బోధస్య పరమోఽవధిః**
**లీనవృత్తేరనుత్పత్తి ర్మర్యాదోపరతేస్తు సా.** 425

భోగ్యవస్తువుల్లో వాసన ఉదయించకపోవటం అనేది వైరాగ్యానికి చివరి హద్దు. అట్లాగే, అహంకారం అనేది ఏ మాత్రమూ ఉదయించకపోవటమే జ్ఞానానికి చివరి హద్దు, లీనమైపోయిన చిత్తవృత్తులు మళ్ళీ పుట్టకుండా ఉండటమే ఉపరతికి చివరి హద్దు.

## జీవన్ముక్తుని లక్షణం

**బ్రహ్మాకారతయా సదా స్థితతయా నిర్ముక్తబాహ్యార్థధీ -**
**రన్యావేదితభోగ్యభోగకలనో నిద్రాలువద్బాలవత్**
**స్వప్నాలోకితలోకవజ్జగదిదం పశ్యన్క్వచిల్లబ్ధధీ -**
**రాస్తే కశ్చిదనన్తపుణ్యఫలభుగ్ధన్యః స మన్యో భువి.** 426

నిరంతరం బ్రహ్మాకార వృత్తిలో స్థిరంగా ఉండటంవల్ల బాహ్య విషయాల నుండి విముక్తిని పొందిన బుద్ధి కలవాడు నిద్రాళునితో లేదా బాలకునితో సమానంగా ఇతరులు నివేదించిన భోగపదార్థాల్ని సేవిస్తాడు. ఎప్పుడైనా విషయాల మీదకు బుద్ధి పోయినా, ఈ ప్రపంచాన్ని స్వప్న ప్రపంచంలాగా చూస్తూ, అనంతమైన పుణ్యఫలాన్ని అనుభవించే జ్ఞానియైన మహాత్ముడు ఈ భువి యందు ధన్యుడు అట్టివాడు అందరికీ మాననీయుడు.

**స్థితప్రజ్ఞో యతిరయం యః సదానన్దమశ్నుతే**
**బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః.** 427

పరబ్రహ్మమందే చిత్తాన్ని లీనం చేసి, వికారాలను క్రియలను త్యజించి, ఎల్లప్పుడూ ఆనంద స్వరూపమైన బ్రహ్మయందు మగ్నుడై ఉండే వానిని స్థితప్రజ్ఞుడు అంటారు.

**బ్రహ్మాత్మనోః శోధితయోరేకభావావగాహినీ**
**నిర్వికల్పా చ చిన్మాత్రావృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే**
**సుస్థితా సా భవేద్యస్య జీవన్ముక్తః స ఉచ్యతే.** 428

'తత్త్వమసి' మొదలైన మహావాక్యాల ద్వారా శోధితమైన – పరిశీలింపబడిన – బ్రహ్మాత్మైకత్వాన్ని గ్రహించేటటువంటి, వికల్పశూన్యమైనట్టి చిన్మాత్ర వృత్తిని 'ప్రజ్ఞ' అంటారు ఈ చిన్మాత్ర వృత్తి (ప్రజ్ఞ) స్థిరపడిన వానినే జీవన్ముక్తుడు అంటారు.

**యస్య స్థితా భవేత్ప్రజ్ఞా యస్యానన్దో నిరంతరః**
**ప్రపంచో విస్మృతప్రాయః స జీవన్ముక్త ఇష్యతే. 429**

ఎవని ప్రజ్ఞ – వికల్ప శూన్యమైన చిన్మాత్ర వృత్తి – స్థిరంగా ఉంటుందో, ఎవడు నిరంతరం ఆత్మానందాన్ని అనుభవిస్తూ ఉంటాడో, ప్రపంచాన్ని మరచిపోయిన వానిలాగా ఉంటాడో అటువంటి వానిని జీవన్ముక్తుడు అంటారు.

**లీనధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మవర్జితః**
**బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే. 430**

చిత్తవృత్తి లీనమైపోయినప్పటికి ఎవడు మేల్కొనే ఉంటాడో, మేల్కొని ఉన్నప్పటికి ఎవడు జాగృతి ధర్మాలు లేనివాడై ఉంటాడో, ఎవని జ్ఞానం పూర్తిగా వాసనా శూన్యమై ఉంటుందో అటువంటివానిని జీవన్ముక్తుడంటారు. "వృత్తి లీనమైపోయినా మేల్కొని ఉండటం" అంటే, అతని చిత్తం సమస్తదృశ్య పదార్థాలను త్రోసివేసి నిరంతరం బ్రహ్మమందే లీనమై ఉన్నప్పటికీ, నిద్రపోతున్న వానిలాగా సంజ్ఞాశూన్యుడై ఉండడు. అన్ని వ్యవహారాలూ మాములుగానే చేస్తూనే ఉంటాడు. వ్యవహారాలూ చేస్తూ ఉన్నా, వాటిని స్వప్నంలోలాగా భావించటంవల్ల, ఇతరులకు లాగా అతనికి ఆ దృశ్యపదార్థాల్లో ఆస్థ ఉండదు–ఆసక్తి ఉండదు. అందుచేత అతడు యదార్థానికి జాగృతది ధర్మ రహితుడూ ఉంటాడు; అని భావం.

**శాంత సంసారకలనః కలావానపి నిష్కలః**
**యః సచిత్తోఽపి నిశ్చిన్తః, స జీవన్ముక్త ఇష్యతే. 431**

సంసారవాసన శాంతించినవాడూ, కళలు కలవాడైనప్పటికి కళలు లేనివాడు విభాగములు కలవాడైనా విభాగ రహితుడు, వ్యావహారిక దృష్టితో పైకి వికారములు కలవాడుగా కనిపించినా, నిరంతరం తన నిర్వికార రూపంతోనే స్థితుడై ఉండేవాడూ, చిత్తం కలిగిఉన్నా నిశ్చితంగా ఉండేవాడూ. ఇటువంటి వానిని జీవన్ముక్తుడంటారు.

**వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయావదనువర్తిని**
**అహంతా మమతాభావో జీవన్ముక్తస్య లక్షణమ్. 432**

ప్రారబ్ధం పరిసమాప్తి చెందేవరకూ, నీడలాగా ఎల్లప్పుడూ వెంటనంటి ఉండే ఈ శరీర మనేది ఉన్నప్పటికీ, ఈ శరీరంలో అహం మమభావం (నేను నాది అనే భావం) లేకుండా పోవడం జీవన్ముక్తుని లక్షణం.

**అతీతాననుసంధానం భవిష్యదవిచారణమ్**
**ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణమ్. 433**

జరిగిపోయిన వాటిని జ్ఞాపకం చేసుకోకపోవటం, భవిష్యత్తును గూర్చిన చింత లేకపోవటం, వర్తమానంలో లభించిన సుఖదుఃఖాదులందు ఉదాసీన భావం, ఇవి జీవన్ముక్తుని లక్షణాలు.

**గుణదోషవిశిష్టేఽస్మిన్ స్వభావే న విలక్షణే**
**సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్.** 434

తన ఆత్మస్వరూపంకంటె సర్వథా వేరుగా ఉండే, ఈ గుణదోషాలతో కూడిఉన్న, ప్రపంచంలో, అంతటా సమదర్శిగా ఉండటమే జీవన్ముక్తుని లక్షణం.

**ఇష్టానిష్టార్థ సంప్రాప్తౌ సమదర్శితయాత్మని**
**ఉభయత్రావికారిత్వం జీవన్ముక్తస్య లక్షణం.** 435

ఇష్టమైనట్టి, అనిష్టమైనట్టి వస్తువులు లభించటంలో సమాన భావాన్ని కలిగిఉండటం కారణంగా, రెండు పరిస్థితుల్లోనూ చిత్తంలో ఏవిధమైన వికారమూ కలుగకపోవటం జీవన్ముక్తుడైనవాని లక్షనం.

**బ్రహ్మానంద రసాస్వాదా సక్తచిత్తతయా యతేః**
**అన్తర్బహిరవిజ్ఞానం జీవన్ముక్తస్య లక్షణమ్.** 436

చిత్తంలో బ్రహ్మానంద రసాస్వాదనాసక్తి ఉన్న కారణంగా, బాహ్య అన్తరకి వస్తువులకు సంబంధించిన జ్ఞానం లేకపోవటం జీవన్ముక్తుని లక్షణం.

**దేహేన్ద్రియాదౌ కర్తవ్యే మమాహంభావవర్జితః**
**ఔదాసీన్యేన యస్తిష్ఠేత్స జీవన్ముక్త లక్షణః.** 437

దేహము, ఇంద్రియాలు మొదలైనవాటిల్లోను, కర్తవ్యంలోను, మమకారం అహంకారం లేకుండా ఉదాసీనుడై ఉన్నవాటే జీవన్ముక్త లక్షణంతో కూడినవాడన్నమాట.

**విజ్ఞాత ఆత్మనో యస్య బ్రహ్మభావః శ్రుతేర్బలాత్**
**భవబన్ధవినుర్ముక్తః జీవన్ముక్త లక్షణః.** 438

శ్రుతి ప్రమాణాల ద్వారా తన ఆత్మయొక్క బ్రహ్మత్వాన్ని తెలసుకొనినవాడు, సంసార బంధనాలు లేనివాడు, జీవన్ముక్త లక్షణాలతో కూడినవాడు.

**దేహేంద్రియేష్వహంభావ ఇదంభావస్తదన్యకే**
**యస్య నో భక్తః క్వాపి స జీవన్ముక్త ఇష్యతే.** 439

ఎవనికి, దేహం, ఇంద్రియాలు మొదలైనవాటి యందు అహంభావంగాని, అన్యవస్తువుల యెడల ఇదం భావంగానీ (ఇది అనే భావం) ఎన్నడూ ఉండదో అట్టివాడే జీవన్ముక్తుడనబడతాడు.

**న ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపి బ్రహ్మసర్గయోః**
**ప్రజ్ఞాయా యో విజానాతి స జీవన్ముక్త ఇష్యతే. 440**

ఎవడు, తన తత్త్వావగాహినియైన బుద్ధి ద్వారా ఆత్మకు బ్రహ్మకు, బ్రహ్మకు జగత్తుకూ, ఎటువంటి భేదమూ చూడడో అట్టివాడే జీవన్ముక్తుడుగా తలచబడతాడు.

**సాధుభిః పూజ్యమానేఽస్మిన్పీడ్యమానేఽపి దుర్జనైః**
**సమభావో భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే. 441**

మంచివారిచేత ఈ శరీరం పూజింపబడినప్పుడుగాని, దుర్జనులచేత పీడింపబడినప్పుడుగాని, ఎల్లప్పుడూ అన్ని పరిస్థితుల్లోనూ ఎవని చిత్తం సమాన భావంతో ఉంటుందో అతడే జీవన్ముక్తుడుగా తలచబడతాడు.

**యత్ర ప్రవిష్టా విషయాః పరేరితా**
**నదీప్రవాహా ఇవ వారిరాశౌ**
**లినన్తి సన్మాత్రతయా న విక్రియా -**
**ముత్పాదన్త్యేవ యతిర్విముక్తః. 442**

సముద్రంలో కలియటంతోనే నదీప్రవాహం సముద్రము అయిపోయినట్లుగా ఇతరుల ద్వారా ఇవ్వబడే విషయాలు ఆత్మస్వరూపంగా ప్రతీతమవటంవల్ల ఎవని చిత్తంలో ఏవిధమైన క్షోభ పుట్టదో, అట్టి యతిశ్రేష్ఠుడే జీవన్ముక్తుడు.

**విజ్ఞాత బ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః**
**అస్తి చేన్న స విజ్ఞాత బ్రహ్మభావో బహిర్ముఖః. 443**

బ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకొన్న తరువాత విద్వాంసునికి వెనుకటిలాగా సంసారం మీద అస్త–అపేక్ష–ఉండదు. సంసారం మీద అపేక్ష ఇంకా మిగిలి ఉంటే అట్టి వానిని 'సంసారి' అనే అనుకోవాలి. అతనికి బ్రహ్మతత్త్వ జ్ఞానం కలగలేదన్న మాట.

**ప్రాచీనవాసనావేగాదసౌ సంసరతీతి చేత్**
**న సదేకత్వ విజ్ఞానా న్మన్దీభవతి వాసనా. 444**

పూర్వ వాసనా ప్రాబల్యంవల్ల, బ్రహ్మతత్త్వవేత్త అయిన జీవన్ముక్తునికి, మళ్ళీ సంసారంలో ప్రవృత్తి కలగవచ్చుగదా! అంటే, అట్లా జరిగే అవకాశం లేదు. ఎందుచేతనంటే, బ్రహ్మాత్మైక జ్ఞానంవల్ల అతని వాసన క్షీణమైపోయింది. కాబట్టి.

**అత్యంత కాముకస్యాపి వృత్తిః కుంఠతి మాతరి**
**తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః. 445**

ఎంతో కాముకుడైనవాని కామ ప్రవృత్తి కూడా తల్లిని చూచినప్పుడు కుంఠితమైపోతుంది. అట్లాగే, పూర్ణానంద స్వరూపమైన బ్రహ్మాన్ని తెలుసుకోగానే విద్వాంసునికి సంసార ప్రవృత్తి ఇక కలగదు.

## ప్రారబ్ధ విచారణ

నిదిధ్యాసన శీలస్య బాహ్యప్రత్యయ ఈక్ష్యతే
బ్రవీతి శ్రుతిరేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్. 446

నిదిధ్యాసనశీలుడైన వానికి (ఆత్మచింతనలో నిమగ్నమైన వానికి) బాహ్య పదార్థ ప్రతీతికలగటం చూస్తున్నాం. ఫలభోగం కనిపించటంవల్ల దానికి కారణం ప్రారబ్ధం అని శ్రుతి చెపుతోంది.

సుఖాద్యనుభవో యావత్తావత్ప్రారబ్ధ మిష్యతే
ఫలోదయః క్రియాపూర్వో నిష్క్రియో న హి కుత్రచిత్. 447

యుక్తితో సైతం, సుఖదుఃఖాదుల అనుభవం ఉన్నంత వరకు ప్రారబ్ధాన్ని అంగీకరించాలి. ఎందుచేతనంటే, ఫలభోగ మనేది క్రియాపూర్వకంగా ఉంటుంది. కర్మ లేకుండా ఫలభోగం ఉండదు.

అహం బ్రహ్మేతి విజ్ఞానాత్కల్పకోటి శతార్జితం
సంచితం విలయం యాతి ప్రబోధా త్స్వప్నకర్మవత్. 448

మేలుకోవటంతోనే స్వప్నావస్థలోని పనులన్నీ లీనమైపోయినట్లుగా 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మను అనే జ్ఞానం కలగటంతోనే కోట్లకొలది యుగాలలో సంచితమైన కర్మ యావత్తూ నశించిపోతుంది.

స్వమసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభోయథా
నశ్లిష్యతే యతిః కించిత్కదాచిద్భావి కర్మభిః. 449

తాను ఆకాశంలాగా అసంగుడినని, ఉదాసీనుడనని తెలుసుకొన్న యతి, భవిష్యత్కర్మలతో ఎన్నడూ ఏ మాత్రమూ లిపుదు కాజాలదు. అట్టి యతిని ఆగామి కర్మలు అంటవు అని భావం.

న నభో ఘటయోగేన సురాగన్ధేన లిప్యతే
తథాత్మోపాధియోగేన తద్ధర్మైర్నైవ లిప్యతే. 450

కుండయొక్క సంబంధంవల్ల కుండలో ఉన్నటి కల్లు వాసనతో ఆకాశానికి ఏమీ సంబంధం ఉండనట్లుగా, ఉపాధి సంబంధంతో, ఆత్మ ఉపాధికి ఉండే ధార్మలతో లిప్తం కాదు.

**జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి**
**అదత్వా స్వఫలం లక్ష ముద్దిశ్యోత్సృష్టబాణవత్.** 451

**వ్యాఘ్ర బుద్ధ్యా వినుర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ**
**నతిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్.** 452

లక్ష్యం వైపుకు వేగంగా వదలిపెట్టబడిన బాణంలాగా, జ్ఞానోదయానికి పూర్వమే ఆరంభమైన కర్మం (ప్రారబ్ధం) తన ఫలాన్ని యివ్వకుండా జ్ఞానంవల్ల నష్టంకాదు. ఎట్లాగంటే, పెద్దపులి అనుకొని విడువబడిన బాణం, ఆ పిమ్మట పెద్దపులికాదు, అది ఆవు అని తెలిసినప్పటికీ దానిని (ఆ బాణాన్ని) మధ్యలో ఆపటం సాధ్యంకాదు. అది తన లక్ష్యాన్ని చేధించనే ఛేదిస్తుంది. అట్లాగే ప్రారబ్ధ కర్మమూను!

**ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః**
**సమ్యక్జ్ఞాన హుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినాం**

**బ్రహ్మాత్మైక్య మవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా -**
**స్తేషాం తత్త్రితయం న హి కవ్చిదపి బ్రహ్మైవ తే నిర్గుణం.** 453

విద్యాంసునిదైనా ప్రారబ్ధ కర్మం చాలా బలవత్తరమైనది. అది అనుభవించినందువల్ల మాత్రమే క్షయమౌతుంది. ప్రారబ్ధకర్మ మినహా, పూర్వ సంచిత కర్మలు, అగామి కర్మలు తత్త్వజ్ఞానం అనే అగ్నిలో క్షయమౌతాయి. కాని, బ్రహ్మ ఆత్మల ఏకత్వాన్ని గూర్చిన జ్ఞానాన్ని పొంది, ఆ భావంలోనే స్థితుడై ఉండేవాని దృష్టిలో, ప్రారబ్ధ, సంచిత, ఆగామి కర్మలంటూ మూడు రకాల కర్మలు ఉండనే ఉండవు – అతడు సాక్షాత్తు నిర్గునబ్రహ్మమే కాబట్టి!

**ఉపాధి తాదాత్మ్య విహీనకేవల -**
**బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో మునేః**
**ప్రారబ్ధ సద్భావకథా న యుక్తా**
**స్వప్నార్థ సంబంధకథేవ జాగ్రతః** 454

ఉపాధి సంబంధాన్ని పూర్తిగా వదలివేసి, కేవలం బ్రహ్మాత్మ భావంతోనే తన స్వరూపంలో స్థితుడై ఉండే మునిశ్రేష్ఠునితో అతని ప్రారబ్ధ కర్మలకు సంబంధించిన విషయం చెప్పటం, స్వప్నంలో చూచిన విషయాలతోడి మేల్కొన్నవానికి ఉండే సంబంధాన్ని చెప్పటం లాగా ఉంటుంది. అట్లా చెప్పటం యుక్తం కాదు.

**న హి ప్రబుద్ధః ప్రతిభాసదేహే**
**దేహోపయోగిన్యపి చ ప్రపంచే**

కరోత్యహన్తాం మమతామిదన్తాం
కింతు స్వయం తిష్ఠతి జాగరేణ. 455

మేల్కొన్నవాడు, స్వప్నంలోని తన ప్రాతిభాసిక దేహాన్ని, ఆ దేహానికి ఉపయోగపడిన స్వప్న ప్రపంచంలోని అహంత, మమత, ఇదంతలను (నేను, నాది, ఇది అనే వాటిని) చూపడు, అతడు కేవలం జాగ్రద్భావంతోనే ఉంటాడు.

న తస్య మిథ్యార్థ సమర్థ నేచ్ఛా
న సంగ్రహస్తజ్జగతోఽపిదృష్టః
తత్రానువృత్తి ర్యది చేన్మృషార్థే
న నిద్రయా ముక్త ఇతీష్యతే ధ్రువమ్. 456

ఆ మేల్కొన్నవనికి స్వప్నంలోని మిథ్యా వస్తువుల్ని సమర్థించి రుజువు చేయాలనే కోరిక ఉండదు. అతని వద్ద ఆ పదార్థాలలో కనిపించవు. ఒకవేళ, ఇంకా అతనికి ఆ మిథ్యా పదార్థాలలో ప్రవృత్తి ఉంటే, అతని నిద్ర పూర్తి కాలేదని మనం నిశ్చయంగా చెప్పవచ్చు.

తద్వత్పరే బ్రహ్మణి వర్తమానః
సదాత్మనా తిష్ఠతి నాన్యదీక్షత్
స్మృతిర్యథా విధః ప్రాశనమోచనాదౌ.
తథా విదః ప్రాశనమోచనాదౌ. 457

సదా బ్రహ్మభావంలో ఉండేవాడు బ్రహ్మరూపంలోనే ఉంటాడు. అతడు బ్రహ్మాన్ని తప్ప దేనినీ చేడడు. స్వప్నంలో చూచిన పదార్థాలు జ్ఞాపకం వచ్చినట్లుగా, ఆ విద్వాంసుడైనవానికి భోజన విసర్జనాదికాలు స్వభావ సిద్ధంగానే జరిగిపోతూ ఉంటాయి.

కర్మణా నిర్మితో దేహః ప్రారబ్ధం తస్య కల్ప్యతామ్
నానాదేవాత్మకో యుక్తం నైవాత్మా కర్మ నిర్మితః. 458

దేహం అనేది కర్మ నిర్మితమైనది. కాబట్టి, ప్రారబ్ధం కూడా దానిదే అని గ్రహించాలి. ప్రారబ్ధమనేది అనాదియైనట్టి ఆత్మది అని అనుకోవటం తప్పు. ఎందుచేతనంటే, ఆత్మ అనేది కర్మలచేత నిర్మితమైనది కాదు.

అజోనిత్య ఇతి బ్రూతే శ్రుతిరేషా త్వమోఘవాక్
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా. 459

'ఆత్మ అనేది పుట్టుక లేనిది, నిత్యమైనది, అనాదియైనది' అని సత్యవాక్కు కలిగిన శ్రుతి చెపుతోంది. అటువంటి ఆత్మ స్వరూపంలో సదా స్థితుడై ఉండే విద్వాంసునికి ప్రారబ్ధకర్మ యింకా మిగిలిఉన్నదని ఎట్లా అనుకోగలుగుతాము.

**ప్రారబ్ధం సిధ్యతి తదా యదా దేహాత్మనా స్థితిః**
**దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతామతః.** 460

దేహంలో ఆత్మభావం ఉన్నంతవరకే ప్రారబ్ధం అనేది ఉండటం సంభవమౌతుంది. దేహాత్మభావం అనేది ముముక్షువునకు ఇష్టమైనది కాదు. అందుచేత ప్రారబ్ధం యొక్క ఆస్థను వదలిపెట్టాల్సి వస్తుంది.

**శరీర స్యాపి ప్రారబ్ధం కల్పనా భ్రాన్తిరేవ హి**
**అధ్యస్తస్య కుతః సత్త్వ మసత్త్వస్య కుతో జనిః**
**అజాతస్య కుతోనాశః ప్రారబ్ధ మసతః కుతః.** 461

యథార్థంగా చూస్తే, శరీరానికి ప్రారబ్ధాన్ని కల్పించుకోవటం కూడా భ్రాన్తే! ఎందుచేతనంటే, శరీర మనేది కేవలం భ్రాన్తివల్ల కల్పింపబడ్డదే గదా! అట్లా అధ్యస్తవస్తువుకు (భ్రాంతి కల్పితమైనదానికి) సత్త ఏముంటుంది? సత్త అనేదే లేనిదానికి జన్మ ఎట్లా ఉంటుంది? జన్మయే లేనిదానికి నాశనం మాత్రం ఎట్లా ఉంటుంది? కాబట్టి సత్తయే లేనిదానకి ప్రారబ్ధం ఎట్లా ఉంటుంది?

**జ్ఞానేనాజ్ఞానకార్యస్య సమూలస్య లయో యది**
**తిష్ఠత్యయం కథందేహ ఇది శంకావతో జడాన్**
**సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధంవదతి శ్రుతిః.** 462

**న తు దేహాది సత్యత్వ బోధనాయ విపశ్చితామ్**
**యతః శ్రుతేరభిప్రాయః పరమార్థికగోచరః.** 463

జ్ఞానంవల్ల అజ్ఞానం సమూలంగా నాశనమైపోతే, జ్ఞానియొక్క ఈ స్థూలదేహం ఎట్లా ఉంటుంది? అని శంకించే మూర్ఖులకు చెప్పటంకోసం శ్రుతి, అందుకు కారణం ప్రారబ్ధం అని చెప్పింది. అది విద్వాంసునికి దేహాదులు సత్యమని చెప్పటంకోసం ఆ విధంగా చెప్పలేదు. ఎందుచేతనంటే, పరమార్థ వస్తువును వర్ణించటం మాత్రమే శ్రుతియొక్క అభిప్రాయం.

## నానాత్వ నిషేధం

**పరిపూర్ణ మనాద్యన్త మప్రమేయమవిక్రియమ్**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన.** 464

వాస్తవానికి, సర్వత్ర, పరిపూర్ణము, అనాది, ఆనంతము, అప్రమేయము, అవి కారి అయిన అద్వితీయ బ్రహ్మము ఒక్కటే ఉంది. అందులో ఇతరములైన నానా పదార్థాలు లేవు అని శ్రుతి చెపుతోంది.

**సద్ఘనం చిద్ఘనం నిత్యమానంద ఘన మక్రియమ్**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన.** 465

సచ్చిదానంద ఘనస్వరూపము అయినట్టి, నిత్యము, అక్రియము, అద్వితీయము అయిన బ్రహ్మమే సత్యవస్తువు. అందులో అనేకత్వం–నానా పదార్థాలు ఏవీ లేవు.

**ప్రత్యగేకరసం పూర్ణమనన్తం సర్వతోముఖం**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహనానాస్తికించన.** 466

అంతరాత్మ, ఏకరసము, పరిపూర్ణము, అనంతము, సర్వవ్యాపకము అయిన ఒక్క అద్వితీయ బ్రహ్మము మాత్రమే ఉంది. అందులో నానా పదార్థాలు ఏవీ లేవు అనేకత్వం లేదు.

**అహేయ మనుపాదేయ మనాధేయ మనాశ్రయమ్**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన.** 467

(ఆ బ్రహ్మము) త్యాజ్యమైనది కాదు, గ్రాహ్యమూ కాదు. (దానిని పట్టుకోనూ లేము వదలిపెట్టనూ లేము) అది వేరొక దానిలో ఉండేదీ కాదు – దానికి ఆధారమైనదేదీ లేదు. అటువంటి అద్వితీయ బ్రహ్మ మొక్కటే సత్యం. అందులో నానాత్వం అంటూ లేదు.

**నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనం**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానా స్తి కించన.** 468

నిర్గుణుడు, కలారహితుడు, సూక్ష్ముడు, నిర్వికారుడు, నిర్వికల్పుడు, నిర్మలుడు అయినట్టి అద్వితీయ పరబ్రహ్మ ఒక్కడే సత్యం. అతనిలో నానా పదార్థాలంటూ ఏవీ లేవు.

**అనిరూప్య స్వరూపం యన్మనోవాచామగోచరం**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన.** 469

అతని రూపాన్ని వర్ణించలేవు – ఇటువంటి వాడని నిరూపించలేము. మనస్సుకు, వాక్కుకు అందనివాడు. అటువంటి అద్వితీయ బ్రహ్మ మొక్కటే సత్యం. అందులో అనేకత్వ మనేది లేదు.

**సత్సమృద్ధం స్వతః సిద్ధం శుద్ధం బుద్ధమనీదృశమ్**
**ఏకమేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కించన.** 470

సత్యము, వైభవపూర్ణము (సమృద్ధము) స్వతః సిద్ధము, శుద్ధము, జ్ఞాన స్వరూపము, నిరుపమానము అద్వితీయము అయిన బ్రహ్మమొక్కటే సత్యం. అందులో నానాత్వానికి తావు లేదు.

## ఆత్మానుభవోపదేశం

నిరస్తరాగా నిరపా స్త భోగాః
　　శాన్తాః సుదాన్తా యతయో మహా న్తః
విజ్ఞాయ తత్త్వం పరమేత దన్తే
　　ప్రాప్తాః పరాం నిర్వృతి మాత్మయోగాత్. 471

ఏ వస్తువునందు రాగం లేనట్టివారు, భోగాలు పూర్తిగా అంతమైపోయినవారు, శాంతచిత్తులు, ఇంద్రియ సంయమం కలవారు, మహాత్ములు అయిన సన్న్యాసులు – యతీశ్వరులు – ఈ పరమ తత్త్వాన్ని తెలుసుకొని చివరలో ఆధ్యాత్మ యోగం ద్వారా పరమశాంతిని పొందారు.

భవానపీదం పరతత్త్వమాత్మనః
　　స్వరూప మానన్ద ఘనం విచార్య
విధూయ మోహం స్వమనః ప్రకల్పితం
　　ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః. 472

కాబట్టి, నాయనా! నీవు కూడా ఆత్మయొక్క ఈ పరమ తత్త్వాన్ని – ఆనంద ఘనస్వరూపాన్ని చింతన చేస్తూ, నీ మనస్సు కల్పించినట్టి మోహాన్ని వదలిపెట్టి ముక్తుడవు కమ్ము! ఈ విధంగా అజ్ఞాన నిద్రనుండి మేల్కాంచి కృతార్థుడవు కమ్ము!

సమాధినా సాధు వినిశ్చలాత్మనా
　　పశ్యాత్మతత్త్వం స్ఫుటబోధచక్షుషా
నిఃసంశయం సమ్యగవేక్షి తశ్చే -
　　చ్ఛ్రుతః పదార్థో న పునర్వికల్ప్యతే. 473

సమాధి ద్వారా చక్కగా నిశ్చలంగా ఉన్న చిత్తముతో, వికసితమైన జ్ఞాన నేత్రాలతో ఈ ఆత్మతత్త్వాన్ని చూడు. ఎందుచేతనంటే, నిన్న విషయాన్ని – పదార్థాన్ని చక్కగా స్పష్టంగా చూసినట్లైతే ఇక ఆ విషయాన్ని గురించిన సంశయమంటూ ఉండదు.

స్వస్యా విద్యాబన్ధ సంబంధ మోక్షా -
　　త్సత్యజ్ఞానానంద రూపాత్మ లబ్ధౌ
శాస్త్రం యుక్తిర్దేశికోక్తిః ప్రమాణం
　　చాన్తాః సిద్ధా స్వానుభూతిః ప్రమాణం. 474

తన అజ్ఞాన బంధన సంబంధం వదలిపోవటంవల్ల, సచ్చిదానంద స్వరూపమైన ఆత్మప్రాప్తి కలుగుతుంది. ఇందుకు శాస్త్రము, కుక్తి, గురువాక్యము, అంతఃకరణం ద్వారా సిద్ధించే స్వీయ అనుభవమూ ప్రమాణం.

**బంధో మోక్షశ్చ తృప్తిశ్చ చిన్తారోగ్యక్షుధాదయః**
**స్వేనైవ వేద్యా యజ్జ్ఞానం। పరేషామానుమానికమ్.** 475

బంధము, మోక్షము, తృప్తి, చింత, ఆరోగ్యం, ఆకలి మొదలైనవి వాటంతట అవే తెలుస్తాయి. వాటిని గురించి ఇతరులకు కలిగే జ్ఞానం కేవలం అనుమానానికి సంబంధించిన దే!

**తటస్థితా బోధయన్తి గురవః శ్రూయతే యథా**
**ప్రజ్ఞయైవ తరేద్విద్వానీశ్వరాను గృహీతయా.** 476

శ్రుతిలాగానే, గురువు కూడా తటస్థరూపంలోనే బోధిస్తాడు – ఉపదేశం చేస్తాడు. విద్వాంసుడైనవాడు ఈశ్వరుడు అనుగ్రహించిన బుద్ధితో దానిని అపరోక్షంగా (సాక్షాత్తు) అనుభవంచి, ఈ సంసార సాగరాన్ని దాటాలి.

బ్రహ్మన్ని సాక్షాత్తుగా ఎవరూ నిరూపించలేరు. ఎందుచేతనంటే, బ్రహ్మము శబ్దశక్తికి అతీతమైంది. శబ్దం అచటికి చేరలేదు. బ్రహ్మనికి సంబంధించిన జ్ఞానం లక్షణావృత్తితో మాత్రమే కలుగుతుంది. అందుచేత, బ్రహ్మన్ని సాక్షాత్కారం చేసుకోవాలంటే, ఆ బ్రహ్మనికి ఉపాధిగా ఉండే ఈ ప్రపంచాన్ని త్రోసివేయాలి – నిషేధించాలి – ఈ ఉపాధియే బ్రహ్మన్ని కప్పి ఉంచింది కాబట్టి! ఈ దృశ్య ప్రపంచాన్ని నిరసించాలీ అంటే, దానియందు మిథ్యాత్మబుద్ధి కలిగితేనే తప్ప సాధ్యంకాదు. ఇటువంటి బుద్ధి శిష్యునికి కలగాలంటే, శాస్త్రకృప, గురు కృపతోపాటు ఈశ్వర కృపకూడా తప్పని సరిగా ఉండాలి.

**స్వానుభూత్యా స్వయం జ్ఞాత్వా స్వమాత్మాన మఖండితం**
**సంసిద్ధః సనుఖం తిష్ఠే న్నిర్వికల్పాత్మనాత్మని.** 477

తన అనుభవంతో అఖండమైన ఆత్మను స్వయంగా తెలుసుకొని కృతార్థుడైనవాడు నిర్వికల్పభావంతో ఆనంద పూర్వకంగా సదా ఆత్మయందే సంస్థితుడై ఉండాలి.

**వేదాన్త సిద్ధాన్త నిరుక్తిరేషా**
**బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ**
**అఖండరూప స్థితిరేవ మోక్ష**
**బ్రహ్మద్వితీయే శ్రుతయః ప్రమాణం.** 478

వేదాంత సిద్ధాంతం మనకు జీవుడు జగత్తు కూడా కేవలం బ్రహ్మమే అని చెపుతోంది. అటువంటి అద్వితీయమైన బ్రహ్మంలో నిరంతరం అఖండ రూపంలో ఉండటమే మోక్షం. బ్రహ్మము అద్వితీయం అనటానికి శ్రుతులు ప్రమాణం.

## జ్ఞానోపలబ్ధి

ఇతి గురువచనాచ్ఛ్రుతి ప్రమాణా -
త్పరమవగమ్య సతత్త్వమాత్మయుక్త్యా
ప్రశమితకరణః సమాహితాత్మా
క్వచిదచలాకృతిరాత్మ నిష్ఠితోఽభూత్. 479

ఈ విధంగా గురువు చెప్పగా, శ్రుతిప్రమాణాలతో కూడినట్టి, తన యుక్తుల ద్వారా పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకొని చిత్తము, ఇంద్రియాలూ శాంతించగా ఒకానోక శిష్యుడు నిశ్చల వృత్తిలో ఆత్మ స్వరూపంలో ఉండిపోయాడు.

కంచిత్కాలం సమాధాయ పరేబ్రహ్మణి మానసం
వ్యుత్థాయం పరమానందాదిదం వచన మబ్రవీత్. 480

కొంతసేపటి వరకు అట్లా చిత్తాన్ని పరబ్రహ్మలో సమాహితం చేసి, పిమ్మట ఆ పరమానంద స్థితినుండి లేచి యిట్లా అన్నడు –

బుద్ధిర్వినష్టా గలితా ప్రవృత్తి -
ర్బ్రహ్మాత్మనోరేకతయాధిగత్యా
ఇదం న జానేఽప్యనిదం న జానే
కిం వా కియద్వా సుఖమస్త్యపారమ్. 481

ఓహో! బ్రహ్మ ఆత్మల ఏకత్వజ్ఞానం కలిగినంతనే, నా బుద్ధి ఒక్కసారిగా నష్టమైపోయింది. ప్రవృత్తి పూర్తిగా కరగిపోయింది. ఆ స్థితిలో, ఇదం జ్ఞానమూ లేదు (సామీప్యంలో ఉన్న ప్రత్యక్ష వస్తు జ్ఞానమూ లేదు) ఆ అపారమైనట్టి ఆనందం ఎటువంటిదో కూడా నాకు తెలియదు.

వాచా వక్తుమశక్య మేవ మనసా మన్తుం న వా శక్యతే
స్వానన్దామృత పూర పూరిత పరబ్రహ్మాంబుధేర్వై భవమ్
అంభోరాశి విశీర్ణ వార్షిక శిలాభావం భజన్మే మనో
యస్యాంశాంశలవే విలీనమధునానందాత్మనా నిర్వృతం. 482

సముద్రంలో పడి, వర్షంతో పాటు పడిన వడగండ్లు కరగిపోయినట్లుగా, నా మనస్సు. ఆనందామృత సాగరంలోని అంశాంశంలో లీనమై ఇప్పుడు ఆనందరూపంలో మిగిలి ఉంది. ఆ ఆత్మానందరూపమైన అమృతప్రవాహంతో పరిపూర్ణమైనట్టి పరబ్రహ్మమనే సముద్ర వైభవాన్ని వాక్కులతో వర్ణించలేము, మనస్సుతో మననం చేయలేము.

**క్వగతం కేనవా నీతం కుత్ర లీనమిదం జగత్**
**అధునైవ మయాదృష్టం నాస్తి కిం మహదద్భుతమ్.** 483

ఈ ప్రపంచం ఎక్కడికి పోయింది? దానిని ఎవరు తీసికొనిపోయరు? అది ఎక్కడ లీనమైంది? ఆహా! ఏమి ఆశ్చర్యం! ఇంతవరకూ చూస్తూ ఉండిన ఆ ప్రపంచం ఎక్కడా కనిపించనే కనిపించటం లేదు.

**కిం హేయం కిముపాదేయం కిమన్యత్కిం విలక్షణం**
**అఖండానంద పీయూష పూర్ణే బ్రహ్మమహార్ణవే.** 484

ఈ అఖండానందామృతంతో నిండి ఉన్న బ్రహ్మార్ణవంలో – బ్రహ్మమనే సముద్రంలో వదలిపెట్టాల్సిన వస్తువేముంటుంది? గ్రహించాల్సిన వస్తువేముంటుంది? సామాన్యమైన దేముంటుంది? విలక్షణమైనది ఏముంటుంది?

**న కించిదత్రపశ్యామి న శ్రుణోమి న వేద్మ్యాహమ్**
**స్వాత్మనైవ సదానన్ద రూపేణాస్మి విలక్షణః.** 485

నా కిప్పుడిక్కడ ఏమీ కనిపించటం లేదు, ఏమీ వినిపించటం లేదు. నా కేమీ తెలియటం లేదు. నేను నా నిత్యానంద స్వరూపమైన ఆత్మలోఉండి, నా ఇంత పూర్వపు స్థితికి పూర్తిగా విలక్షణమైన వాడనైనాను.

**నమో నమస్తే గురవే మహాత్మనే**
**విముక్త సంగాయ సదుత్తమాయ**
**నిత్యాద్వయానంద రసస్వరూపిణే**
**భూమ్నే సదా పారదయాంబుధామ్నే.** 486

**యత్కటాక్ష శశిసాన్ద్ర చన్ద్రికా పా ధూత భవతాపజశ్రమః**
**ప్రా ప్తవానహ మఖండ వైభవానంద మాత్మపద మక్షయంక్షణాత్.**

ఎవని కృపాకటాక్షమనే చంద్రుని యొక్క స్నిగ్ధమైన వెన్నెలవల్ల సంసార తాపంవల్ల కలిగిన శ్రమ తొలగిపోవటంవల్ల, క్షణంలో ఐశ్వర్యము, ఆనందమయము, అక్షయము అయిన ఆత్మపదాన్ని పొందానో, అటువంటి మహనీయుడు, సంగరహితుడు, ఉత్తమోత్తముడు, నిత్యమూ అద్వయానంద స్వరూపంలో ఉండే, మహాత్ముడు, అపారదయాసాగరుడు అయిన గురుదేవా! నమస్కారము.

**ధన్యోఽహం కృతకృత్యోఽహం విముక్తోఽహం భవగ్రహాత్**
**నిత్యానంద స్వరూపోఽహం పూర్ణోఽహం తదనుగ్రహాత్.** 488

శ్రీ గురుదేవుని దయవల్ల నేడు నేను ధన్యుడనైనాను. కృతకృత్యుణ్ణి అయినవారు. సంసార బంధనాల నుండి విముక్తుణ్ణి అయినవారు, నాత్యానంద రసస్వరూపుణ్ణి అయినాను, అంతటా పరిపూర్ణుడనైనాను.

**అసంగోఽహం అనంగోఽహ మలింగోఽహమభంగురః**
**ప్రశాన్తోఽహ మనన్తోఽహ మతాన్తోఽహం చిరంతనః.**

నేను అసంగుడను, అనంగుడను, అలింగుడను (ఏ చిహ్నాలూ లేనివాడను) అక్షయుడును, శాంతుడను, అనంతుడను, నిరీహుడను (కోరికలు లేనివాడను) పురాతనుడను.

**అకర్తాహ మభోక్తాహ మవికారోఽహ మక్రియ**
**శుద్ధబోధ స్వరూపోహం కేవలోఽహం సదాశివః.** 490

నేను కర్తనుకాను, నేను భోక్తనూకాను, నేను అవికారుడను; అక్రియుడను, శుద్ధ జ్ఞానస్తరూపుడను, కేవలుడను–అద్వితీయుడను, నిత్యకల్యాణ స్వరూపుడను.

**ద్రుష్టుః శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్న ఏవాహం**
**నిత్యనిరన్తర నిష్క్రియ నిఃసీమాసంగ పూర్ణబోధాత్మా.** 491

ద్రష్ట, శ్రోత, వక్త, కర్త, భోక్త, వీరందరికంటే నేను భిన్నమైనవాడను. నేను నిత్యుడను, నిరంతరుడను, నిష్క్రియుడను, నిస్సీయుడను– హద్దు. పరిమితి లేనివాడను–అసంగుడను, పూర్ణబోధ స్వరూపుడను.

**నాహమిదం నాహమదోఽ ప్యుభయోరవభాసకం పరం శుద్ధం**
**బాహ్యాభ్యన్తర శూన్యం పూర్ణం బ్రహ్మ ద్వితీయమేవాహమ్.** 492

నేను ఇదీ కాదు అదీకాదు ఈ రెంటినీ–స్థూల సూక్ష్మ జగత్తులు రెంటినీ ప్రకాశింపజేసే వాడిని, బాహ్యాభ్యన్తర శూన్యుడను, పూర్ణుడను, అద్వితీయుడను, సాక్షాత్తు పరబ్రహ్మనే!

**నారాయణోఽహం నరకాంతకోఽహం**
**పురాంతకోఽహం పురుషోఽహమీశః**
**అఖండ బోధోఽహ మశేషసాక్షి**
**నిరీశ్వరోఽహం నిరహం చ నిర్మమః.** 493

నేను నారాయణుడను, నరకాసురుని చంపినవాడను, త్రిపురాసుర వధ చేసినవాడను, పరమ పురుషుణ్ణి నేను ఈశ్వరుడను. అఖండజ్ఞాన స్వరూపుడను. అన్నిటికి సాక్షిని స్వతంత్రుడను అహంకార మమకారములు లేనివాడను.

సర్వేషు భూతుష్వహమేవ సంస్థితో
జ్ఞానాత్మనాన్తర్బహిరాశ్రయః సన్
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం
యద్య త్పృథగ్దృష్ట మిదన్తయా పురా. 494

జ్ఞాన స్వరూపంలో అన్నింటికీ, అందరికీ ఆశ్రయమై బాహ్యాభ్యన్తరాలలో నేనపే ఉన్నాను ఇందకుపూర్వం ఏఏ పదార్థాలు ఇదంవృత్తి ద్వారా వేరు వేరుగా కనిపించి నాయో–అవీ, వాటి భోక్త భోగ్యవస్తువులూ అన్నీ స్వయంగా నేనే!

మయ్యఖండ సుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః
ఉత్పద్యన్తే విలీయన్తేః మాయామారుత విభ్రమాత్. 495

నా అఖండమైన ఆనంద సాగరంలో ఈ విశ్వమనే రకరకాల తరంగాలు మాయ అనే వాయువు ద్వారా పైకి లేచి మళ్ళీ లీనమైపోతున్నాయి.

స్థూలాదిభావా మయి కల్పితా భ్రమా -
దారో పితా ను స్ఫురణేన లోకైః
కాలే యథా కల్పక వత్సరాయ -
నర్త్వాదయో నిష్కల నిర్వికల్పే. 496

కలారహితము, విభాగరహితము, నిర్వికల్పము అయిన కాలంలో యథార్థానికి కల్పాలు, సంవత్సరాలు, ఉత్తరాయణ దక్షిణాయనాదులు, ఋతువులు వగైరా విభాగాలు లేకపోయినా ప్రజలు భ్రమకులోనై కేవలం స్ఫురణ మాత్రం చేతనే భేదాన్ని కల్పించు కొన్నట్లుగా, నాలో కూడా స్థూల సూక్ష్మాదిరూపాల్ని కల్పించుకుంటున్నారు.

ఆరోపితం నాశ్రయదూషకం భవే
త్కదాపి మూఢైర్మతిదోష దూషితైః
నార్ద్రీకరోత్యూషర భూమిభాగం
మరీచికా వారి మహాప్రవాహః. 497

బుద్ధిదోష దూషితులైన అజ్ఞానుల ద్వారా ఆరోపింపబడిన వస్తువు తన ఆశ్రయాన్ని ఎన్నడూ దూషితం చేయలేదు. అజ్ఞానంవల్ల మృగతృష్ణలో – ఎండమావుల్లో – కల్పింపబడిన మహా జలప్రవాహం వచ్చి, మరుభూమిని ఏమాత్రమూ తడపలేదు.

ఆకాశవల్లేప విదూర గో-హ -
మాదిత్యవద్భాస్య విలక్షణోఽ హమ్;

ఆహార్యవన్నిత్య వినిశ్చలోఽహ -

మంభోధి వత్పార వివర్జితో-హమ్. 498

నేను ఆకాశంలాగా నిర్లేపుడను–ఏమీ అంటనివాడను, సూర్యునిలాగా ఇతరములైన వానిచేత ప్రకాశింపబడనివాడను. పర్వతంలాగా ఎల్లప్పుడూ నిశ్చలంగా ఉండేవాడను. సముద్రంలాగా అంతులేనివాడను.

న మే దేహేన సంబంధో మేఘేనేవ విహాయసః

అతః కుతోమే తద్ధర్మా జాగ్రత్స్వప్న సుషుప్తయః. 499

మేఘంతో ఆకాశానికి ఏమీ సంబంధం లేనట్లే, నాకు కూడా శరీరంతో సంబంధం లేదు. అయితే, ఈ శరీర సంబంధమైన జాగ్రత్ స్వప్నసుషుప్తి మొదలైనవి నాయందు ఎట్లా కలుగుతున్నాయి? అంటే–

ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి

స ఏవ కర్మాణి కరోతి భుంక్తే

స ఏవ జీర్యన్మ్రియతే సదాహం

కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితం. 500

ఉపాధి అనేదే వస్తోంది, పోతోంది. ఆ ఉపాధే కర్మ చేస్తోంది. వాటి ఫలాన్ని అనుభవిస్తోంది. వార్ధక్యాన్ని పొందినమీదట ఆ ఉపాధే చస్తోంది. నేను మాత్రం కుల పర్వతంలాగా నిత్యము నిశ్చల భావంతోనే ఉంటున్నాను.

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తిః

సదైకరూపస్య నిరంశకస్య

ఏకాత్మకో యో నివిడో నిరంతరో

వ్యోమేవ పూర్ణః స కథం ను చేష్టతే. 501

ఎల్లప్పుడు ఏక రూపంలో ఉండే నాకు, అవయవాలంటూ లేని నాకు, ఏ విషయమందూ ప్రవృత్తీ లేదు, వేని నుండి నివృత్తీ లేదు. నిరంతరం ఒకే రూపంలో ఘనీభూతమై ఉండే, ఆకాశాంలాగా పూర్ణమైనట్టివాడు ఏ విధంగా చేష్టలు చేయగలుగుతాడు? అట్టివానికి చేష్టలు ఉండవు.

పుణ్యాని పాపాని నిరింద్రియస్య

నిశ్చేతసో నిర్వికృతేర్నిరాకృతేః

కుతో మమాఖండ సుఖానుభూతే -

ర్బ్రూతే హ్యనన్వాగతమిత్యపి శ్రుతిః. 502

(బృహదారణ్యకోపనిషత్తులోని 4-3-22 మంత్రాల్ని ఇక్కడ ఉదహరించారు-సుషుప్తిలోని పురుషుడు సంగరహితుడు, శోకరహితుడు అయి ఉంటాడని మంత్రభావం). '...అత్ర పితా పితా భవతి...అనన్వాగతం పుణ్యేనాన న్వాగతం పాపేన..." ఇంద్రియాలు లేనట్టి, చిత్తము, వికారాలు, ఆకృతి లేనట్టి, నా అఖండానంద స్వరూపానికి పాపం, పుణ్యం అనేవి ఎట్లా ఉంటాయి? శ్రుతి కూడా 'అనన్వాగతం పుణ్యేన అనన్వాగతం పాపేన' పుణ్యపాపాల ప్రతీతి ఆ స్థితిలో ఉండదు అని చెపుతోంది. ఆత్మకు శాస్త్రవిహిత కర్మ ఫలమైన పుణ్యంగాని, శాస్త్రనిషిద్ధ కర్మఫలమైన పాపంగాని అంటదు అని భావం.

**ఛాయయా స్ప ృష్ట ముష్ణం వా శీతం వా సుష్ఠు దుష్ఠు వా**
**న స్పృశత్యేవ యత్కించి త్పురుషం తద్విలక్షణం.** 503

**న సాక్షిణం సాక్ష్య ధర్మాః సంస్ప ృశన్తి విలక్షణం**
**అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్.** 504

నీడను, శీతోష్ణాలు, మంచి చెడులు, అట్లాగే ఏవి స్ప ృశించినప్పటికీ అవన్నీ నీడకంటె భిన్నుడైన పురుషుని ఏ మాత్రమూ స్పృశించవు. అట్లాగే, ఇంటిని ప్రకాశింపజేసే-ఇంటికి వెలుగు నిచ్చే-దీపానికి ఆ యింటికి ఉన్నట్టి అందంగాని, మాలిన్యంగాని, ఏ ధర్మమూ అంటదు. అట్లాగే శరీరాది దృశ్యపదార్థాల కుండే ధర్మాలు, ఆ శరీరం కంటె విలక్షణమైనట్టి సాక్షియైనట్టి, వికారరహితమైనట్టి, ఉదాసీనమైనట్టి ఆత్మను ఏ మాత్రమూ స్ప ృశింపవు.

**రవేర్యథా కర్మణి సాక్షిభావో**
**వహ్నేర్యథా వాయసి దాహకర్త్వమ్**
**రజ్జోర్యథా రోపితవస్తు సంగ -**
**స్తథైవ కూటస్థ చిదాత్మనో మే.** 505

మానవులు చేసే కర్మలకు సూర్యుడు కేవలం సాక్షి భావంగా ఉన్నట్లే, ఇనుమును కాల్చటానికి అగ్నియొక్క దాహకత్వం లాగానే, ఆరోపితమైన సర్పాదులతో రజ్జువుకు ఉండే సంబంధం లాగానే, కూటస్థుడను, ఆత్మను అయిన నాకు విషయాలలో సాక్షిభావం మాత్రమే ఉంది. అంటే-సూర్యుడు అగ్ని మొదలైన వాటి ప్రవృత్తులు స్వాభావికాలే తప్ప. క్రియమాణాలు కావు. అట్లాగే, ఆత్మకుండే సాక్షిభావం కూడా, విషయాపేక్ష విసయంలో స్వాభావికమైనది. అంతే తప్ప దాని క్రియకాదు.

**కర్తాపి వా కారయతాపి నాహం**
**భోక్తాపి వా భోజయితాపి నాహం**

ద్రష్టాపి వా దర్శయితాపి నాహం
సోఽహం స్వయంజ్యోతి రనీదృగాత్మా. 506

నేను చేసేవాడనూ కాను, చేయించేవాడనూ కాను. నేను అనుభవించేవాడినీ కాను, అనుభవింపజేసేవాడినీ కాను, నేను చూచేవాడనూ కాను; చూపించేవాడనూ కాను, నేను వీటి అన్నింటిక విలక్షణమైన స్వయంప్రకాశమైన ఆత్మను.

జలం అనే ఉపాధి చంచలంగా (కదులుతూ) ఉండటంవల్ల, ఆ ఉపాధిలో ప్రతిబింబించే సూర్యుని చూచి, మూఢుడు సూర్యుడే చంచలంగా కదలుతున్నాడని అనుకొంటారు. అంటే ఉపాధియొక్క చంచలత్వాన్ని బింబభూతమైన సూర్యునిలో ఆరోపిస్తాడు. అట్లాగే కదలకుండా ఉన్న సూర్యునిలాగా నిష్క్రియంగా ఉన్న ఆత్మయందు చిత్తంయొక్క చాంచల్యాన్ని ఆరోపించి 'నేను కర్తను, నేను భోక్తను, నేను చచ్చితిని' అని అంటూ ఉంటాడు.

జలే వాపి స్థలే వాపి లుఠ త్వేష జడాత్మకః
నాహం విలిప్యే తద్ధర్మైర్ఘటధర్మైర్నభో యథా. 508

ఘటం యొక్క ధర్మాలతో ఆకాశానికి ఏమీ సంబంధం లేనట్లుగా, ఈ జడమైన దేహం నీళ్ళలో దొర్లుతున్నా, నేలమీదపడి దొర్లుతున్నా, నేను మాత్రం ఈ శరీర ధర్మాలతో లిప్తుణ్ణికాను–శరీర ధర్మాలు నాకు అంటవు.

కర్తృత్వభోక్తృత్వ ఖలత్వ మత్తతా -
జడత్వ బద్ధత్వ విముక్తతాదయః
బుద్ధేర్వికల్పా న తు సన్తి వస్తుతః
స్వస్మిన్పరే బ్రహ్మణి కేవలేఽద్వయే. 509

కర్తృత్వం, భోక్తృత్వం, దుష్టత్వం, ఉన్మత్తత, జడత్వం, బంధనం, మోక్షం ఇవన్నీ బుద్ధియొక్క కల్పనలే! ఇవన్నీ నిజానికి, ప్రకృతికి అతీతమైనట్టి కేవల అద్వితీయ బ్రహ్మస్వరూపమైన స్వాత్మయందు లేవు.

సన్తు వికారాః ప్రకృతేర్దశధా శతధా సహస్రధా వాపి
కిం మేఽసంగచితేస్తైర్న ఘనఃక్వచిదంబరం స్పృశతి. 510

ప్రకృతిలో పదులు, వందలు, వేలకొలది వికారాలు ఉంటే ఉండవచ్చుగాక, అసంగుడను, చేతనుడను, ఆత్మనయిన నాకు, వాటితో ఏమి సంబంధం? మేఘం ఎన్నడూ ఆకాశాన్ని అంటుకోజాలదు గదా!

**అవ్యక్తాది స్థూలపర్యస్త మేత -**
**ద్విశ్వం యత్రాభాస మాత్రం ప్రతీతం**
**వ్యోమ ప్రఖ్యం సూక్ష్మమాద్యన్త హీనం**
**బ్రహ్మాద్వైతం యత్తదేవాహ మస్మి.** 511

అవ్యక్తం – ప్రకృతి – మొదలుకొని స్థూలభూతాల వరకు గల ఈ సమస్త విశ్వంలోనూ కేవలం అభాస మాత్రమే ప్రతీత మౌతోంది. ఆకాశం లాగా సూక్ష్మమై, అది అంతము లేనట్టి ఆ అద్వైత బ్రహ్మాన్ని నేనే!

**సర్వాధారం సర్వవస్తు ప్రకాశం**
**సర్వాకారం సర్వంగం సర్వశూన్యం**
**నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం**
**బ్రహ్మాదైతం య త్తదేవాహ మస్మి.** 512

అన్నింటికీ ఆధారమైనట్టిదీ, అన్ని వస్తువులనూ ప్రకాశింపజేసేదీ, సర్వ స్వరూపం కలదీ, సర్వవ్యాప్తియైనదీ, సర్వశూన్యమైనదీ, నిత్యము, శుద్ధము, నిశ్చలము వికల్ప రహితము అయిన అద్వైత బ్రహ్మాన్ని నేనే!

**యత్రప్రత్య స్తాశేష మాయా విశేషం**
**ప్రత్యగ్రూపం ప్రత్యయా గమ్య మానమ్**
**సత్య జ్ఞానానన్త మానందరూపం**
**బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి.** 513

మాయతో కూడినట్టి భేదాలు ఏవీ లేనట్టి. అంతరాత్మ స్వరూపం కలిగినట్టి, సాక్షాత్తుగా– ప్రత్యక్షంగా–కనిపించనట్టిది, సత్యజ్ఞానానంత ఆనంద స్వరూపము అయిన ఆ అద్వైత బ్రహ్మాన్ని నేనే!

**నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మి నిష్కలోఽస్మి నిరాకృతిః**
**నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్ద్వయః.** 514

నేను క్రియారహితుడను, నేను వికార రహితను, కలారహితుడను, విభాగాలు లేనివాడను, ఆకారం లేని వాడను, నిర్వికల్పుడను, నిత్యుడను, నిరాలంబుడను, నాకు కారణమైనది ఏదీ లేదు. అద్వితీయుడను.

**సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహం అద్వయః**
**కేవలాఖండ బోధోఽహమానందోఽహం నిరన్తరః.** 515

నేను అన్నిటికీ, అందరికి ఆత్మను, సరస్వరూపుణ్ణి-అన్ని రూపాలూ నావే! అన్నింటికి అతీతమైనవాడను, అద్వితీయుడను, అఖండ జ్ఞాన స్వరూపుడను, నిరంతరానంద స్వరూపుడను.

**స్వారాజ్య సామ్రాజ్య విభృతిరే షా**
**భవత్కృపాశ్రీమహిమ ప్రసాదత్**
**ప్రాప్తామయా శ్రీగురవే మహాత్మనే**
**నమో నమస్తేఽస్తు పునర్నమోఽస్తు.** **516**

ఓ గురుదేవా! తమ దయవల్ల, తమ మహాత్మ్య ప్రసాదంవల్ల నాకు ఈ స్వరాజ్య సామ్రాజ్య విభూతి లభించింది-మోక్షైశ్వర్యం లభించింది. మహాత్ములైన తమకు అనేక నమస్కారాలు చేస్తున్నాను. మాటిమాటికి నమస్కరిస్తున్నాను.

**మహాస్వప్నే మాయాకృథ జనిజరామృత్యుగహనే**
**భ్రయన్తం క్లిశ్యన్తం బహులతరతాపైరనుదినమ్**
**అహంకార వ్యాఘ్ర వ్యథిత మిమ మత్యంత కృపయా**
**ప్రబోధ్య ప్రస్వాపాత్పరమవితవాన్మామసి గురో.** **517**

(శిష్యుడు జ్ఞానప్రబోధానికి పూర్వం తనస్థితిని చెప్పుకుంటున్నాడు. శిష్యుడు కొంతసేపు సమాధి స్థితిని అనుభవించి, పిమ్మట సమాధి నుండి మేల్కొంచి ఈ విషయాలు చెపుతున్నాడనే విషయం గుర్తు ఉంచుకోవాలి.)

ఓ గురుదేవా! నేను మాయవల్ల గోచరించే జన్మ, జర, మరణాలవల్ల కలిగే మిక్కిలి భయంకరమైన మహా స్వప్నాన్ని చూస్తూ, దారి కానక తిరుగుతూ, రాత్రింబవళ్లు అనేక రకాల దుఃఖాలతో, తాపాలతో సంతప్తుణ్ణి అవుతూ ఉండేవాణ్ణి. అహంకారమనే వ్యాఘ్రంచేత అనేక విధాలుగా బాధపడే దీనుడనైన నన్ను నిద్ర నుండి మేల్కొలిపి రక్షించారు.

**నమస్తస్మై సదేకస్మై కస్మైచిన్మహసే నమః**
**యదేత ద్విశ్వరూపేణ రాజతే గురురాజ తే.** **518**

ఓ గురురాజా! తమలోని ఆ మహా తేజస్సుకు నమస్కారము. మీ స్వాత్మరూపము, సత్స్వరూపము, ఏకైకము అయి కూడా విశ్వరూపంలో ప్రకాశించే మీ మహాతేజస్సుకు నమస్కారము.

## ఉపదేశోపసంహారం

ఇతి నతమవలోక్య శిష్యవర్యం
సమధిగతాత్మ సుఖం ప్రబుద్ధతత్త్వం
ప్రముదిత హృదయః స దేశికేంద్రః
పునరిదమాహ వచః పరం మహాత్మా. 519

ఈ విధంగా తత్త్వబోధను, ఆత్మానందాన్నీ పొందినట్టి శిష్య శ్రేష్ఠుడు నమస్కరించగా చూచి, ఆ గురుదేవుడు ప్రసన్నచిత్తంతో మళ్ళీ ఈ విధంగా చెప్పసాగారు.

బ్రహ్మ ప్రత్యయ స న్తతిర్జగదతో బ్రహ్మైవ సత్సర్వతః
పశ్యాధ్యాత్మదృశా ప్రశా న్వమనసా సర్వాస్వవస్థాస్వపి
రూపాదన్యదవేక్షితుం కిమాభితశ్చక్షుష్మతాం విద్యతే
తద్వద్ బ్రహ్మ విదః సతః కిమపరం బుద్ధేర్విహారాస్పదమ్. 520

వత్సా! నీ ఆధ్యాత్మిక దృష్టితో శాంతచిత్తుడవై అన్ని అవస్థలలోనూ, ఈ సంసారమనేది బ్రహ్మప్రతీతికి సంబంధించిన ప్రవాహమనీ, అందుచేత ఇది (సంసారం) సత్యస్వరూపమైన బ్రహ్మమేననీ చూస్తూ ఉండు (గహించు), కండ్లు ఉన్నవానికి తన నాల్గువైపులా చూడటానికి రూపాన్ని మించినది ఏముంటుంది? అట్లాగే, బ్రహ్మజ్ఞానియైన వాని బుద్ధికి గోచరించేది సత్యస్వరూపమైన బ్రహ్మకంటె వేరొక విషయం ఏముంటుంది?

కస్తాం పరానన్ద రసానుభూతి -
ముత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్
చన్ద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేన్దు మాలోకయితుం క ఇచ్ఛేత్. 521

ఆ పరమానంద రసానుభవాన్ని వదలి, ఇతరములైన చప్పిడి విషయాలలో రమించే-ఆనందించే-బుద్ధిమంతు డెవడుంటాడు? ఎంతో ఆనందాన్ని యిచ్చే పూర్ణ చంద్రుడు చక్కగా ప్రకాశిస్తూఉంటే ఆ చంద్రుణ్ణి వదలి, బొమ్మలో చిత్రించి ఉన్న చంద్రుణ్ణి చూడాలనుకొనేవాడు ఎవడుంటాడు?

అసత్పదార్థానుభవే న కించి -
న్న హ్యస్తి తృప్తిర్న చ దుఃఖహానిః
తదద్వయానంద రసానుభూత్యా
తృప్తః సుఖం తిష్ఠ సదాత్మ నిష్ఠయా. 522

అసత్పదార్థాలను అనుభవించినందువల్ల తృప్తి కలగదు, దుఃఖమూ పోదు. కాబట్టి అద్వితీయానందరసాన్ని అనుభవించి తృప్తుడవై సత్యమైన ఆత్మనిష్ఠ భావంతో సుఖంగా ఉండు.

**స్వమేవ సర్వథా పశ్యన్మన్యమానః స్వమద్వయమ్**
**స్వానన్దమనుభుంజానః కాలం నయ మహామతే. 523**

ఓ బుద్ధిమంతుడా! అంతటా, అన్ని వైపులా నిన్నే చూచుకొంటూ, నిన్నే అద్వితీయునిగా భావించుకొంటూ, ఆత్మానందాన్ని అనుభవిస్తూ కాలక్షేపం చెయ్యి!–కాలాన్ని గడుపు.

**అఖండబోధాత్మని నిరి కల్పే**
**వికల్పనం వ్యోమ్ని పురః ప్రకల్పనమ్**
**తదద్వయానంద మయాత్మనా పదా**
**శాంతిం పరామేత్య భజస్వ మౌనం. 524**

అఖండ జ్ఞాన స్వరూపము, నిర్వికల్పము అయిన ఆత్మయందు వికల్పం ఉన్నదనటం, ఆకాశంలో పట్టణం ఉన్నదనే కల్పనలాంటిది, అందుచేత, అద్వితీయము, ఆనంద స్వరూపము అయిన ఆత్మయందు స్థితుడవై, పరమశాంతిని పొంది, మౌనాన్ని వహించు.

**తూష్ణీ మవస్థా పరమోపశాన్తి -**
**ర్బుద్ధేరసత్కల్ప వికల్పహేతోః**
**బ్రహ్మాత్మనా బ్రహ్మవితో మహాత్మనో**
**యత్రాద్వయానంద సుఖం నిరంతరమ్. 525**

మిథ్యావికల్పాలకు కారణమైనట్టి బుద్ధి, బ్రహ్మ భావంతో మౌనంగా ఉండటమే, మహాత్ముడైన బ్రహ్మవేత్తకు, గొప్ప ఉపశమం–ఉపశాంతి. ఆ మౌనంలోనే నిరంతరం అద్వయానందానుభూతి కలుగుతూ ఉంటుంది.

**నాస్తి నిర్వాసనా నౌనాత్పరం సుఖకృదుత్తమమ్.**
**విజ్ఞాతాత్మ స్వరూపస్య స్వానందరస పాయినః. 526**

ఆత్మస్వరూపాన్ని తెలుసుకొన్నట్టి స్వీయానంద రసాస్వాదన చేస్తూ ఉన్న వానికి, వాసనలేవీ లేనట్టి మౌనం కంటె సుఖాన్ని యిచ్చేది వేరొకటి ఏదీ లేదు.

**గచ్ఛం స్తిష్ఠ న్నుపవిశఞ్ఛయానో వాన్యథాపి వా**
**యథేచ్ఛయా వసేద్విద్వానాత్మారామః సదా మునిః. 527**

నడుస్తూ, తిరుగుతూ, కూర్చుంటూ, లేస్తూ, నిద్రిస్తూ, మేల్కొంటూ ఇట్లా ఏ స్థితిలో ఉన్నా నిరంతరం ఆత్మలోనే రమిస్తూ స్వేచ్ఛగా–తన యిష్టానుసారంగా ఉండటమే విద్వాంసుడైన మౌనికి తగిన పద్ధతి.

న దేశకాలాసన దిగ్యమాది -
లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధవృత్తేః
సంసిద్ధ తత్త్వస్య మహాత్మనోఽస్తి
స్వవేదనే కా నియమాద్యపేక్షా. 528

ఎవని చిత్తవృత్తి నిరంతరమూ ఆత్మస్వరూపంలో లగ్నమై ఉంటుందో, ఎవనికి ఆ తత్త్వసిద్ధి కలిగిందో, అటువంటి మహాత్మునికి దేశ, కాల, ఆసన, దిశా, యమ, నియమాలు, లక్ష్యాదుల అనవసరం. తనకు తాను తెలుసుకొన్నవానికి యింకా నియమాల అగత్యం ఏముంటుంది?

ఘటోఽయమితి విజ్ఞాతుం నియమః కో న్వపేక్ష్యతే
వినా ప్రమాణ సుష్ఠుత్వం యస్మిన్సతి పదార్థధీః. 529

'ఇది కుండ' అని తెలుసుకోవటానికి, వస్తు జ్ఞానాన్ని కలిగించే ప్రమాణ సౌష్ఠవానికి మించినట్టి, ఇంకా ఇతరమైన ఏ నియమం కావాలి?

ఆయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వాప్యపేక్షతే. 530

అట్లాగే, ఆత్మ అనేది నిత్యసిద్ధం, ప్రమాణం కలగటంతోనే అది స్వయంగానే భాసిస్తుంది. అది తన ప్రతీతికి–తాను గోచరించటానికి–దేశం, కాలం, శుద్ధి మొదలైనవాటిని వేటినీ అపేక్షించదు.

"నేను దేవదత్తుణ్ణి" అనే ఈ విధమైన జ్ఞానంలో, ఏ నియమం యొక్క అవసరమూ లేదు, అట్లాగే బ్రహ్మవేత్త అయినవానికి 'నేను బ్రహ్మను' అనే జ్ఞానం స్వతఃగానే కలుగుతుంది–దేవదత్తుడికి తాను దేవదత్తుణ్ణి అనే జ్ఞానం కలిగినట్లు!

భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా
అనాత్మక మసత్తుచ్ఛం కిం ను తస్యావభాసకమ్. 532

సూర్యునివల్ల జగత్తంతా ప్రకాశించునట్లుగానే, తన ప్రకాశంతో సమస్త అసత్పదార్థాల్నీ, తుచ్ఛమైన అనాత్మ పదార్థాల్నీ కూడా ప్రకాశింపజేసేవాడు బ్రహ్మ తప్ప ఇంకెవరుంటారు?

వేదశాస్త్ర పురాణాని భూతాని సకలాన్యపి
యేనార్థవన్తి తం కిం ను విజ్ఞాతారం ప్రకాశయేత్. 533

ఏ పరమాత్మవల్ల వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సమస్త భూతాలూ అర్థవంతాలు అవుతున్నాయో, అటువంటి సర్వసాక్షియైన పరమాత్మను ఎవరు ప్రకాశింపచేయగలరు?

ఏష స్వయంజ్యోతిరనన్తశక్తి -
　　రాత్మాప్రమేయః సకలానుభూతిః
యమేవ విజ్ఞాయ విముక్త బన్ధో
　　జయత్యయం బ్రహ్మవిదుత్తమోత్తమః. 534

ఇటువంటి సర్వసాక్షియైనట్టి, స్వయంజ్యోతియైనట్టి, అనంతశక్తి సంపన్నమైనట్టి, అప్రమేయమైనట్టి, సర్వానుభవ స్వరూపమైనట్టి ఆ పరమాత్మను తెలుసుకొన్నందు వల్లనే, బ్రహ్మవేత్తలైన మహాత్ములు, సంసార బంధనాల నుండి విముక్తులై ధన్యులౌతారు.

న ఖిద్యతే నో విషయైః ప్రమోదతే
　　న సజ్జతే నాపి విరజ్యతే చ
స్వస్మిన్సదా క్రీడతి నన్దతి స్వయం
　　నిరంతరానందరసేన తృప్తిః. 535

విషయాలు లభించినందువల్ల అతడు దుఃఖించనూ దుఃఖించడు, సంతోషించనూ సంతోషించడు. వాటియందు (విషయాల యందు) అతనికి ఆసక్తి ఉండదు. విరక్తీ ఉండదు. అతడు నిరంతరం బ్రహ్మానంద రసంతో తృప్తుడై, స్వయంగా తనలో తానే ఆనందిస్తూ క్రీడిస్తూ ఉంటాడు.

క్షుధాం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ. 536

ఆడుకొనే వస్తువు దొరికినంతనే పిల్లవాడు తన ఆకలిని, శరీర వ్యథనూ కూడా మరచిపోయి, దానితో, ఆడుకోవటంలో నిమగ్నుడైనట్లుగా, విద్వాసుడైనవాడు, తన అహంకార మమకారాదుల్ని వదలిపెట్టి తన ఆత్మలోనే ఆనందంగా రమిస్తూ ఉంటాడు.

చింతాశూన్య మదైన్య భైక్షమశనం పానం సరిద్వారిషు
స్వాతంత్ర్యేణ నిరంకుశా స్థితిరభీర్నిద్రా శ్మశానే వనే
వస్త్రం క్షాలనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి. 537

(బ్రహ్మవేత్త అయినవాని లక్షణాలు – అతని జీవన విధానం చెపుతున్నారు) బ్రహ్మవేత్త అయిన వానికి చింతగాని, దైర్యంగానీ లేకుండా లభించిన భిక్షాన్నమే భోజనం. నదీజలాలే త్రాగటానికి ఉపయోగించే నీరు, అతని పద్ధతి స్వాతంత్ర్యంతో, నిరంకుశంగా (ఎవరికీ లోబడని విధంగా) ఉంటుంది. అతనికి ఏవిధమైన భయమూ ఉండదు. అతడు అడవిలో, శ్మశానంలో

సైతం సుఖంగా నిద్రిస్తాడు. ఉతకటం, ఆరవేయటం లాంటి అగత్యాలు లేనట్టి దిక్కులే లేదా వల్కలాలే అతని వస్త్రాలు. నేలయే శయ్య అతని రాకపోకలన్నీ వేదాంత వీథుల్లోను జరుగుతూ ఉంటాయి. పరబ్రహ్మలోనే క్రీడిస్తూ ఉంటాడు.

**విమాన మాలంబ్య శరీరమేతద్**
**భున క్త్య శేషాన్విషయానుపస్థితాన్**
**పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా**
**యోఽ వ్యక్తలింగోననుషక్తబాహ్యః.** 538

అట్టి ఆత్మజ్ఞానియైన మహాత్ముడు ఈ శరీరం అనే విమానంలో కూర్చుండి–తన ఏ విధమైన అభిమానాలు లేని శరీరాన్ని ఆశ్రయించి–ఇతరుల ద్వారా తెచ్చి యీయబడిన సమస్త విషయాలనూ పిల్లవానిలాగా అనుభవిస్తాడు. కాని, యదార్థంగా ఏవిధమైన బాహ్య చిహ్నాలూ లేకుండా, బాహ్య పదార్థాల్లో ఆసక్తి లేకుండా ఉంటాడు.

**దిగంబరో వాపి చ సాంబరో వా**
**త్వగంబరో వాపి చిదంబరస్థః**
**ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా**
**పిశాచవద్వాపి చరత్యవాన్యామ్.** 539

చైతన్యరూపంలో ఉండే వస్త్రంగల ఆ మహాభాగ్యవంతుడు దిగంబరుడుగా, వస్త్రాలు కలవాడుగా, మృగచర్మాదుల్ని ధరించేవాడుగా, ఉన్మత్తుడుగా, బాలకుడుగా, పిశాచంలాగా స్వేచ్ఛగా భూమండలంలో తిరుగుతూ ఉంటాడు.

**కామాన్నీ కామరూపి సంశ్చరత్యేకచరో మునిః**
**స్వాత్మన్యైవ సదా తుష్టః స్వయం సర్వాత్మనా స్థితః.** 540

స్వయంగా తాను సర్వాత్మ భావంతో ఉంటూ, ఎల్లప్పుడూ తన ఆత్మలోనే సంతుష్టితో ఒంటరిగా తిరిగే ఆ ముని, తన కిష్టమైనప్పుడు తింటాడు. తనకు ఇష్టమైన రూపాన్ని (వేషాన్ని) ధరిస్తాడు. తన కిష్టమైనట్లు తిరుగుతాడు.

**క్వచిన్మూఢో విద్వాన్క్వచిదపి మహారాజవిభవః**
**క్వచిద్భ్రాన్తః సౌమ్యః క్వచిదజగరాచర కలితః**
**క్వచిత్పాత్రీ భూతః క్వచిదవమతః క్వాప్యవిదిత -**
**శ్చరత్యేవం ప్రాజ్ఞః సతత పరమానన్దః సుఖితః.** 541

బ్రహ్మవేత్త అయిన మహాత్ముడు ఒకచోట మూఢుడుగా, ఒకచోట విద్వాంసుడుగా, ఒకచోట రాజాధిరాజలాగా దర్జాగా కనిపిస్తాడు. ఒకచోట భ్రాన్తునిలాగా, వేరొకచోట శాంతునిలాగా, ఒకచోట కొండ చిలువలాగా నిశ్చలభావంతో పడిఉన్నట్లు కనిపిస్తాడు. ఇట్లా నిరంతరం పరమానందంలో నిమగ్నుడైన విద్వాంసునిలాగా, ఒకచోట సమ్మానితుని లాగా, ఒక చోట అవమానితునిలాగా, ఒక్కొక్కచోట అజ్ఞాతునిగా ఉంటూ ఎల్లప్పుడూ పరమానందంగా ఉంటాడు.

**నిర్ధనోఽపి సదా తుష్టో-ప్యసహాయో మహాబలః**
**నిత్యతృప్తోఽప్యభుంజానో-ప్యసమః సమదర్శనః.** 542

అతడు నిర్ధనుడైనప్పటికి సదా సంతృప్తుడై ఉంటాడు. అసహాయుడైనప్పటికీ మహా బలవంతుడై ఉంటాడు. భోజనం చేయకపోయినా తృప్తిగానే ఉంటాడు. విషమభావాలతో ఉన్నవాడిలాగా ఉన్నా, సమదర్శియై ఉంటాడు.

**అపి కుర్వన్నకుర్వాణశ్చాభోక్తా ఫలభోగ్యపి**
**శరీర్యప్యశరీర్యేష పరిచ్ఛిన్నోఽపి సర్వగః.** 543

ఆ మహాత్ముడు అన్నీ చేస్తూ కూడా ఏమీ చేయనివాడే! అతడు అనేక రకాల ఫలాల్ని అనుభవిస్తున్నా అతడు భోక్తకాడు. అతడు శరీరధారి అయినా ఆశరీరుడే! పరిచ్ఛిన్నుడైనా సర్వవ్యాపియే!

**అశరీరం సదా సన్తమిమం బ్రహ్మవిదం క్వచిత్**
**ప్రియాప్రియే న స్పృశతస్తథైవ చ శుభాశుభే.** 544

ఆ బ్రహ్మవేత్త ఎల్లప్పుడూ అశరీర భావంతో ఉండటంవల్ల అతనికి ప్రియప్రియాలు – ఇష్టా నిష్టాలుగానీ, శుభాశుభాలుగానీ అతనిని అంటవు.

**స్థూలాది సంబంధవతోఽభిమానినః**
**సుఖం చ దుఃఖం చ శుభాశుభే చ**
**విధ్వస్త డన్ధస్య సదాత్మనో మునేః**
**కుతః శుభం వాప్యశుభం ఫలం వా.** 545

దేహమందు అభిమానం ఉన్నవానికే స్థూల సూక్ష్మాది దేహాలతో సంబంధం ఉంటుంది. అట్టివానికే సుఖంగాని దుఃఖంగాని ఉంటుంది. శుభము, అశుభం అనేవి ఉంటాయి. దేహాదులతోడి బంధనం తెగిపోయినవానికి, సత్స్వరూపుడైన మునికి శుభా శుభ ఫలాలనేవి ఎట్లా ఉంటాయి?

**తమసా గ్రస్తవద్భానాదగ్రస్తోఽపి రవిర్జనైః**

గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్తా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్. 546

తద్వద్దేహాది బంధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమమ్
పశ్యన్తి దేహివన్మూఢాః శరీరాభాస దర్శనాత్. 547

యదార్థం తెలియకపోవటంవల్ల – అజ్ఞానంవల్ల, రాహువు చేత మ్రింగబడకపోయినా, మ్రింగబడినట్లుగా కనిపిస్తున్నందున, ప్రజలు భ్రమకులోనై సూర్యుడు రాహువు చేత మ్రింగబడ్డాడని అంటున్నారు. అట్లాగే, దేహాది బంధనాల నుండి విడివడిన బ్రహ్మవేత్త యొక్క అభాసరూపంలో ఉండే శరీరాన్ని చూచి, అజ్ఞాను లతనిని దేహంతో కూడి ఉన్నవాడని అంటున్నారు.

అహినిర్ల్వయనీవాయం ముక్తదేహస్తు తిష్ఠతి
ఇతస్తతశ్చాలమానో యత్కించి త్ప్రాణ వాయునా. 548

ముక్తపురుషుని యొక్క శరీరం పాము కుబుసంలాగా ప్రాణవాయువు చేత, ఇటు అటు కదిలించబడుతూ పడి ఉంటుంది. దాని యందు కర్తృత్వాభిమానం ఏమాత్రమూ లేనందున యదార్థంగా క్రియ ఉండదు; అని భావం.

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నత స్థలమ్
దైవేన నీయతే దేహో యథా కాలోప భుక్తిషు. 549

జల ప్రవాహ వేగానికి కట్టె క్రిందకి మీదకు లేస్తూ పడుతూ ప్రవహిస్తూ పోతూ ఉంటుందో, అట్లాగే, దైవం ద్వారానో ఆ బ్రహ్మవేత్త శరీరం సమయానుకులంగా భోగాల్ని పొందుతూ ఉంటుంది.

ప్రారబ్ధ కర్మ పరికల్పిత వాసనాభిః
సంసారివచ్చరతి భు క్తిషు ముక్తదేహః
సిద్ధః స్వయం వసతి సాక్షివద్రత తూష్ణిం
చక్రస్య మూలమివ కల్ప వికల్ప శూన్యంః. 550

ముక్త పురుషుని శరీరం ప్రారబ్ధ కర్మవల్ల కల్పితమైన వాసనల ద్వారా సంసారి యైనవాని శరీరం లాగానే భోగాల్ని అనుభవిస్తుంది. సిద్ధపురుషుడు మాత్రం, కులాలుని చక్ర మూలంలాగా, సంకల్ప వికల్ప రహితుడై సాక్షి భావంతో మౌనంగా ఉంటాడు.

నైవేంద్రియాణి విషయేషు నియుంక్త ఏష
నైవోపయుం క్త ఉపదర్శన లక్షణస్థః
నైవక్రియాఫల మపీషదవేక్షతే స
స్వానన్ద సాన్ద్రరసపాన సుమత్తచిత్తః. 551

బ్రహ్మవేత్త అయినవాడు అత్యంత సుఘనమైన ఆత్మానంద రసపానంవల్ల మత్తుడై, సాక్షిరూపంలో ఉంటూ, ఇంద్రియాలను విషయాల్లో లగ్నమూ చేయడు, వాటిని విషయాల నుండి మరలించనూ మరలించడు అతడు తన కర్మ ఫలం వైపుకు చూడను కూడా చూడడు.

**లక్ష్యా లక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠే త్కేవలాత్మనా**
**శివ ఏవ స్వయం సాక్షాదయం బ్రహ్మవిదుత్తమః. 552**

లక్ష్యము, అలక్ష్యము ఈ రెండు దృష్టుల్నీ కూడా వదలిపెట్టి, కేవలం ఒక్క ఆత్మస్వరూపంలోనే స్థితుడై ఉన్నట్టివాడు, బ్రహ్మవేత్తలలోకల్లా శ్రేష్ఠుడైన శివుడే! అంటే – తాను మినహా ఇతర వస్తువంటూ ఏదీ లేదు కాబట్టి అతనికి పొందవలసినదంటూ (లక్ష్యము) ఏదీ ఉండదు. అయితే, నిద్రించేవానిలాగా, జడంలాగా అతడు జ్ఞాన శూన్యుడు కాడు. అటువంటివాడే శ్రేష్ఠుడైన ఆత్మనిష్ఠుడు అని భావం.

**జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః**
**ఉపాధినాశాద్బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్. 553**

ఇటువంటి బ్రహ్మజ్ఞాని బ్రతికి ఉన్నా సదా ముక్తుడే! కృతార్థుడే! శరీరమనే ఉపాధి నశించిన పిమ్మట అతడు బ్రహ్మభావంతో ఉంటూ అట్లాగే అద్వితీయ బ్రహ్మంలో లీనమైపోతాడు.

**శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథా పుమాన్**
**తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః. 554**

నటుడు, విచిత్రమైన వేషాన్ని ధరించినప్పుడూ, ఆ వేషం లేనప్పుడూ కూడా పురుషుడే! అట్లాగే బ్రహ్మవేత్త, ఉపాధి ఉన్నప్పుడూ, ఉపాధి లేనప్పుడూ కూడా బ్రహ్మమే! అన్యమైన దేదీకాదు.

**యత్రక్వాపి విశీర్ణం సత్పర్ణమివ తరోర్వపుఃపతనాత్**
**బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ హి తచ్చిదగ్నినా దగ్ధమ్. 555**

చెట్టునుండి రాలిపోయిన ఆకులాగా, బ్రహ్మీభూతుడైన యతి యొక్క శరీరం ఎక్కడైనా రాలిపోవచ్చు. అది అంతకు పూర్వమే చైతన్యాగ్ని చేత దగ్ధం కాబడ్డది–ఆకు పండిపోయినట్లు!

**సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః**
**పూర్ణా ద్వయానన్దమయాత్మనా సదా**
**దేశకాలాద్యుచిత ప్రతీక్షా**
**త్వ జ్మాంస విట్పిండ విసర్జనాయ. 556**

స్వస్వరూప బ్రహ్మలో, ఎల్లప్పుడూ పరిపూర్ణమైన అద్వయానంద స్వరూపంతో ఉండే మునికి, ఈ చర్మం, మాంసంతో కూడిన ఈ మలమూత్ర పిండాన్ని వదలివేయటానికి దేశకాల యోగ్యత లేవీ అక్కర్లేదు; వాటికోసం వేచి వేచి ఉండక్కర్లేదు.

**దేహస్యమోక్షో నోమోక్షో న దండస్య కమండలోః**
**అవిద్యాహృదయగ్రంథిమోక్షో మోక్షో యత స్తతః. 557**

మోక్షమంటే హృదయంలోని అవిద్య అనే గ్రంథి నశించటమే! ఆ అజ్ఞాన గ్రంథి తెగిపోవటమే మోక్షం. అంతే తప్ప, దండాన్ని, కమండలాన్నీ వదలిపెట్టటం మోక్షం కాదు.

**కుల్యాయా మథ నద్యాం వా శివక్షేత్రేఽపి చత్వరే**
**పర్ణం పతతి చేత్తేన తరోః కిం ను శుభాశుభం. 558**

పండి, ఎండిపోయి, చెట్టునుండి రాలిపోయిన ఆకు, కాలవలో పడవచ్చు, నదిలో పడవచ్చు, శివాలయంలో పడవచ్చు, లేదా ఎక్కడైనా అరుగుమీద పడవచ్చు, దానివల్ల వృక్షానికి కలిగే నష్టంగాని, లాభంగాని ఏమీ ఉండదు.

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవద్
దేహేంద్రియ ప్రాణాధియాం వినాశః
నైవాత్మనః స్వస్య సదాత్మకస్యా -
నన్దాకృతే ర్వ్ృక్ష వదస్కిత చైషః. 559

వృక్షానికి ఆకులు, పూలు, పండ్లు లాగా నాశన మనేది, జీవునికి శరీరము, ఇంద్రియాలు, ప్రాణాలు, బుద్ధి మొదలైనవాటికే ఉంది, సదానంద స్వరూపము, స్వయం ఆత్మకు నాశన మెన్నడూ లేదు. అది వృక్షంలాగా నిత్యము, నిశ్చలంగా ఉంటుంది.

**ప్రజ్ఞాన ఘన ఇత్యాత్మలక్షణం సత్యసూచకం**
**అనుద్యో పాధికస్యైవ కథయన్తి వినాశనం. 560**

'ప్రజ్ఞాన ఘనం' అనేది ఆత్మలక్షణం. ఆత్మయొక్క సత్యత్వానికి సూచకం. విజ్ఞులైనవారు ఈ విధంగా అనువదించి-వర్ణించి-ఉపాధి కల్పితమైన వస్తువుకు మాత్రమే వినాశనాన్ని చెపుతారు.

**అవినాశీ వా అరేఽయమాత్మే తి శ్రుతిరాత్మనః**
**ప్రబ్రవీత్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు. 561**

"బృహదారణ్యకోపనిషత్తు 4-5-14 లో మైత్రేయితో యాజ్ఞవల్క్యుడు చెప్పిన మాటలు-"అవినాశీ వా అరే-యమాత్మానుచ్ఛిత్తి ధర్మా"-ఉదహరిస్తున్నారు. ఈ ఆత్మ అవినాశి,

దీనికి మార్పు అనేది లేదు. చావు లేదు. శరీరంతో ఈ ఆత్మకు ఉన్న సంబంధమల్లా – శరీర సంసర్గం వల్ల వచ్చిన పేరు మాత్రమే! శరీరం పోతే ఆ పేరు మాత్రమే పోతుంది, అని భావం. బృహదారణ్యక శ్రుతివాక్యం కూడా ఆత్మయొక్క సత్యత్వాన్ని సూచిస్తోంది–వికారాలు అయిన శరీరాదులు నాశనం కాగా ఆత్మ మాత్రం అవినాశిగా ఉంటుందని చెపుతోంది.

**పాషాణ వృక్షతృణ ధాన్యకటాండరాద్యా**
**దగ్ధా భవన్తి హి మృదేవ యథా తథైవ**
**దేహేంద్రియాసుమనఆది సమస్త దృశ్యం**
**జ్ఞానాగ్ని దగ్ధముపయాతి పరాత్మభావమ్. 562**

రాళ్ళు, వృక్షాలు, తృణాలు, అన్నం, గడ్డి, పొట్టు, వస్త్రాలు మొదలైనవన్నీ కాలిపోయి మట్టి అవుతాయి. అట్లాగే, దేహం, ఇంద్రియాలు, ప్రాణం, మనస్సు మొదలైనవన్నీ–సమస్త దృశ్య పదార్థాలూ–జ్ఞానాగ్నిలో దగ్ధమైపోయి పరమాత్మ స్వరూపం అవుతాయి.

**విలక్షణం యథా ధ్వాంతం లీయతే భానుతేజసి**
**తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే. 563**

సూర్యుని ప్రకాశం రాగానే, దానికి విరుద్ధ స్వభావం కల చీకటి, ప్రకాశంలోనే లీనమైపోతుంది. అట్లాగే, జ్ఞానోదయం కాగానే సమస్త దృశ్య ప్రపంచమూ బ్రహ్మంలో లీనమైపోతుంది.

**ఘటే నష్టే యథా వ్యామ వ్యోమైవ భవతి స్ఫుటం**
**తథైవోపాధి విలయే బ్రహ్మైవ బ్రహ్మవిత్స్వయమ్. 564**

కుండ పగిలిపోగానే అంతవరకు ఉన్న ఘటాకాశం, మహాకాశం అయిపోయినట్లుగా, ఉపాధి లయమైపోగానే, బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవుతాడు.

**క్షీరంక్షీరే యథా లిప్తం తైలంతైలే జలం జలే**
**సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః. 565**

పాలల్లో కలిసి పాలు, నూనెలో కలసి నూనె, నీళ్ళలో కలసి నీళ్ళు ఏకమైపోయినట్లుగా, ఆత్మజ్ఞానియైన ముని ఆత్మలో కలసిపోగా ఆత్మ స్వరూపుడే అవుతాడు.

**ఏవం విదేహకైవల్యం సన్మాత్ర త్వమఖండితమ్**
**బ్రహ్మభావం ప్రపద్యైష యతి ర్నావర్తతే పునః. 566**

అఖండమైన సత్తలోనే స్థితుడైయుండటం విదేహ కైవల్యం. ఇట్లా బ్రహ్మ భావాన్ని పొంది, యతియైనవాడు మళ్ళీ ఈ సంసార చక్రంలోకి రాడు.

**సదాత్మైకత్వ విజ్ఞాన దగ్ధావిద్యాది వర్ష్మణః**
**అముష్య బ్రహ్మభూతత్వా ద్బ్రహ్మణః కుత ఉద్భవః. 567**

బ్రహ్మ, ఆత్మల ఏకత్వ జ్ఞానరూపమైన అగ్నివల్ల అవిద్యాజన్మమైన శరీరాది ఉపాధులు దగ్ధమైపోగా, ఆ బ్రహ్మవేత్త బ్రహ్మమే అవుతాడు. ఇక బ్రహ్మకు మళ్ళీ జన్మ ఎక్కడిది?

**మాయాక్లృప్తౌ బంధమోక్షౌ నస్తః స్వాత్మని వస్తుతః**
**యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాస వినిర్గమౌ. 568**

బంధనము, మోక్షము అనేవి మాయవల్ల కలిగినాయి. అవి వస్తుతః ఆత్మయందు లేవు. క్రియాహీనమైన రజ్జువునందు సర్పప్రతీతి కలగటం, కలగకపోవటం అనేవి భ్రమ మాత్రమే– వాస్తవంగా లేవు.

**ఆవృతేః సద సత్త్వాభ్యాం వక్తవ్యే బంధమోక్షణే**
**నావృతి ర్బ్రహ్మణః కాచిదన్యాభావాదనావృతమ్. 569**
**యద్యస్త్యద్వైతహానిః స్యాద్ద్వైతం నో సహతే శ్రుతిః**

అజ్ఞానానికి సంబంధించిన ఆవరణశక్తి ఉండటంవల్ల బంధమూ, అది లేకపోవటాన్ని మొక్షము అంటారు. బ్రహ్మానికి ఆవరణ మనేది ఉండనే ఉండదు–బ్రహ్మానికి అతిరిక్తమైన వేరొక వస్తువంటూ ఏదీ లేదు కాబట్టి! కాబట్టి, బ్రహ్మము అనావృతం, బ్రహ్మానికి కూడా ఆవరణమనేది ఉన్నదని అంటే, అద్వైతమనేది సిద్ధించదు. ఇక ద్వైతమనేది శ్రుతిసమ్మతం కానే కాదాయె!

**బంధం చ మోక్షం చ మృషైవ మూఢా**
**బుద్ధేర్గుణం వస్తుని కల్పయన్తి**
**దృగివృతిం మేఘకృతాం యథా రవౌ**
**యతో-ద్వయాసంగచిదేకమక్షరమ్. 570**

బంధము, మోక్షము, ఈ రెండూ కూడా బుద్ధి యొక్క గుణాలు, మేఘంవల్ల మన దృష్టి కప్పబడినప్పుడు, సూర్యుడు కప్పబడ్డాడని అంటాము. అట్లాగే, మూఢులు వ్యర్థంగా – అనవసరంగానే – ఆత్మతత్వంలో వాటిని (బంధ మోక్షాలను) కల్పిస్తూ ఉంటారు. బ్రహ్మమనేది ఎల్లప్పుడూ అద్వితీయమే! ఎల్లప్పుడూ అసంగము, చైతన్యరూపము, ఏకైకము, అవినాశియైనదే!

**అస్తీతి ప్రత్యయో యశ్చ యశ్చ నాస్తీతి వస్తుని**
**బుద్ధేరేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః.** 571

పదార్థం అనేది ఉండటం, లేకపోవటం అనే జ్ఞానం, బుద్ధియొక్క గుణమే! నిత్యవస్తువైన ఆత్మయొక్క గుణం కాదు. బుద్ధివల్లనే ఒక వస్తువు ఉన్నదనిగాని లేదనిగాని అనుకుంటున్నాము.

**అతస్తౌ మాయయా క్లుప్తౌ బంధమోక్షౌ న చాత్మని**
**నిష్కలే నిష్క్రియే శాన్తే నిరవద్యే నిరంజనే.**
**అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్కల్పనా కుతః.** 572

అందుచేత, ఆత్మలో ఈ బంధమోక్షాలు మాయచేతనే కల్పింపబడ్డాయి. యదార్థానికి లేవు. ఎందుచేతనంటే, ఆకాశంలాగా నిరవయవము, నిష్క్రియము, శాంతము, నిర్మలము, నిరంజనము, అద్వితీయము అయిన పరమతత్త్వంలో కల్పన అనేది ఎట్లా సంభవం? కాబట్టి బంధమోక్షాలనేవి ఆత్మకల్పితాలు కావు–బుద్ధి కల్పితాలే!

**న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః**
**న ముముక్షుర్న వైముక్త ఇత్యేషా పరమార్థతా.** 573

కాబట్టి, యదార్థ విషయం ఏమంటే, ఎవనికీ నాశనం లేదు, ఉత్పత్తీలేదు, బంధమూ లేదు. సాధకుడూలేదు, ముముక్షువూ లేదు, ముక్తుడూ లేదు.

**సకలనిగమచూడాస్వాన్త సిద్ధాన్త రూపం**
**పరమిదమతిగుహ్యం దర్శితం తే మయాద్య**
**అపగత కలిదోషం కామనిర్ముక్త బుద్ధిం**
**స్వ సుతవదసకృత్త్వాం భావయిత్వా ముముక్షుమ్.** 574

ఓ వత్సా! కలిదోషం లేనివాడవు. కామనాశూన్యుడవు, ముముక్షుడవు. అయిన నిన్ను నా పుత్రునిగా భావించి, నేను సమస్త శాస్త్రాలకు శిరోభూషణమైనట్టి, మిక్కిలి గుహ్యమైనట్టి పరమసిద్ధాంతాన్ని నీకు ప్రకటించాను.

## శిష్యుని సెలవు

**ఇతిశ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః**
**స తేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్తబంధనః.** 575

గురుదేవుని ఈ వచనాలు విని, శిష్యుడు, వినయంతో గురువుగారికి నమస్కరించి, సంసార బంధనాల నుండి విముక్తుడై, గుర్వాజ్ఞను పొంది, అచటి నుండి వెళ్ళి పోయాడు.

గురురేవం సదానన్దసిన్ధౌ నిర్మగ్నమానసః
పావయన్వసుధాం సర్వాం విచచార నిరంతరమ్- 576

గురువుగారు కూడా సచ్చిదానంద వారాశిలో మగ్నమైన మనస్సుతో సమస్త ప్రపంచాన్నీ పవిత్రం చేస్తూ నిరంతరం సంచరించ సాగారు.

## అనుబంధ చతుష్టయం

ఈ శ్లోకాల్లో శ్రీ ఆదిశంకరులు అనుబంధ చతుష్టయాన్ని వర్ణిస్తున్నారు. ఏ గ్రంథానికైనా అనుబంధ చతుష్టయం ఉండాలి కాబట్టి! అధికారి, విషయము, సంబంధము, ప్రయోజనము అనేవి అనుబంధ చతుష్టయం.

ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదే నాత్మలక్షణమ్
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోప పత్తయే. 577

ఇట్లా, గురు శిష్య సంవాద రూపంలో, ముముక్షువులకు తేలికగా జ్ఞానం కలిగేటందుకై ఈ ఆత్మజ్ఞాన నిరూపణం చేయబడ్డది. (ముముక్షువు అయిన శిష్యుడు అధికారి, ఆత్మజ్ఞాన నిరూపణం అనేది విషయం, నిరూపింపబడేది నిరూపకుడు అనే సంబంధం ఉంది. ఆత్మజ్ఞాన సిద్ధి అనేది ప్రయోజనం.)

హి త మిమముపదేశ మాద్రియన్తాం
విహితనిరస్త సమస్త చిత్తదోషాః
భవసుఖ విరతాః ప్రశాంతచిత్తాః
శ్రుతి రసికా యతయో ముముక్షవో యే. 578

వేదాంత విహితమైన శ్రవణమననాదుల ద్వారా, ఎవరి చిత్తంలోని సమస్త దోషాలూ తొలగిపోయాయో, ఎవరు సంసార సుఖం యెడల విరక్తులై, శాంతచిత్తులై, శ్రుతిరహస్యాలను తెలుసుకొనే రసికులై, మోక్షకాములైనవారో అట్టి యతీశ్వరులు హితకరమైన ఈ ఉపదేశాన్ని గ్రహింతురు గాక!

